శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# సౌభాగ్య కామేశ్వరీస్తవము

(తిరుపతి వేంకటీయము)





[వెల రు ~~0—10—0~~ లు

1941



శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.

శ్రీమత్పరదేవతాయైనమః-

# పీఠిక

నే నెప్పుడైననేమి కామేశ్వరీ, అనెడిమకుటముతో నిప్పటికి సుమారు 15 వందలపద్యాలవఱకు వ్రాసి యున్నాఁడను. అందు మొట్టమొదటిది కామేశ్వరీశతకము. ఇది ముప్పదివత్సరముల ప్రాయములో రచించితిని. ఈయంశ మాశతకమునందలి—

మ॥ మన మీపాటికి శాంతమున్ సలుపు మంబా? సర్వభోగమ్ములు
ద్గనినాఁడన్ సగమాయె నాయువును సంస్కారుల్ "కలౌషష్టి"నా
వినమే? పైసగమేని "బ్రహ్మమువినా విశ్వంబు సర్వం బస
త్త"నుచర్చన్ గమనింప నిమ్మధికమున్ బ్రార్థింపఁ గామేశ్వరీ.

అనెడి పద్యమువలనఁ దేలెడిని. నాకు జాతకము వ్రాసిన ద్విభాషి వెంకన్నగారు—

" షష్టివర్షాః పరమాయుః "

అనిమాత్రమే వ్రాసిరి. దానిం బురస్కరించుకొని ముప్పది యేండ్లప్రాయములో వ్రాసిన కామేశ్వరిలో నేను—

' సగమాయె నాయువును '

అని వ్రాయవలసి వచ్చినది—ఇటీవల శ్రీ అమరవాది వెంకటప్పయ్య సిద్ధాంతిగారు షష్టి (60) వత్సరములు కాదనియు నెనుబదికి మించుననియు ననేకగ్రంథోక్తసూత్రముల నుదాహరించి సిద్ధాంతీకరించిరి. ప్రస్తుతవయస్సు డెబ్బదియొకటవవత్సరము పూర్తి కావచ్చినది. కావున రెండవవారిదే యుక్తమనుకోవలయును. (దైవోపాసనవినాగానాయుర్విజ్ఞానము దుర్లభమని ఆగ్రంథకర్తలే వ్రాసియున్నారు.) నేను ముప్పదియేండ్ల వయస్సు దాఁటినది మొదలు వ్యాధినిమ్నాలనముసక్ష

నౌషధసేవకన్న భగవత్సేవనే యెక్కువగా మన్నించి ప్రవర్తించు చున్నట్లు కొన్ని పొత్తములు తెల్పెడిని, వానిం జూపెదను—

(1) ఆరోగ్యకామేశ్వరి, (2) ఆరోగ్యభాస్కరము, (3) మృత్యుంజయస్తవము, (4) సౌభాగ్యకామేశ్వరి.

ఇవిమాత్రమే కాక శ్రీజయపురంమహారాజు విక్రమదేవవర్మ గారిని సందర్శించు సందర్భములోఁ జెప్పినపద్యములుకూడ— కామేశ్వరీ, అనుమకుటములోనివే(ఈపద్యములకువిక్రమచెళ్లపిళ్లచూ)మొత్తమివి యన్నియుఁగలిసి రెండువేలకుఁ దక్కువలో నుండవు.ఇందులో—

ఆ రో గ్య కా మే శ్వ రి.

రెండువందల పైచిల్లర పద్యములుమాత్రము ప్రత్యేకించి మాపెద్దచిరంజీవి యారోగ్యమునకు సబంధించినవి.ఆరోగ్యభాస్కర స్తవముకూఁడ జాలభాగము వానియారోగ్యమునకు సంబంధించినదే కాని తుట్టతుదను నావిషయముకూడ నుండును. ప్రకృతమైన సౌభాగ్య కామేశ్వరి యిప్పటికి మూఁడేళ్ళనాఁడు (68వ వత్సరమునం దన్నమాట) బొత్తిగా బలహీనత యేర్పడి ప్రారంభించినట్లు దీనిలోని మొట్టమొదటి పద్యములే చెప్పెడిని,ఇవియిన్ని పద్యములగు నని కాని యింతకాలము నేనుందునని కాని అనుకోలేదు. కొన్ని పద్యములు మఱియును, చేదస్త ముగా నుండునని వదలితినిగాని యట్లుకానిచో నివి వేయివఱకును గలవు. ఇవి నాజీవితకాలములోనే ప్రకటింపఁబడు ననికూడ నే ననుకొని యుండలేదు. ఏదో కవికిఁదోచినదెల్ల వ్రాసికొనుట కొందఱు కవుల కలవాటు, ఆరచన లోకము నెట్లు రంజించును? ఆకారణముచే దీనిని నేనై ప్రకటింపఁ దలంచుకోలేదు. ప్రకటించుటకుఁ గల్గిన కారణము తుట్టతుదిపద్యములు వక్కాణించుటంజేసి యిచ్చోడ విస్తరింపను. ఆయీగ్రంథమును కృతిగాఁ గోరిన కృష్ణశాస్త్రిగారు మిక్కిలి ఆస్తికులు, పండితులు, సద్గుణసంపన్నులు, ఒకవిషయముకాదు, పలువిషయములు

తెలిసినవారు. ఈయనకు స్త్రీ పురుషసంతాన ముభయమును గలిగియు నందుఁ బురుషసంతానము—

"పుత్ర మంతేచ కర్మణి"

అనునభియుక్తోక్తి ననుసరించునది కాకుండుటచే నాలోటు దీర్చికొనుటకై యొకచిరంజీవిని దత్తుఁగాఁ గైకొనియును దానితోఁ దృప్తిగైకొనక యీసంతానద్వారమునఁ దరియింపవలయునని మా యింటికి విచ్చేసి నాశిష్యుఁడు ప్రతాపకృష్ణమూర్తి శాస్త్రిముఖమునఁ నన్నుఁ గోరిరి." అప్పటికి నాయొద్ద నిదిమాత్రమే సిద్ధముగా నుంట చేతను వేఱొకటి రచించు నోపికలేకుంటచేతను దీని నిచ్చి యాయనను దృప్తిపఱిచితిని. ఇది మూఁడేళ్ళ కాలములో నప్పుడప్పుడు న న్నెదుర్కొన్న అనారోగ్యాదులను సూత్రప్రాయముగాఁ దెల్పు నాజీవిత చరిత్ర మనుకొనవచ్చును. ఆయనకు నన్ను స్వగ్రామము చీరాలకుఁ దీసికొనివెళ్ళి మిన్నగా సమ్మానింపవలయునని బోలెఁడుకుతూహలము కలదు గాని అందులకు నాఆరోగ్యము తగి యుండలేదు. మాగ్రామమునకేవచ్చి సమ్మానింత మనుకోర్కి కూడ నిటీవలఁ గల్గినది గాని ఆయనయారోగ్యముకూడ నందులకుఁ దగియుండనికతన నాయన సాహసించినను నే నందులకు సమ్మతింప లేకపోతిని, భవతు అది యెట్లో నెఱవేఱకమానదు, ఇద్దఱమును వృద్ధులము, రుగ్ణులము, జాతకానుభవము కల చేదస్తులము. దానిమీఁదనే యాధారపడి యీ కార్యమునకుఁ గడంగితిమి (ఎట్లో తప్పులతడకగానేని దీనిముద్రణము నెఱవేఱినది. దీనికి శుద్ధపత్రిక వేయవలసివచ్చినచోఁ జాలవిస్తరించును. మనపూర్వులు తమయనుభవమును బట్టియే

"తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమసురార్చనైః"

అని వ్యాధినివృత్త్యుపాయములలో దేవతారాధనముగూడఁ జేర్చి యున్నారు. మయూరుఁడు మొదలైన కవులవ్వారినుడిని ప్రత్యక్షీకరించిరి. జపహోమాదులు కర్మఠులకును దానములు ధనికు

లకును దేవతారాధనము కవులకును సులభములుగ నుండును. ఔషధ సేవకూడ నుండవలయును గాని కేవలము దీనిమీఁదనే యాధారపడి కృతకృత్యత సంపాదింపఁ దగినంతటి ధర్మకాల మిది గాదు. అట్టికాలము కూడ నున్నట్లు,

శ్లో॥ శీతోష్ణసుఖదుఃఖేషు సమః॥

ఇత్యాద్యార్యవాక్యములవలన నవగత మయ్యెడిని, ముఖ్యముగా దీర్ఘ (యాప్య) వ్యాధులవలనఁ జిక్కుపడువారు సుఖజీవనము చేయవలయునన్నచో దేవతారాధనమువంటి దేదియును లేదని నేను నాయనుభవమువలనఁ జెప్పఁగలను, వెంటనే గుణము కలుగలేదని విసుగుచెందువారికి దేవతారాధనముమాత్రమే కాదు, ప్రప్రథమనివారణోపాయమైన ఔషధసేవకూడ నిరుపయోగమే, కావున నోపిక గల్గి దేవతారాధనమునందుఁ బ్రవర్తించినచోఁ దప్పక విజయము కల్గి తీరునని నానమ్మకము—

"నా కవినాభావముగా శివస్మరణమే వ్యాపార మద్దానినే తేవులందుండి సుఖంచుచుంటిన్"

అని దీనిలో నేను వ్రాసినది నాయనుభవముం బురస్కరించియే ఆయీయనుభవ మొక్కనాఁటిది కాదు. ఒక్కయేఁటిదియును గాదు, సుమారు నలువదియేండ్లసంవత్సరములనుండి యలవడిన దని పాఠకులకు విన్నవించుచున్నాఁడను, ఇందలి పద్యములకుఁ బూర్వోత్తర సందర్భములు చదువరులు జాగ్రత్తగా గమనించుకోవలయును, ఒక విషయముంగూర్చి రచించినవి కాకుంటచే దీని కీయోగము తటస్థించినదని విన్నవించుచు దీనినింతతో ముఁగింతును.

'సర్వేజనా స్సుఖినోభవంతు'

గ్రంథకర్త.





శ్రీ అప్పాజోస్యుల కృష్ణశాస్త్రి దంపతులు.

శ్రీ మత్పరదేవతాయైనమః

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# శ్రీ సౌభాగ్యకామేశ్వరి-తిరుపతివేంకటీయము.

శా॥ శ్రీరామారమణాది నిర్జరశిరస్సేవ్యంబు సంసార సా
ఖ్యారామాంకురదోహదంబు పరితాపాసార మత్యంతశో
భారమ్యంబు పరార్థదాయకము నీపాదంబు మోదంబు పై
వాఱం గొల్తు నమస్కరింతు మదిసంభావింతుఁ గామేశ్వరీ॥ 1

*శా॥ ఆయుర్దాయముఁ గట్టిపెట్టితివి నా కారోగ్య మీవైతి వ
మ్మా! యేలాగున దీని భుక్తముగఁ జేయంగల్గుదున్ శక్తి లే
దా యెన్ వ్యాసునియంతవానికి భవన్మాహాత్మ్యపర్యాప్తియం
దాయీ వెంకనలెక్క యేమి? బల మిమ్మా! సుంత కామేశ్వరీ॥ 2

మ॥ బలమన్నన్ భవదీయతేజఃకణము నీబ్రహ్మాండభాండమ్ము లే
బలముంజేసియె కాలచక్రమున నేభంగిమ్ము లేకుండ వ
ర్తిలు, నే నిందొక దోమనే నగుదునే? దేవీ! ననున్ శక్తిమం
తులలో నొక్కనిఁ జేసి ప్రోచుటదియున్ దోసంబె? కామేశ్వరీ॥ 3

•మ॥ తృణమొక్కండటఁ బెట్టి దీనిఁ గదపుం డేటీ? భవద్బాహుగు
ర్వణముం జూచెదఁగాక నాఁగ దివిషద్వర్గంబు బెంగైడె నినుం

* టిప్పణి: వ్యాసులవారు కొన్ని వైష్ణవపురాణములున్నూ కొన్ని శైవపురాణములున్నూ రచించినపిమ్మట పరాశక్తి మాతంగీస్వరూపమునఁ బ్రత్యక్షమై తన ఆధిక్యాన్ని గూర్చి బోధించిన యితిహాసం పైపద్యంలో చూచుకోవాలి.

• టిప్పణి: గుర్వణము = పరాక్రమము. తేజఃకణము=తేజముయొక్క లేశము, (తేజము + కణము, అని ఛేదించుకోఁదగు) ఆయీపద్యంలో వున్న విషయము దేవీభాగవతం ౧౨వ స్కంధమునందున్నూ కేనోపనిషత్తునందున్నూ కలదు. చూచుకోఁదగును—

బ్రణుతిం జేసి క్షమాపణం బడుగదే? ప్రాణంబు నీతేజపుం
గణమే ప్రాణమనన్ బలంబ అదియే కామ్యంబు కామేశ్వరీ॥ 4

మ॥ బరువుల్ మోయుదు నంటినో? అరులం జంపంబోదు నిప్పంటినో?
తరు లెక్కన్ వలె నంటినో? మదవతీదాంపత్య మాసించి ము
ష్కరత న్నా కిడు మంటినో? గృహమునం గాలూది యిట్టట్టు నేం
దిరుగంజాలినం జాలు నంతవఱకే దీవింపు కామేశ్వరీ? 5

మ॥ బలమిా వెక్కడొ సంగ దేనియు వృథావాదాలకుం బోయి కో
ర్టులవెంటంబడి నీకు లజ్జ గొలుపన్ రోసంబు గల్పింపం గో
ర్టుల కేరేనియుం ద్రిప్పంజూచినను నెట్లో వెన్కకున్ దగ్గి సాం
జలిబంధంబు క్షమాపణం బిడుచు నేం జాటాదుం గామేశ్వరీ॥ 6

శా॥ అంబా! కోర్టులు పాండితీగరిమ మిా నర్వాంబులే యైనం బృ
థ్వీం బాలించు జమీనుదారులు మహావిద్వచ్ఛిరోమాళిపీం
ఠిం బాదం బిడ కేల తక్కుదురు? గోష్ఠీవేదు లవ్వారితో
డం బోరంగలరే! తదీయమగు ధార్ష్ట్యం బాంగి; కామేశ్వరీ॥ 7

మ॥ న్యాయ మిాక్షించిన యంశమేనియును సాక్ష్యం బన్యథాయున్నచో
నయనిర్ణేత యథార్థ మిట్టి దనుచున్ శాసింప దక్షుండు గాం
డయయో! బొంకెడివారికిన్ జయము గా కచ్చోట నీవెట్టివెం
కయ కెట్టుల్ జయ మబ్బుం బ్లీడరులకే గ్రాహ్యంబు కామేశ్వరీ॥ 8

మ॥ అసమర్థత్వముకల్మి నాసలుపు వ్యాఖ్యానంబు గా దిద్ది నే
ను సమర్థత్వము గాంచి మించు నలయానూనాంగు మిాసాల మే
ల్మిసిమిం బొల్చెడి ప్రాయమం దయిన నిట్లే యిందు వర్తింతు న
క్కసుకుం బొండితి కేటిచుట్టటికమోకామాక్షి! కామేశ్వరీ॥ 9

మ॥ కపటోపాయము కీర్తికాములు గొనంగాం బోరు కాపట్యపుం
గుపథానన్ బలి నాంగి వామనుండు శ్రీకొన్నాండె! సత్కీర్తి, ని

ద్రప్రకున్ సూచకమైన యీపథము విద్యాశూరులౌ వారు త్రో
క్కి పడంబో రపకీర్తిలో; యశముకై ‘కే’సేల కామేశ్వరీ॥ 10

శా॥ కేసుల్ కల్పనచేసి కోర్టు కతనం గీర్తిన్ గడింపంగఁ దా
మేసూరుల్ పరియతింపఁ బోరు యశ మెంచేనిన్ దుకాణాల లోఁ
బైసా యిచ్చి కొనంగఁ దగ్గ దగుచోఁ బైరీతికిన్ సాధ్యమా
సీ! సీ! పాండితిలేమి యెట్టికృతులం జేయించుఁ గామేశ్వరీ॥ 11

మ॥ యశ మార్జించుటపట్లఁ గోర్కి కడు శ్లాఘ్యంబె యగుంగాక తా
దృశవిజ్ఞుం డన్యతోక్తి దూరముగ వర్తింపన్వలెన్ గీర్తి తా
వశమౌ నప్పుడె దాని నిల్పికొనుటే పాండిత్య మప్పాండితిన్
గశ కేలంగొని యశ్వమట్లు నడుపంగారాదు కామేశ్వరీ॥ 12

శా॥ "రావమ్మా! యశమా!" అటన్న నదితా రాఁబోదు "పో పో" మ్మనన్
బోవన్ గాల్గదలింప దెవ్వనికడన్ బొచ్చెమ్ము లేకుండఁ దా
నావై వేగును గీర్తికాంత; కపటం బావంత చూపట్టినా?
తా వాలాటిది "హేయ" మంచువిడుచున్ దథ్యమ్ము కామేశ్వరీ॥ 13

మ॥ యశ మీలోకమునంద కాదు, పరమం దర్పించు సౌఖ్యంబు, తా
దృశసద్వస్తువు శాంతిదాంతియుతులౌ ధీరాగ్రణుల్ తక్క మా
దృశు లార్జించుట కల్ల, కొంచె మెటులో యేపూర్వపుణ్యాననో!
వశమయ్యున్ గృశమౌఁ గ్రమక్రమముగా వక్రించి కామేశ్వరీ॥ 14

శా॥ తిమ్మిన్ బమ్మిగఁ బమ్మిఁ దిమ్మిగ సమర్థింపన్ సమర్థుల్ ధనా
ర్థమ్మై "ప్లీడరు" లుండి కేసు నడుపం, దథ్య మ్మతథ్య మ్మత
థ్యమ్మం దథ్యము గాఁగఁ దేలు నిట; నీయాటల్ భవత్సన్నిధా
నమ్మం జేగతి సాఁగనేర్చు? నఖిలజ్ఞా! తల్లి! కామేశ్వరీ॥ 15

మ॥ ఇదివో, యైహికపున్విలాస మిది, తా 'నెన్నాళ్లు' మూనాళ్లు బా
ల్యదశాబద్ధులు దీనిచారిఁ బడుచో లాభించినన్ మాదృశుల్

ముదుకల్ దీనికి మ్రొగ్గుటున్నది మహామోహంబు, దుష్కీర్తిదో
హద మీమార్గము; దీన నేగుట యసహ్యంబంబ? కామేశ్వరీ॥ 16

మ॥ అస్పృతం బాడ భయంపడన్ వలె, జగమ్మందుండ మంగూర్చి యే
మనుచున్నారో? యెఱుంగఁగా వలయు "విద్యాస్పర్ధకన్" "గోష్ఠు"ల్తోఁ
బనియే మంచనఁ గొల్చె? ప్రాజ్ఞ; "లిదివో; వార్ధక్యమందుంగవుల్
పోషింపంగ కుకృత్యమం చనఁడె? యేమూర్ఖుండు కామేశ్వరీ॥ 17

మ॥ భగవన్నామజపంబు చేసికొన కిప్పాట్లేలపో? మాకు, నీ
పగ కాలాక్షము మూలభూతము పరిభావమ్ము వాదమ్ములోఁ
దగులం 'గో' ష్ఠిగఁ బాల్కు కెక్కుడి కళాదర్పంబా? పాండిత్యపుం
దగవుల్ దీర్పఁగ "గోష్ఠి" లేర్పడెనె? దుస్తంత్రమ్ము కామేశ్వరీ.18

మ॥ పదిమందిం దను నవ్వఁ గోష్ఠి కడకుం బంచాంగప్రంగట్టితో
ముదివగ్గుల్ కవు లేగకున్న యశ మామోదింపదే? తమ్ము, నే
మిది తల్లీ? ఇది హేయ మంచనఁగ రాదే! యెంత కీబాధ? యె
న్నదిదా దాపున దీన మంచియశమే ప్రాపించుఁ గామేశ్వరీ॥ 19

శా॥ జాతిన్ ఖ్యాతికిఁ దెచ్చుపోలె నెదిమో సంఘంబు చిత్తార్తిరుజి
ల్లాతీర్పంచును జూపుచుండు నది యేలాగున్నదో? నేఁటివి
ద్యాతత్త్వజ్ఞత గోష్ఠులందు సుకవుల్ తర్కించు నాలాటిచే
పాతివ్రత్యముగూడఁ గోష్ఠులె యిఁకన్ బాలించుఁ గామేశ్వరీ॥ 20

మ॥ మునులం దెవ్వరో గాని మోక్షము గనం బోరాఁగదా? కీర్తిం
గను టాలాటిదె సత్కవుల్; మఱి యటన్ గాపట్య మొందేని సా
ధన వాచోఁ బ్రకృతమ్మునందును నగున్ ధన్యేతరుల్ వ్యర్థపుం
బనులం గీర్తి గడింప నెంతు రిది యేపాపంబొ! కామేశ్వరీ॥ 21

మ॥ క్రతువుల్ చిత్తవిశుద్ధిఁ జేయు నితఁ డాకర్మంబు లేమాత్రమున్
గృతముల్ కాకయె చిత్తశుద్ధిగఁ బ్రవర్తించున్ భవత్పాదభ

క్తత యీనేరని శుద్ధి యేక్రితువు లేఁగానేర్చెడిన్? నీదుభ
క్తతయుండే మఖజాల మంతటికి నంతఖ్యాతి కామేశ్వరీ॥ 22

మ॥ అతిముఖ్యాఖ్యండ గురూపదేశములు లే వామ్నాయమంత్రమ్ములున్
స్తుతిసూక్తమ్ములు నాకు రావు మది నేదో వెట్టగా నీదు సం
స్తుతి గావించుటమాత్ర మున్నయది యాతుంచెన్ గటాక్షించి యు
న్నతికిం దెచ్చితి విప్డు డామయములోనన్ ముంతె? కామేశ్వరీ॥ 23

శా॥ పాణింబిమ్మన, వ్యాధి కోర్వఁగల దార్ఢ్యం బిమ్ము టంటిన్నినున్
ధ్యానంబుం బొనరింపఁగాఁ దగిన యూహాపోహ లిమ్మంటి నీ
కే నత్యంతము భక్తుఁడంగద? యొకో యీపీడ తగ్గించి వి
జ్ఞానంబుం గిరుఁకింపు మంటి నిదియే నాకోర్కి కామేశ్వరీ॥ 24

శా॥ చావన్నన్ భయ మందునట్టివె సమస్తపాణులున్; నేను న
ట్లే వైరాగ్యము గల్గి యుండియును; నింకేమన్న? నీరోగపున్,
దావంబున్ భరియింప లేక మృతికే ధన్యత్వ మర్పింతు నం
బా? పిలున్న క్షమించి నాదుమొఱ నుంతాలింపు కామేశ్వరీ॥ 25

శా॥ ఎన్నో సారులు నిన్ను వేడి మఱియెన్నెన్ వరాల్ గొంటి, నా
పన్నత్వంబు దరిద్రతాభరము సర్వంబున్ డిగందాని సం
పన్నత్వంబున కాకరంబ నయితిన్ భారంబుగాఁ దోఁచకే,
యున్నది నారుఱ మాఫ్రుమమ్మ? పడలేకున్నాఁడఁ గామేశ్వరీ॥ 26

మ॥ పది గా దిర్వది గాద యీరుజ ననున్ బాధింపఁగాఁ జొచ్చి న
ల్వదిపై నాలుగు దాఁటె వత్సరము, ఏ పాపిష్ఠరోగాన కే
నెద నొక్కించుక చోటొసంగియెనుమా? మెల్లెల్లో వర్తింతు నేఁ
డిది నాకున్ భరియింపరాద, యిఁకనీవే దిక్కు కామేశ్వరీ॥ 27

మ॥ ఇదియే బందనుసందు నిల్చె నను నెన్నేనేళ్లు; సంపన్నుఁగా
నిదియే నల్చె ననేకశిష్యులకుఁ దా నీరోగమే యొజ్జగాఁ

పొదలించెన్ ధ్రువ మేను దీనిభయమున్ బోనెట్టఁగా లేక నె
మ్మదిగా నొక్కట నిల్చితి న్నిజముసుమ్మీ; తల్లి కామేశ్వరీ॥ 28

మ॥ ప్రతిరేయున్ దెలవాఱుజాము నను నిర్బంధించి బాధించి ప
క్రితచూపించెడి దీరుజాభరమె మేన్ గంపించు నిద్రానిపే,
ర్మతికిందోఁచిన; నేమి చెప్పుదుఁ బవల్ మాత్రై కనన్ రాద యీ
గతి బందర్పురి నేగెఁ గాల మెటులో కళ్యాణి కామేశ్వరీ॥ 29

మ॥ ఇదియే నీవయి నీదుభర్తవయి నాకిచ్చెన్ గదున్ భక్తి నా
ర్తిదముల్ రోగములయ్యు దేవునెడ భక్తింగూర్చు నారోగ్యసం
పదకున్ భక్తికిఁ జాల దవ్వు, భరియింపన్ రాక యీరోగమున్
దుద ముట్టింపు మటంచు వేడెదను నిన్నుఁగా దల్లి! కామేశ్వరీ॥ 30

*శా॥ నీసత్తన్ గణియింప కూరకయ పన్నెం దాఁ బురాణమ్ము లా
వ్యాసుం, డంతట నీకుఁ దోఁచినది సత్యంబుం బ్రబోధించు సం
తోసం; బాతని బొంద దింపితివి నిన్నుం దెల్పి విజ్ఞానపున్
దాసున్ జేసితి వట్టినీవు నను మన్నన్ లేవె? కామేశ్వరీ॥ 31

శా॥ మాతంగీ! భవదీయమామహిమ మామ్నాయమ్ములే చెప్ప లే
వోతల్లీ! వివరింప నేరుతునె? నే నూహించి? దూరోగపున్
గోతన్ ముంచక యుద్ధరింపు తటితో, గో డంద లేకుంటి స
ర్వాతీతంబు భవత్కటాక్ష మెదిసేయన్ లేదు కామేశ్వరీ॥ 32

మ॥ పయికిన్ వ్యాధి కనంగరా దొరుల కేచం బించుకే నీమ త
ద్దయు సారమ్ము హరించు దేహబల మద్దానం గృశించున్ భవ
ద్దయ కేదేనియు సాధ్యమే యిది యసాధ్యం బౌనె? హబ్బున్నఁ గా
కియుఁబోలెన్ బరుగెత్తు నే నెటేఁగియే కేల్ మోడ్తుఁ గామేశ్వరీ॥33

---

* టిప్పణి: ఈపద్యంలో లోగడ 2వ పద్యపు టిప్పణి నను సంధానించు
కోవలెను.

శా॥ మందు ల్లేవని కాదుసు మ్మవియు నేమాత్రమ్ము నీసత్కృపా
స్యందం బబ్బనిచో ఫలింపవు భవత్సాహాయ్యమే యున్నచో
మందే యక్కఱ లే దెఱుంగుదు భవన్మంత్రంబు సర్వాఘముల్
ఖండించున్ గలిగించుఁ బుణ్యగరిమన్ గొండంత కామేశ్వరీ॥ 34

మ॥ తెలియం జాల యథార్థ మీవొ శివుఁడో దేహమ్మునందున్ బలం
బలమం జేయుచునుండి రింత నిజమే యాఁ గానిచో నాకు నీ
బల మెందుండి లభించెఁ జిక్కియు బలభ్రాజిష్ణు వౌచుంటి నీ
బలమే కావలె నింక నెట్టితి రుజాపాయమ్ము కామేశ్వరీ॥ 35

మ॥ పగలున్ రేయును నొక్కరీతి రుజతోఁ బంతమ్ము సాధించి హె
చ్చుగ యుద్ధం బొనరించుచుంటిఁ గరిరాజుంబోలె సత్త్వంబు త
గ్గఁగదా? హెచ్చఁగ నేల? నీదుదయయే కొండొక్క తోడయ్యె ది
క్కగుపట్టెన్ బడనెట్టనేర్చితి రుజాపాయంబు కామేశ్వరీ॥ 36

శా॥ తప్పు ల్లెక్కకుఁ దెచ్చుచో నిలుతురే? దాసుల్; పొరి న్నన్నిటుల్
ముప్పుందిప్పలఁ బెట్టనేఁటికి వినమ్రు; న్నేఁటి కాంగ్రెస్సు వా
రప్పుల్ దీర్చుప్రణాళికం దెలిపినట్లైనం గృపం జూచుచోఁ
దప్పున్ వేగఁగఁ జాల మ్రొక్కెద భవద్దాసుండఁ గామేశ్వరీ॥ 37

*మ॥ కల రెందేనిఁ గుబుద్ధులౌ సుతులు లోకమ్మందుఁ; దల్లుల్ కుబు
ద్ధులుగానుండ రటంచు శంకరుఁడనెన్ దుర్బుద్ధినే యన్ము చెం
పలు వాయింపు మనుగ్రహింపుము ననున్ బాధించు రోగంబు న
వ్వలికి న్నెట్టఁగఁ జాలి మానుటది భావ్యం బౌనె? కామేశ్వరీ॥ 37

మ॥ రవి కుష్ఠ మ్మడఁగించెఁ బద్యముల నారాధింపఁగా నొక్కస
త్కవికిన్; మూకత, బాపితీ వెఱిఁగియే ధ్యానించెదన్ ద్వత్కృపా
భవభూతిన్ గవితకా; ననుం గలఁచునీపాపిష్ఠరోగంబు నా
కవనంబుం గొని సంహరింపు మనుచుం గైగెమోడ్తుఁ గామేశ్వరీ॥ 38

* టిప్పణి: శ్లో॥ కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా నభవతి॥

మ॥ కడతేర్పం దలపెట్టి వచ్చినటులుం గన్పట్టె నీరోగ; మొ
క్కఁడు బాధించుచునె దీనికోర్కి; మిగులం గోడందుచున్నాఁడ నీ
యడుగుల్ దక్క శరణ్య మేమియును లే దావంత యీదీను నీ
కడగంటన్ గనవేని మాయమగు రోగంబెల్లఁ గామేశ్వరీ॥ 39

శా॥ ప్రారబ్ధం బనుభూతిఁదక్కఁ జెడదప్పా? యన్న నౌఁగాక ని
న్నారాధించెదఁ బద్యపుష్పముల నా కద్దాన సౌఖ్యంబు చే
కూరున్ జేకూఱకున్న నన్ సరియె సద్గోష్ఠి వినోదంబు సం
సారమ్మున్ గడుసారవంతముగ నిష్పాదించుఁ గామేశ్వరీ. 40

శా॥ ఏసారమ్మును లేని సంసృతియెడన్ హృద్యమ్ములౌఁ గాశికా
వాసమ్మున్ దివిజాపగాజలము విద్వద్గోష్ఠి సాంబాంఘ్రిపూ
జాసంసక్తియు నంచుఁ బెద్దలు వచింపన్ వింటిఁ గాఁబట్టి యి
ట్లే సాఁగించెద నీపయిం గవిత, పై నేమైనఁ గామేశ్వరీ 41

శా॥ ప్రాణం బెంతకు మేననుండునొ? నినుం బద్యాలతో నంతకు
న్నే నారాధన సేయఁగావలయు నింతే కోర్కి నా కట్టివి
జ్ఞానంబుం గరుణింపుమమ్మ? అదియే చాలున్ భవద్రూపని
ధ్యానం బీయని శ్రేయ మున్నె? యిహాముం దన్యత్రికామేశ్వరీ॥

శా॥ సన్న్యాసమ్మును బుచ్చికొంద మనునిచ్ఛ న్నాకు నీరోగమే
అన్యాయమ్ముగ నడ్డె, ముక్తికి భవద్ధ్యానంబె కాఁగాచి నన్
ధన్యున్ జేయఁగదమ్మ నీస్మరణపైఁ దాత్పర్యము న్నిండఁచి; ఆ
ధన్యుల్ గాంచెడి శ్రేయ మిచ్చి? రుజకున్ దప్పించి; కామేశ్వరీ॥ 43

మ॥ జననీ! నీపయి నెమ్మది న్నిలుపుచో సన్న్యాసి కాకుండియుఁ గ
గను ముక్తిన్ మదినిల్పఁడో? యతియునై కాంచండుపో! ముక్తియిం
దనుమానంబణుమాత్రమున్న యదియే? యాఁటం తేమతిస్సాయంట
ఛనదే? గీత, తదర్థ మీరుజమె నా కార్జించెఁ గామేశ్వరీ॥ 44

మ. ఇది యంచున్ గద మొందు లేనియెడ నే నీఘోరసంసారభూ
రిమరాశాలతలందుఁ జిక్కుకొని దారిం దెన్నునున్ లేక యుం
డుదుఁగానీ నినుఁ గొల్చుసద్గతిని గన్గోనేర్తునే? మంచికే
యిది నాకున్ ఘటియించితంచు మదిలో నీక్షింతుఁ గామేశ్వరీ॥ 45

మ. భగవంతుం డెది యిచ్చునో తనకు సౌభాగ్యంబొ దౌర్భాగ్యమో
అగుఁగాకయ్యది దానికే హృదయ మాహ్లాదంబు కైకోవలెన్
దెగులంచున్ దెగడంగ నేమియగు "నాదేవుం డెఱుంగండె? తా
నగుఁబాటుంబనులం బొనర్పఁ"డని యెన్నన్ మేలు కామేశ్వరీ॥ 46

*మ. ప్రకృతం బించుక పీడ తగ్గినటు కన్పట్టున్ భవత్సత్కృపా
శకలంపుం జలవేయగున్, మును భరించన్ రాని దిప్పెట్టు లిం
చుక క్రూరత్వము తగ్గు లేకునికి; నీస్తోత్రమ్ము వ్యర్థమ్ము గా
దిఁక ముందున్ సుఖ మిచ్చి తీరునని యేనెంతుఁ గామేశ్వరీ॥ 47

మ. మరలన్ వ్యాధి ఘనీభవించి ననునొంపంజొచ్చె నోతల్లి, నీ
కరుణాలేశ మొకింత నాపయిని జిల్కంగావలెన్, లేనిచో
మరణం బేనియు సత్వరమ్ముగ ఘటింపంగావలెన్ రెంటిలో
మఱి నీకెయ్యదినచ్చు నయ్యదియ కామ్యం బంబ కామేశ్వరీ॥ 48

మ॥ బ్రతుకన్ జేసితి వెంతొ గౌరవముగా బ్రహ్మాండమా కీర్తి క
ల్పితముం జేసి యనుగ్రహించితివి నీలీలావిశేషమ్ము ల
ద్భుతముల్ నేఁటికి నిట్టిదుష్టరుజచే దోరించుచున్నావు నా
కితికర్తవ్యము దోఁప దెందులకు నీవే దిక్కు కామేశ్వరీ॥ 49

మ॥ పర మీనేర్చు నిహమ్మొసంగు సకలాపత్తుల్ తొలంగించు నీ
చరణారాధన, పూర్వజన్మకృతదుష్కర్మమ్ములం గూడ జ

---

*టిప్పణి: ఇంతవఱకు రచనసాఁగినంతలో వ్యాధి చాలా లొంగినట్టుగా కనపడింది గాని ఆగుణం కొలఁదిరోజులుమాత్రమే నిలిచి మళ్లా బాధించుటనుగూర్చి పైపద్యంలో చెప్పఁబడుచున్నది.

ర్జరితంబౌటల్ సరించు నీపదరజస్సంసక్తి నన్నున్ దురు
ద్ధరపీడం బడఁద్రోయు టెక్కడివిచిత్రం బంబ! కామేశ్వరీ. 50

మ॥ జ్వరమో! యేదియొ! వచ్చికొన్నిదినముల్ బాధించియేగించెమో;
మరణంబున్ ఘటియించుటన్నదియె సామాన్యంబుగాఁజూతు మే
దురితమ్ముం బొనరించినాఁడనో? కడున్ దోఁరించుచున్నావు నీ
చరణారాధకుఁడం గృపం గొలుపు మీషత్తేని కామేశ్వరీ. 51

మ॥ బ్రతికెన్ బెక్కులు వత్సరమ్ము లనుటల్ భాగ్యంబె? యెవ్వానిజీ
విత మాశ్వాసనివృత్తి సౌఖ్యయుతమై విజ్ఞానసౌభాగ్యసం
యుతమౌ వానిది జీవితం, బితరమో? కాఁబోదు నా కట్టిజీ
వితమే నిన్నొసగంగ వేఁడెదను దేవీ! సారెఁ గామేశ్వరీ. 52

•మ॥ అఱువై పై నొకయెన్మిదేం డ్లరుగఁ గానయ్యెన్, వయస్సిప్పు డీ
కఱకున్ రోగము దుర్భరం బగుచు నన్ గాఱించెడిన్ బూర్వ మే
సరకే చేయఁగలేదు వార్ధకదశాసంప్రాప్తిచే లోఁగితిన్
గరుణాలేశము నించి వ్యాధికిఁ దుదిన్ గల్పింపు కామేశ్వరీ. 53

మ॥ మృతి కీరోగమె యుండి తీరవలెనే? యేదేనియుం జాలుఁ గొ
ల్చితి నేమాత్రమొ నిన్నుఁబూర్వజనిలో, శ్రేయమ్ములన్ గంటి ని
ల్పితి నిష్ఠన్ మది నీదుపాదయుగళిన్ వేఱెద్దియుం గోర న
న్నతిగా నొంపకు హాజరయ్యెద 'బులా' వన్నంతఁ గామేశ్వరీ. 54

---

• టిప్పణి:యీపద్యంలో వున్న "అఱువై" అనే ప్రయోగం శ్రీనాధమహా కవి సార్వభౌమునికి సమ్మతమైనట్లు ఆయనగ్రంథములలో వున్న అసకృదావృత్తి ప్రయోగాలవల్ల స్పష్టపడుతుంది. కాని ఆతఁ డట్లు ప్రయోగించినప్పంటికీ మనం ప్రయోగించడానికి వల్లకాదనే శుద్ధచ్ఛాందసులు కొందఱు బయలుదేఱినారు. దీన్ని గుఱించి కాదుగాని వేఱొక ప్రయోగాన్నికూర్చి ఆంధ్రభాషాపరిషత్పత్రికలో నిన్న మొన్న చదివి ఆశ్చర్యం వేసింది. నాకు యీవయస్సులో బాధిస్తూ వున్న ప్రస్తుత రోగంకంటేకూడా యీలాటివారి అనుచితపుసిద్ధాంతాలు బాధకాలుగా వుండడం చేత యీరోగప్రస్తావన గళపద్యపు టిప్పణిలో యెత్తుకున్నానని విజ్ఞప్తి.

మ॥ తగుమాత్రమ్ము తనూబల మ్మొసఁగి; నిన్ ధ్యానింపఁగాఁజాలు శ
క్తిఁ గరిష్ఠమ్మగు బుద్ధి నిమ్ము జననీ! కేల్మోడ్చి ప్రార్థింతు నీ
తెగులున్ బాపుము నాదుజీవితము నిస్తేజమ్ము గానీకు మేఁ
బగలున్ రేయియు దీని కోర్వఁగలనా? పాలింపు కామేశ్వరీ॥ 55

♦మ॥ అదిగో! వచ్చుచునున్నవాఁడు శనిలో సంతర్దశానాథుఁడై
అదనైన కేతువు; వాఁడు మారకుఁడు తా నౌనంచు జ్యోతిఃకలా
విదు లేకొందఱో వల్కి, రింకను బయిన్ విజ్ఞుల్ మఱింకొంద ఱా
ప్పుదు రాయుస్సును; దీనికేమి సుఖముం బూరింపు కామేశ్వరీ॥ 56

మ॥ "శని వోవున్ బుధుఁ డేగుదెంచు"ననుచున్ శాస్త్రమ్ముశోధించి య
ప్పనసిద్ధాంతి వచించె, మానవున కీయంశమ్ము దుర్జ్ఞేయ మం
దునకు న్నీ విడుశాప మున్నయదిగా? తో, డీవిచారమ్ముతోఁ
బనియే మామయపీడమాత్రముడుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥ 57

మ॥ గతకాలమ్మునఁ జేసినట్టి పనియుం గన్పట్ట దీపై ననా
గతకాలమ్మునఁ జేయఁబోవునదియుం గన్పట్ట దీపుట్టు వే
కృతికై యేర్పడె నన్న ప్రశ్నకు జవాబే లేదు సంసార మీ
గతిఁ ద్రిప్పున్ గనఁబోకు జ్ఞానఘను లీకష్టంబు కామేశ్వరీ॥ 58

శా॥ "ఏదో! మిణ్కొను నాదుజాతకము భూమీశత్వ మార్జించె సం
పాదించెన్ యశ మెందఱో చెలులు నావాల్లభ్య మర్థించి రిం
కేదీ? నాకిల సాటి" యం చెగురులే యెందున్ గనన్వచ్చుఁ గా
నీ దోషజ్ఞులు సర్వమున్ వృథ యటం చీక్షింత్రు కామేశ్వరీ॥ 59

*మ॥ భగవంతుండె ప్రజన్ సృజించె నతఁడే పాలించుచున్నాఁడు వాఁ
డగుపట్టండు లయించువాఁడు నతఁడే యందుర్గదా? విజ్ఞు; లా

* టిప్పణి: "అతఁడ నేను నేన యాతఁడు" అని దేవీభాగవత తృతీయస్కంధమున నిరుపురకును అభేదము చెప్పఁబడి వున్నది. కావున నీపద్యంలో అమ్మ వారినిగూర్చి— నీవు భగవంతుఁడవు అని చెప్పుట తప్పు గాదని తెలివిడి—

♦ కేతువు మారకుఁడు కాలేదని యెఱుఁగఁదగు

భగవంతుం డెవరన్న? నీవగుదు నీప్రాణేశుఁడుంగూడ నౌఁ
దెగ దీవాదము, నమ్మితి న్నిను మదార్తిం బాపు కామేశ్వరీ॥ 60

మ॥ ఒకఁ డేమో? శ్రుతి నిన్నుఁజెప్పు మఱి యింకొక్కండు నీభర్తకున్
సకలేశత్వము గట్టిపెట్టు, మఱి విశ్వస్రష్టతండ్రి న్నియా
మకుఁగాఁ జెప్పు నొకండు, తల్లులకుఁ బ్రేమం బగ్గల మ్మంచు నా
ర్తికి నే లోఁగి నినున్ భజింతు రుజ వారింపంగఁ గామేశ్వరీ॥ 61

మ॥ నినుఁ దల్లీ! యని పిల్వవచ్చు మఱి తండ్రీ! యంచునుంగూడఁ బే
ర్కొనవచ్చున్ గద! లింగభేదములు నీకున్ లేవు స్త్రీరూపక
ల్పనకున్ హేతు వగమ్యగోచరము విద్యచ్ఛ్రేష్ఠులే తక్క ని
న్నను నిక్కమ్ముగ నిర్ణయించి మదిఁ గన్గో లేరు కామేశ్వరీ॥ 62

శా॥ అమ్మా! చల్లనికొండకూఁతురవు నిన్ ధ్యానించునా కెట్టితా
పమ్మున్ సోఁకఁగ నీక ప్రోవు మని యభ్యర్థింతు వేదాంతసా
రమ్ము న్నెమ్మది కెక్కఁజేయు మనియుం బ్రార్థింతు నన్నేచురో
గమ్మొం బూర్తిగ రూపుమాపు మనియుం గై మోడ్తుఁగామేశ్వరీ.63

మ॥ కృతదోషమ్ములకెల్ల నిష్కృతులు వేఱేచూపు రమ్మన్న నా
కితికర్తవ్యము లేదు నీపదరజస్సేతక్క వేఱొక్కని
ష్కృతి నే నెక్కడనుండి తెత్తు? నెటులో యీపద్యముల్ నానమ
స్కృతులుం గైకొని నన్నుఁ బ్రోవవలె నార్తింబాపి కామేశ్వరీ॥64

మ॥ ఇతరాపేక్షకు లోను గానిగతి నన్నేలాగు కాపాడెదో?
గతి నీవే యని నమ్మికొంటిఁ గవితన్ గానన్ సమర్పింతు స
న్నుతిఁ జేతున్ భజియింతు మ్రొక్కెదు యజింతున్ సర్వదా నీపద
ద్వితయమ్ము న్మది నిల్పికొల్తు శరణార్థిం దల్లి! కామేశ్వరీ. 65

♦మ॥ మొఱ నాలించితి పీడమాన్పితివి మున్ మూఁడేండ్లకున్ వెన్క నీ
శ్వరుఁ బ్రార్థించి యనుగ్రహింపఁ బడితిన్ సత్యమ్ము వాక్రుత్తు నీ

♦ టిప్పణి: యీపద్యంలో వున్న మృత్యుంజయుణ్ణిఁ గూర్చిన స్తోత్రం మృత్యుంజయ స్తవ" మనే పేరుతోఁ బ్రకటింపఁ బడివున్నది.

శ్వరుఁ డాలస్యము చేసె నీవు త్వరలో బాధ న్నివారించి తి
ద్దఱిలో నేఁ గనిపెట్టినట్టి దిదెభేదం బాబ కామేశ్వరీ. 66

మ॥ పితృచిత్తానకు మాతృచిత్తమునకున్ భేదమ్ము మీనాఁటిదం
పతులందే కనుపట్టునప్పు డిఁక నంబా! లోకసామాన్యదం
పతులం జేగతి లేక యుండుఁ బితృప్రేమం బెంత హెచ్చించి వ
ర్ణితముం జేసిన మాతృప్రేమమునకున్ దీటౌనె? కామేశ్వరీ. 67

మ॥ ధనమా! యిచ్చితి కీర్తి నిచ్చితివి సంతానమ్ము నైసేసి తెం
దును లోపం బగుపట్టకుండుగతి సంతోషమ్ము గల్పించి తీ
తను వెప్డో విడనాడునట్టిదియె అందాఁకన్ సుఖంబిచ్చి మీఁ
దను నీసన్నిధిలో నొసంగు మిదియో దాస్యమ్ము కామేశ్వరీ. 68

శా॥ కాశీపట్టణ మేగి క్రుంకులిడి యాకాశీశు సేవించి వి
ద్యాశన్ గొండొకకాల ముండి నిను నిధ్యానించి పూజించి యీ
దేశంబున్ జనుదెంచితిన్ బ్రతిమ నీచే యొండు గైకొంచు స
ర్వాశాపూర్తియు నాకు నాప్రతిమయే అర్పించెఁ గామేశ్వరీ. 69

మ॥ ఎప్పు డాయిత్తడిబొమ్మ వచ్చి కృప నాయింటం బ్రవేశించెనో!
అపుడే యెత్తికొనె న్ననున్ సిరియుఁ గీర్త్యౌదార్యముల్ తోడుగా
నృపతుల్ నాయెడఁ జూపుపేరిమికి మేరే లేదు నీతోడు నేఁ
గృపణత్వమ్మె యెఱుంగ నాపిదపఁ దల్లీ! నమ్ము కామేశ్వరీ. 70

మ॥ జననీ! యిత్తడిబొమ్మ నాగృహమునన్ సాక్షాత్కృతిం జేసె నెం
టనె తాఁ బుత్తడి నించెఁ జిత్రమిది వంద్యంబయ్యె నాపేరు; భా
జన మేనైతి జగమ్ముసత్కృతికి; నీసర్వంబు నీసత్కృపా
జనితంబే యని నాకుఁ బూర్ణముగ విశ్వాసంబు కామేశ్వరీ. 71

♦శా॥ కాశీవాసిని నన్నపూర్ణను నినుం గళ్యాణిఁ బూజించి ఆ
వేశోదంచితమైన "అష్టకము" నర్పింపంగ, సౌభాగ్యపున్
రాశింగా నను మార్చి వేసితివి, పారంపర్యతస్థాయిగా
నాశీర్వాదము దాని కిమ్మనుచు ని న్నర్థింతుఁ గామేశ్వరీ॥ 72

*మ॥ మనవిన్ జేసెద నష్టకాన నొకటన్ "మత్సద్మని స్థీయతా;
మని దొర్లెన్ వచన మ్మొకం, డదియు నీయంగీకృతిం బొందఁగ
గ్లెను నిక్కం బటు గాకయున్న నెటు లీలేకిన్ ఘనంబుగాఁ బొరిన్
ధనధాన్యాదులు చేరి కొల్చు ననుచుం దర్కింతుఁ గామేశ్వరీ॥ 73

♦మ॥ ఘన మే మున్నది నాకు నీదయవినా దారిద్ర్యపుంజంబునై
జననం బందితి నీవెఱుంగవె! ననున్ సంపన్నులౌ వారిలో
న నొకేనినిన్ జమకట్టఁ జేసి వెస "నిన్ కంటేక్సు నోటీసు" న
న్కను రప్పించితి వెంత పేర్మి గలదో! నాపైనఁ గామేశ్వరీ. 74

---

♦ టిప్పణి: అష్టకము=అన్నపూర్ణాష్టకము. "మాతా త్వం జగతా మ్మతా" అనే శ్లోకంతో అరంభింపఁబడినది "కాశీనాథమనోహరే గురుకృపాపూర్ణే ఽన్నపూర్ణేంబికే" అనే మకుటం కలది యీ "అష్టకం" అన్నపూర్ణను స్వయంగా పూజించిన సమయమందే చెప్పఁబడినది యేదో కొంతసొమ్ము కట్టినయెడల స్వయంగా పూజించడానికి అక్కడియధికారులు సమ్మతింతురని యెఱుఁగనగు—

* టిప్పణి: మత్సద్మని=నాయింటియందు, స్థీయతామ్ నివసింపఁబడుఁగాక. త్వయేతి శేషః (నీచేత అని కర్తృపదానికి అధ్యాహారము) ఆయీపదం దైవచోదితంగా పడిన శ్లోక మిట నుదాహరిస్తాను—శ్లో॥ నో ముక్తిం నచ సంపదం నరుచిరాం విద్యాం నశక్యోన్నతం. యాచే; కింతు మయాఽస్తి లభ్య మధికం త్వత్తః పున ర్వాంఛితమ్, ఆలస్యేన కి ముచ్యతే శృణు సదా (మత్సద్మని స్థీయతాం) కాశీనాథమనోహరే! గురు కృపాపూర్ణే ఽన్నపూర్ణేఽంబికే॥ం॥

•టిప్పణి: నోటీసు రావడమున్నూ ఆఫీసుకుఁ గొన్నివత్సరాలు తిరగడమూ మాత్రం జరిగిందిగాని అంతకు సరిపడ్డ రాఁబడి లేకపోవుటచేత పన్నుమాత్రం తగులలేదని యెఱుఁగఁదగు దీనికి కారణం అధికారి యథార్థవేత్తృత్వమే.

మ॥ ప్రతిమాపూజలు స్వల్పబుద్ధులకె యేర్పాటయ్యె లోకాన స
త్ప్రతిముల్ పండితు లెంద ఱుందురు? ప్రజావర్గంబు సర్వంబు మం
దతమం బే యగు నందుకోనమెసుమా! తజ్జ్ఞుల్ విచారించి యీ
ప్రతిమార్చన్ విధియించి రింత నిజ మంబా! దేవి! కామేశ్వరీ. 75

మ॥ ఎవఁడో నీదయ కాకరం బతఁడు తా నేమట్టి తాఁ బట్టుఁగా
కవు బంగారము; వేఱొకండు కనకం బంటంగ మృత్తౌ నినున్
శివదాత్రిన్ యజియింపనేరని నరుల్ శ్రీయం బెటుల్ గాంత్రు నా
యవధానం బఖిలమ్ము నీపదమునం దర్పింతుఁ గామేశ్వరీ. 76

మ. ఎదియో దాస్యము నిమ్మటంటి మఱి నాకేమిచ్చెదో? యేమహా
పదవి న్నిల్పెదొ? నీకృపాంకురము లేభాగ్యంబు లీలేవు? నా
కెదియే నిష్టమె మత్కవిత్వమున ని న్నేఁ గొల్చుసంబంధ ము
న్నదిగాఁ జూచి యొసంగి ప్రోవుమనుచుం బ్రార్థింతుఁగామేశ్వరీ.77

శా. స్వాతంత్ర్యానకు భంగ మున్నయెడలన్ సామ్రాజ్యమేమైన నా
చేతం బందుల కొప్పికో దెఱుఁగు నీచిత్తంబు నా కందుచే
నోతల్లీ! దయ సేయు మే'నవుకరీ'నోచూది, రా పో, యటం
చాతంకమ్ములు లేక యుండవలె నం చర్థింతుఁ గామేశ్వరీ. 78

♦మ॥ హరిఁ జేయున్ హరుఁగా నొనర్చు నజుఁ జేయన్నేర్చు భావత్కమా
కరుణోద్రేక మటంచు మూకకవిరాట్కంఠీరవుం డాడె నం
బరో! నాకట్టి దురాశ లేదుసుమి? శ్రీమత్తావకోద్యానబం
భరసంఘంబుననో! పికావళినో? జన్మం బిమ్ము కామేశ్వరీ. 79

♦ టిప్పణి: శ్లో. మహాభాష్యవ్యాఖ్యా పటుశయన మారోపయతివా, స్మరవ్యాపారేర్ష్యా పిశునపిటలం కారయతివా, ద్విరేఫాణా మధ్యాసయతి సతతం వాధివసతిం। పరిణమ్రం కామాక్ష్యాః పదనళినమాహాత్మ్యగరిమా॥ అన్నే మూకపంచశతి శ్లోకార్థాన్ని యీపద్యంలో చూచుకోవలెను।

♦మ. సరసీజాకర సత్కవిప్రతతిలో జన్మంబు గల్పింతువా?
సరిరాదే నా కింక నేమి కావలెఁ గవీశత్వంబె సిద్ధించెఁ గిం
కరసృష్ట్యమ్మున నేదియో యొకటి పేరన్నాకుఁ గల్పించి నీ,
కరుణం జూపినఁ జాలు నెక్కువలు నేఁ గామింపఁ గామేశ్వరీ. 80

శా॥ ఐ. సి.యస్సుకుఁ బంపఁగా వలదు బీ.యల్.ప్యాసు. గానోప నా
యాసంబుం బడి వోట్లు కైకొని యమాత్యత్వంబు పాలించు సం
తోసం బేమియు నాకు లేదు సకలైనోనాశకం బైననీ
దాసత్వంబె జన్మజన్మములు నే ధ్యానింతుఁ గామేశ్వరీ. 81

మ॥ జననం బెట్టిదియేనియున్ సరియె "నీచం, బంచు "గొ"ప్పంచు నే
ననుకో నిప్పటి మాప్రపంచమున నీచత్వంబె పూజార్హమై
పనికిన్ వచ్చుచునున్న దట్లగుటచేఁ బ్రార్థింతు నేలాటిదో
జని నీసన్నిధిలోఁ నొసంగుటయె వాంఛాపూర్తి కామేశ్వరీ॥ 83

మ॥ గత మేమో? గతియించె నెట్లొ, అదియుం గయ్యాలతోఁ గొంత శాం
తతతోఁ గొంత, వృధాగఁ గొంత కవితానందమ్ముతోఁ గొంత యే
యితికర్తవ్యము లేక కొంత; జననీ? యీపై భవచ్చింతనా,
మృతరక్తిన్ గలిగించి ప్రోవుమని కే లే మోడ్తుఁ గామేశ్వరీ॥ 84

శా॥ ఏరుం జెప్పకయే యెఱుంగుదును నే నీసంస్మృతింగూర్చి "ని
స్సారం" బంచు; నెఱింగియుం బడితి నిచ్చల్ మున్గితిన్ దేలితిన్
బేరుం బొంపు నొకింత గంటి మఱి యీపే రాత్మజుల్ నిల్వ నా
యీరీతిన్ గరుణింపుమమ్మ? మది కింతే కోర్కి కామేశ్వరీ॥ 85

మ. తురకల్ పాలన చేసినారు, మఱి హిందూరాజులుం బూర్వ మే
లిరి, ఆంగ్లేయులుఁ గూడ నేలి రెపుడున్ లేవిప్పు "కాంగ్రెస్సు"మం
తిరు లాపాదన సేయుకష్టములు వీనిం బాప నీకన్న ధీ
వరవర్గమ్మున కొండు పాలకుఁడు కన్పట్టండు కామేశ్వరీ॥ 86

---

♦టిప్పణి: కవి జలపక్షిఅని యర్థాంతరము

శా॥ నీచుల్ త్రాగుడు మాను పెన్నఁటికి నేనిన్ సంభవం బౌనె? అ
త్యాచారుల్ గద? వాండ్రు, వాండ్రకయి యాయాసంబు వ్యర్థంబు పూ
ర్వాచార్యుల్ మనకన్న మూర్ఖులయి యీయంశ ముపేక్షింప రం
బా! చాతుర్యము లిట్టులున్నవి ప్రభుత్వంబందుఁ గామేశ్వరీ. 87

మ॥ తలత్రిప్పున్నది నాకు మున్నె, అది యీధర్మేతరమ్ముల్ శ్రీవో
వలయానం బడి నాఁడునాఁటికిఁ గడున్ బాధింపఁగాఁ జొచ్చె నీ
కలికాలానకుఁ దగ్గసూత్రములనే గల్పించుచున్నారు ప్రా
జ్ఞులు మంత్రుల్; పరమున్న దంచెఱుఁగరోక్కో! వీరు కామేశ్వరీ. 88

శా॥ పూచెం గాఁకర కాచెఁ గాయ, లుడిగెం బో! పాడు సర్వమ్ము, నిం
తే చర్చింప మనుష్యజీవితము, దీనిం బెద్దగా నమ్మి యే
ప్రాచీనుల్ పరముం ద్యజింప, రిపుడో? భ్రష్టీకృతం బయ్యె న
య్యాచారం బిహమే సమస్తమున కాశ్యం బయ్యెఁ గామేశ్వరీ. 89

♦ శా॥ అంతో యింతయొ వ్యాధిహేతువున నిన్నర్చించువాఁడ నా
మంతుస్తోమము దీనఁ దగ్గుననియే మన్మానసమ్మందు నే
సంతోషించెద, నిష్ఠలోనగు సదాచారమ్ము లేమాత్ర మీ
యంతేవాసికి లేవు, ప్రోవుమని నిన్నర్థింతుఁ గామేశ్వరీ. 90

శా॥ స్నానం బుష్ణజలానఁ జేతు, మఱి సంజన్ వార్తు నెట్టెట్టులో
నీనామంబో? గిరీశునామమొ? సదా నే నెమ్మదిం బల్కుదున్
గానీ ధ్యానముమాత్ర మట్టిటు తొలంగం బాఱెడిన్ దీనికి
న్నానేర్పుల్ పనిసేయ వూరక యెటో నన్ బ్రోవు కామేశ్వరీ. 91

మ॥ గురురాహుద్వయ ముండి లగ్నమున నాకు న్నాగరాచారదు
ర్దురితమ్మున్ గలిగించె నుంత; యిపుడే దుఃఖించి యేమా? భవ
చ్చరణంబే శరణంబు, లోఁగడఁ గృతస్నానుండనై గంగలో
మరల న్నాగరవర్తన న్మెలఁగితి న్మన్నింపు కామేశ్వరీ. 92

---

♦ టిప్పణి॥ అంతేవాసి=శిష్యుఁడు చండాలుఁడని అర్థాంతరం.

శా॥ గంగాస్నానము సర్వపాపనిష్కృతిం గల్గించు నాగంగ నీ
కుం గాదమ్మ? సపత్ని; పిమ్మటియఘాంకూరమ్ముల న్నిన్నుఁ బా
పంగా వేడెద, నీదుభర్త నటులే ప్రార్థించెదన్ యుష్మద
ర్ధాంగీభావమె కా దెటుంగుదు శివాద్వైతంబు కామేశ్వరీ. 93

శా॥ "ఆచారమ్ములె లేవు నేఁటిద్విజులం దానష్టికై నీవు సం
కోచింపం బనిలే" దటంచనెదొ? నాకున్ దల్లి? యీదుర్భగా
నాచారమ్ముల నాస్థ లేదు సుతరా; మట్లయ్యు నీనాఁటిహే
యాచారమ్ములు కొన్ని సోఁకె నయిపం బ్రార్థింతుఁ గామేశ్వరీ.94

శా॥ "కాఫీ" తప్పని దే వితంతునయినం గానీ, హవిర్యాజికిం
బాపం బైననుఁ సోమయాజి యయినన్, బైరాగియే యైన, బీ
డీ పాలన్ "సిగరెట్టు" పాలను బడండే నట్టిబాలుం డహో?
"శాపాస్త్రిం" డనవచ్చుఁ బాడతె సదాచారంబు కామేశ్వరీ. 95

మ॥ కులగోత్రాలు "ఖరాబు" చేసికొని యేకూడేనియున్ మెక్కుచున్
బలుబాముల్ వడి పొట్టకోసము; దురాపంబైన నీదాస్య మే
ఖలుఁడున్ గోయుఁడు రాజదాస్యమున కీకర్మానకున్ లంకె "మీ
సలపై తేనియ" కేల? యింతటియనాచారంబు కామేశ్వరీ. 96

మ॥ నడికిం బూర్వులు జంకువార లిపుడో? జంకన్న దే లేదు మున్
బిడియం బంగన కుండె నిప్డు డదియుంటే పెద్దదోషం బహో?
విడియాకుల్ మఱియున్ "విడో"స్వరిణయావిర్భావముల్ తల్లి!యీ
చెడుకాలాన మనస్వి యేవిధముగా జీవించుఁ గామేశ్వరీ. 97

మ॥ మనుజత్వం బది మాననీయ మని సంభావించి రార్యుల్, నిజం
బున కాలాటిదె యయ్యు నేఁడు చెడె నేమో గాని; పశ్వాదులన్
జననమ్మందుటె దీనికన్నను బ్రశస్తంబంచుఁ గన్పట్టు నే
జ్ఞానమున్ లేని మనుష్యజన్మ మొకఁడున్ ఘోరంబు కామేశ్వరీ, 98

మ॥ కులగోత్రమ్ములపట్లఁ బట్టుదల లేకోశమ్మునన్ లేవు, కూఁ
తులకున్ భర్తలఁ దెచ్చు పట్ల నియమాదు ల్లేవు బోనేయుచోఁ
బలలమ్మేనియు నెగ్గు లేదు చెడెఁ బో? బ్రాహ్మణ్య మీరీతిగాఁ
గలు దావ్రం జన దంచుఁ జెప్పెదరు పైఁగా పీరు కామేశ్వరీ. 99

మ॥ ఒకచంద్రానన ప్యాసు చేసె నెదియో యుచ్చైఃపరీక్షన్, జకా
పికిగా మాటల నాడు, నీడు ముదిరెన్, బెండ్లాడఁగా లేదు, మృ
త్యుకుఠారమ్మున కగ్గమయ్యె నది యెంతో శ్లాఘ్యమై యెల్లప
త్రికలున్ మెచ్చెఁ గలిప్రభావ మిది కాదే? తల్లి! కామేశ్వరీ. 100

మ॥ ఒక కన్యామణి పెండ్లి యాడియును విద్యోపాస్తికిన్ భర్తృగో
ష్ఠికి దూరంబని బ్రహ్మచారిణిగ నుండెన్ భర్త పెండ్లాడె వే,
ఱొకకన్యామణి, నీపె వేఱొకని నెట్లో కట్టికో "రూలు" సా,
ప్పక నిర్బంధపు బ్రహ్మచర్యమున నుండం దల్లి! కామేశ్వరీ. 101

మ॥ కొడుకుల్ గల్గినఁ గూఁతు లుద్భవిలినం గోడండ్రు నల్లుండ్రు నే
కడజాతుల్ ఘటియింతురో! యనెడి దుఃఖం, బక్కటా! ఆర్య లీ
చెడుకాలమ్మునఁ బుట్టు టెందుకో కదా! సీ! సీ! దురంతమ్ము లె
వ్వాఁడు సైఁచున్, భరతావనీభవుల కీపాట్లోకొ! కామేశ్వరీ. 102

శా॥ ఈరీతిన్ జగ మెన్నిసార్లు చెడెనో! యెట్లెట్లుగా మాఱెనో?
యే రిద్ధానికి బుద్ధులన్ గఱపి సద్వృత్తిన్ బ్రవర్తింపఁగా
దారిన్ జూపిరో! యే రెఱుంగుదురు? నీతత్త్వంబు దుర్జ్ఞేయ, మే
దో! రాజ్యంబఁట! వచ్చునంట! యిది తద్దోషంబు కామేశ్వరీ. 103

మ॥ పరిశీలించుకొలంది జన్మములకుం బారమ్ము లేనట్టులే
యరయంగాఁ బడు, బుద్ధదేవుఁడును జన్మానంత్య మొప్పెన్, మహా
త్తరు లేధైర్యముతో నకార్యములకున్ దాత్పర్యముం గొల్పుచుం
దురో! కావింపఁగ దోయకుందురో? జగత్క్షోభంబు కామేశ్వరీ. 104

మ॥ పితయాచారము మాతయాచరణమున్ వే ఱందుకున్ భిన్నముల్
సుతునాచారముఁ గూఁతునాచరణమున్, జూడంగఁ జూడంగ నే
కత గోల్పోయెను దేశ; మైక్యమునకై కష్టించుచున్నాఁడు గాం
ధి తపశ్శాలి; తపఃఫలమ్ము తుద కీతీరయ్యెఁ గామేశ్వరీ. 105

మ॥ మును పున్నారు తపస్వు; లామునులలో మూర్తీభవించెం బురా
తనవిజ్ఞానము; వేదశాస్త్రముల కాతత్త్వంబు దూరంబు గా
దనుకూలింపదు గాంధితత్త్వ మలసిద్ధాంతాలకున్; దాన నీ
యనచే నాప్యలు పూర్తిగాఁ జెడుట సంప్రాప్తించెఁ గామేశ్వరీ. 106

మ॥ మును పీభారతభూమియందు జనసంబున్ దేవతల్ గూడఁ గో
రినయట్లే కనుపట్టు, నేఁడు బహుళాకెష్టంబు లీభూమిలోఁ
గనవయ్యెన్, జననీ! పునర్జననముం గల్గించుచో నాకు నిం,
దునఁ గల్పింపకు కేలుమోడ్చి నుతియింతున్నిన్నుఁ గామేశ్వరీ. 107

శా॥ గాంధీగారు మహానుభావు లయినం గావచ్చుఁగా కెల్లరన్
బంధుల్ గాఁ దలపోయుఁగాక అటు సంబంధమ్ములం జేయుఁగా
కంధుల్ నూర్గురు నంఘనం బడినయ ట్లార్యాన్వయుల్ గూడ దు
ర్గంధమ్ముం గనిపెట్టకుండుట విచార్యం బంబ? కామేశ్వరీ. 108

*మ॥ కలఁగం ద్రొక్కుచునున్నవా రిప్పుడు లోకంబున్ గజంబుల్ సర
స్సలిలంబుం బవె, నెట్టులుండునో? భవిష్యత్కాల, మీయజ్ఞుల్
తలపోయన్ గతకాలమే మెఱుఁగుగాఁ దట్టున్ మహాభారత
స్థలి నన్నయ్య వచించువాక్యము యథార్థంబంబ? కామేశ్వరీ. 109

---

*టిప్పణి: నన్నయ్యవాక్య మిది, క॥ మతి బరికింపఁగ జీవిత:మతిచంచలమెం డమావులట్టులు సంప, త్స్రుతతు లతిక్షణికంబులు, గతకాలము మేలు వచ్చుకాలము కన్నన్.

శా॥ ఏ నేమమ్మును లేకయే మనమునం దేకాగ్రిభావమ్ము లే
కే నిన్నున్ జపియించుచుంటి నెటులో; యీనీదు నామాక్షర
ధ్యానం బూరక పోవునే? మధువు తా నాత్మీయమాధుర్య మెం,
దే నొండేగతిఁ జూపు, నిట్లె యనుభూతింగాంతుఁ గామేశ్వరీ. 110

మ॥ మనమే హేతువు బంధమోక్షములకున్, మానావమానమ్ములా,
మనమే దేహికిఁ గూర్చుచుండు, నది సామాన్యుల్ గనన్ లేరు, క
న్గొనఁగా నేర్తురు విజ్ఞు; లట్టిమన మన్కోఁతిన్ వశమ్మొందు ని,
ల్పినవారే ఘను; లట్టివా ర్తఱచుగా లేరంబ? కామేశ్వరీ. 111

మ॥ మనము న్నిల్పనిభక్తి వ్యర్థ మని నే మానంగఁబో కెట్టులో,
జననీ! నీపయి నీదుభర్తపయి నిచ్చల్ భక్తితో నెట్టుచుం
టిని గాలమ్మును, వచ్చుజన్మమున నేని న్నన్ను నీసుఖ్యభ,
క్తునిఁగాఁ జేయుము, వేఱుకోర్కె లిఁక నాకున్ లేవు కామేశ్వరీ. 112

మ॥ జననా లెన్నియొ యెత్తుపిమ్మటనె మోక్షమ్మొందు నేప్రాణియున్
జన దుర్వోత్తుగ నొక్కజన్మమునకే సాధింప మోక్షమ్ము "వేఁ
గునె? యొండొక్కకలం గన న్నిసి" యనుచుఁగున్ భక్తుని న్నన్ను జ్ఞా
నిని గావింపుము వచ్చుజన్మమునకేనిం దల్లి కామేశ్వరీ. 113

శా॥ జ్ఞానంబన్నను దెల్విమాత్ర మగు, సక్కాలమ్మునం దద్ది య
జ్ఞానస్థానము నాక్రమించుకొని దుష్కార్యమ్ములం జేసెడిన్,
గాన న్నా కటువంటి దీవలవ, దజ్ఞానుండుగా నుంచినన్,
గానీ కొండొక మేలె, యొందులకు దుర్జ్ఞానంబు కామేశ్వరీ. 114

మ॥ వృథగా గోవులఁ జంపి చెప్పులను దా నెవ్వాఁ డిడున్ దాన, మ
య్యథముం డెంతటితెల్వి గల్గిన నరుండైనన్ మహాపాపి, దు
ష్పృథ మాజ్ఞానము; తాదృశంబయిన దుర్జ్ఞానంబు నేఁ గోర, సు
ప్రథితుల్ దేవఁ దరించి రట్టి దిశఁగాఁ బ్రాపింతుఁ గామేశ్వరీ. 115

శా॥ తల్లీ! యెక్కడఁ జూతుమేని విపరీతజ్ఞానమే నేఁటివి
ద్వల్లోకమ్మునఁ గానఁగాఁ బడెడిఁ, దత్సంస్కారముల్ సర్వధా
పొల్లుల్, పూర్తిగ సాధుబాధకము, లేభూమిన్ మహేనాఁడునున్
జెల్లన్ లే దవి, లేదు వానికతనన్ శ్రేయస్సు కామేశ్వరీ. 116

మ॥ భగవత్సత్తకు సమ్మతింపనిజనుల్ పాడైనఁగానిమ్ము, స
ర్వగమా తేజము శక్తి యున్న దనువిశ్వాసమ్ములో నున్న నేఁ
దగుభక్తిన్ గడియింప లేనయితి, నీతత్త్వమ్మునందే మతిన్
లగియింపన్ గరుణింపుమీ! జనని! వాలాయమ్ము కామేశ్వరీ. 117

శా॥ ఏదో యిట్టి దటంచుఁ దెల్పుటకు నీ లేమాత్రమున్ గానిదై
ఆదిన్ బొందని దంత మందనిదియై యావత్ప్రపంచానకున్
బాదా తేజ మొకానొకం డు కల దంబా! నీవా! నీభర్తయో!
లేదా! యిర్వురమేళగింపొ! తెలియన్ లే మద్ది కామేశ్వరీ. 118

శా॥ దేవీభాగవతమ్మునందు నిగమాతీతంబు తత్తేజ మో
దేవీ! "నే" నని "నాదుభర్త" యని తత్తేజమ్మునందున్ భిదా
భావం బంచని వ్యాఖ్య చేసితివి తద్భావంబు స్పష్టంబుగా
భావార్థము గామి నిప్డు మరలన్ బ్రశ్నింతుఁ గామేశ్వరీ. 119

శా॥ "ద్వైతం" బంచును దేలదయ్యె, మఱి యద్వైతంబు గాదయ్యె,నీ
చాతుర్యం బఖిలమ్ము నయ్యెడలనే సందర్శితం బయ్యె నీ
చేతన్; దెల్గొసరించినాఁడ నెటులో చిత్తానకుం దోఁచిన
ట్లోతల్లీ! నిజ మెట్టిదో? తెలుపరాదో? యిప్డు కామేశ్వరీ. 120

మ॥ "జనన మ్మింకొకఁ డందుకోసమె యపేక్ష్యం" బన్న "నీచిత్త,మా
జననమ్మందును బూర్వనిర్గత,జనుర్జ్ఞానంబు చేకూర్చి, ప్రా
క్తనవిద్యావిభవం బొసంగు" మనుచుం గైమోడ్చి యాచింతు, నే
జననమ్మేనియు సంతసంబె, యిఁక దాస్యం బిప్డు కామేశ్వరీ. 121

*మ॥ జననాభావము లేదు పైపయి. నెటో జన్మంబు లెన్నేనియుం
గను లేలాగును దప్పు, దట్లగుటచేఁ గైమోడ్చి శ్రీకృష్ణదే
వుని ము న్నావిదురుండు గోరినవరమ్ముం గోరుచున్నాఁడ, నా
తనికిన్ జెల్లెల వావరం బొసఁగలేవా? తల్లి కామేశ్వరీ. 122

మ. జననాభావము మోక్ష, మిట్లనియె శాస్త్రం బెంత గాలించినన్
గనుపట్టున్, జననంబు గల్గినను శోకంబేమియున్ లేని చ
క్కని సంసార, మనామయంబు, భగవత్కైంకర్యమం దిచ్చ, యుం
డినచో నబ్బెడినష్టి యుండదనియే నే నెంతుఁ గామేశ్వరీ. 123

మ॥ జననా లెన్నిటి నెత్తఁజేసినను లేశం బేను దుఃఖింప, నీ
చన వున్నట్టి కవిత్వ మిచ్చి రుజతో సంబంధముం ద్రెంచి, న
చ్చినసంసారముఁ బెంచి, బ్రోచునెడలన్ జేదానె జన్మంబు, దు
ర్జనమూర్ధన్యతమాత్ర మీకు మనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 124

మ॥ సుజనుల్ గాఁ గనుపట్టుచుండియు జగత్క్షోభంబుగావించువా
రుక్కజనుల్; కేవలదుష్కృతుల్ సలుపునాక్రూరాత్మకుల్, గారు వా
ర్వృజినంబుల్ పోసరించునట్టిపనికే యేర్పాటుగాఁ బుట్టి, ర
ట్టిజనుల్ నమ్ములు, వీరు కారు, మది కిట్లే తట్టుఁగామేశ్వరీ. 125

మ॥ జగమందుం గలవిజ్ఞు లెవ్వరికృతుల్ శ్లాఘింతురో? వారు దు
ర్భగులయ్యున్ మహనీయు, లెవ్వరికృతుల్ శ్లాఘింపరో? వారు దు
ర్భగతాదోషము లేకయుండియును దౌర్భాగ్యాలవాలమ్ము, లే
వగ నన్నుం గరుణింతువో? యిదియ మద్భావంబు కామేశ్వరీ. 126

మ॥ తఱచే నెప్డు "నమశ్శివాయ" యనుమంత్రమ్మున్ జపింతున్, గురుల్
చిఱునాఁడే యుపదేశ మిచ్చిరికదా? శ్రేయస్కరంబైన యీ
వరమంత్రమ్ము; మఱొండు మంత్రము జపింప, న్నీవు నీభర్త యి
ద్వరునిందే కల" రంచు నెంతు మది; నొప్పో? తప్పో? కామేశ్వరీ. 127

*టిప్పణి; శ్లో "అనాయాసేనమరణం వినా దైన్యేనజీవనమ్" ఇదే శ్రీకృష్ణ భగవానుని విధురుఁడు కోరినవరం.

♦మ॥ జను లజ్ఞానులు "లింగశిష్ట" పరిభాషాజ్ఞానహైన్యాన ద
ప్పనుకొన్నన్ సకలజ్ఞ కీలఘురహస్యం బన్న నేపాటి! చం
ద్రికన్ జంద్రిక కెట్టిచుట్టఱిక ముండున్ మీకు నాలాగె యం
చును విజ్ఞుల్ వచియింతు,రియ్యది కడున్సూక్ష్మంబు కామేశ్వరీ. 128

మ॥ కవులం దెవ్వరొగాని శాస్త్రవిషయజ్ఞానల్ గనన్ రారు, వా
రు వృధావేశముతో విమర్శనమిషన్ రోషింతు, రజ్ఞానులే
భువి నెందుం గలనేఁడు సత్యమును దుర్బోధంబ, యీనాఁడు స
త్కవియై పుట్టుటకూడ దోసమని వక్కాణింతుఁ గామేశ్వరీ. 129

మ॥ ధనికుల్ రిక్తులు పుత్రదారసహితుల్ తచ్ఛూన్యు లీరీతిగాఁ
గనుపట్టున్ బహుభేదముల్ ప్రజలలోఁ, గానంతఁ సౌఖ్యంబు నో
చినవా ర్శ్లాఘ్యులు తల్లి! యింతటి సుదుశ్శీలాహి సంసార, మిం
దు ననున్ దింపితి నెమ్మనం బిటునటున్ దూఁగాడుఁ గామేశ్వరీ. 130

శా॥ ఈజన్మమ్మునసీదు దాస్య మది నా కెట్లట్లొ సుంతబ్బె దే
వీ! జన్మాంతర పుణ్యలేశమున; నిం కీవచ్చుజన్మాన నీ
పూజార్హత్వము కొంత వృద్ధి యగుఁ దత్పూజార్హతంజేసి నా
పైజన్మంబున నేదయో పదవి సంప్రాప్తించుఁ గామేశ్వరీ. 131

*మ॥ పదవింగూర్చి చింత లేదు జననీ! పాదద్వయిన్ మోయుటో!
సదనం బూడ్చుటొ? యింకె దేనియు మహాసామ్రాజ్యమే, నాకు నే
గదమున్ లేని పదం బొసంగు మనియే కై మోడ్చి ప్రార్థింతు,నీ
యెదకు న్వచ్చిన నాకు నాపదవినే యీవమ్మ! కామేశ్వరీ. 132

---

• టిప్పణి: "ప్రాతిపదికగ్రహణే లింగవిశిష్టస్యాఽపి గ్రహణమ్" అనే వ్యాకరణశాస్త్ర పరిభాషవల్ల శివశబ్దమువల్లశివాశబ్దమునకుఁగూడా గ్రహణం కలుగుతుందని తెలునుకోవలెను.

* టిప్పణి; నాపదవినే= కవీశ్వరత్వమునే,

మ॥ కలకాలమ్ముఁ గవిత్వపుం గలనమే కాంక్షింతుఁ దల్లి! దురా
శలు దుఃఖమ్ములచేటు, పెద్దపదవుల్ సాధింపఁగా నేర నా
కలమున్ గాగితమున్ సదా కవితనే కై సేయునట్లుల్ దయన్
గలయుం జూపుము వేఱొకండు వరముం గాంక్షింపఁ గామేశ్వరీ. 133

శా॥ మూకాదుల్ సుకవుల్ భవన్నికటమున్ ముం దెప్పుడో చేరి వి
ద్యాకార్యమ్ములు చూచుచుండు రని నాకాలోచనల్ తట్టు నా
కీకవ్యగ్రిణులందు నొక్కపద మీ వీవచ్చు నంచు న్నితాం,
తైకానందుఁడ నౌచు నుందు హృదయమ్మం దేసు గామేశ్వరీ. 134

మ॥ "కవులే స్వర్గము మోక్షము న్నరకమున్ గల్పించి లోకానకున్,
జవిఁ జూపించిరి వారిభావనయె యీసర్వాసకున్ మూల"మం,
చు వివేకుల్ మఱికొంద ఱందు, రది విజ్ఞుల్ నమ్మ, రార్యుల్ మహా
కవు లాడం బని యే మసత్యములు, వక్కాణింపు కామేశ్వరీ. 135

మ॥ జగమున్ "మిధ్య" యటంచుఁ జెప్పిన మనీషాశాలి శ్రీశంకరుం
డు గురుం డాయన సూత్రభాష్యమునయందుంగూడ స్వర్గాదిలో
కగతుల్ దెల్పె "నసత్య" మంచుఁ బలుకంగా శక్య మొప్లొ? బుధుల్,
నిగమజ్ఞుల్ వచియించుమాట జననీ! నిక్కమ్ము కామేశ్వరీ. 136

మ॥ ధనధాన్యమ్ములు ధన్యతాగరిమకున్ దార్కాణముల్ గావు మే
ల్వినయమ్ము న్నయము న్నిరోగతయు సద్విద్యాపటిష్ఠత్వముం
దనకుం దోడగునేని సంపదకు ధన్యత్వమ్ము చేకూరు నే
ననిశ మ్మిట్టిసిరిం గనుంగొని మదిన్ హర్షింతుఁ గామేశ్వరీ. 137

మ॥ "పరిపూర్ణంబుగ వ్యాధి తగ్గినది నాపద్యాలచే" నంచు సం
బరముం బొందుచునుండ వ్యాధి మరలం బ్రత్యక్షమై నేఁడు ము
ష్కరతన్ జూపఁదొడంగె నీకరుణకే చాంచల్య మీరీతిగా,
దొరఁకొన్నన్ గతి గేమి? భక్తులకు నెందుం దెల్పు కామేశ్వరీ. 138

శా॥ "వార్ధక్యమ్మున మందుకన్నను భవద్వాత్సల్యమే రోగుల
న్నిర్ఘాతామయులం బొనర్చు" ననుచు న్నే నెమ్మది న్నమ్మి నిన్,
బ్రార్థింపం దొరకొంటి, నాదుకవితాప్రఖ్యాతి లోకమ్ములో,
వ్యర్థమ్మం బొనరింపకమ్మ! యని నే నర్థింతుఁ గామేశ్వరీ. 139

మ॥ భవదీయమ్మగు రూప మప్డపుడు స్వప్నమ్మందుఁ గన్పట్టు, నే
శివమో? వెంటనె కల్గి తీరు, శివరాశి న్నిన్ను ధ్యానించునీ
కవి కింతే ఫలితమ్మొ? యీజనిని సాక్షాత్కారభాగ్యమ్ము గ
ల్గి వినోదించుటకూడఁ గల్గెడినొ? తల్లీ! తెల్పు కామేశ్వరీ. 140

మ॥ పదిపండ్రెండు శరత్తు లాయె జననీ? పంచాక్షరీమంత్రమున్,
మదియం దేను జపింపఁబూని; మఱి తన్మంత్రిమ్ము నీభర్తకున్,
గుదురైనప్డు తదర్థభాగమగు నీకుం గాకపో, దిర్వురున్
మదుపాస్యుల్ మదిజ్ఞప్తియుంచుకొనుమమ్మా!నన్నుఁగామేశ్వరీ. 141

మ॥ అది యేమో? వచియింపఁజాల మదుపాస్యత్వమ్ము మీఁదోయి కా
స్పదమై యున్నను నీవ స్వప్నమున సాక్షాత్కారముం జేసి య
భ్యుదయాదుల్ గలిగించుచుందు వలశంభుం డెన్నఁడుం గానరాఁ
డదయుండో?మఱికాఁడొ?యాతఁడుపరప్రాప్యంబు కామేశ్వరీ. 142

శా॥ బంద ర్కారణ మస్మదీయమగు సంపత్ప్రాప్తికిన్, దత్పురం
బందున్ వాసమొనర్చనేగుటకుముం దంబా! భవద్దర్శనా,
నందం బందఁగఁ జేసె స్వప్న, మదివర్ణ్యం, బెప్డు నే నట్టియా
నందంబుం గని యుండ నిక్కము సుమీ? నాతల్లి! కామేశ్వరీ 143

♦శా॥ మోకాల్బంటిగఁ బాలుఁగుంకుమయునేమో?ప్రోవుగానుండె నే
యాకారమ్ము విరాట్స్వరూపమున భూమ్యాకాశముల్ నిండె న
న్నాకారించి "మఱేఁడివాఁ"డని సహాధ్యాయిన్ గుఱిం జేసి నీ
వాకాంక్షించితి జ్ఞప్తి యున్నదియె?యీయంశమ్ము కామేశ్వరీ. 144

♦టిప్పణి: ఆకార్ణించి=పిలిచి, (ఆకార్ణణ, మాహ్వానం) అనికోశము—

శా॥ రంగం బేమొ? వనంబు, వేళ యుదయారంభానకుం బ్రాంత,ము
ప్పొంగెన్ దేహము, గొన్నిపద్దెములచే భూషించితిం గాని జ్ఞ
ప్తిం గన్పట్టక పోయె మేల్కొనుపయిన్; దేవీ! శుభా లెన్నియే
నిం గల్గెన్ దరువాత, వ్యర్థమగునే? నీచూపు కామేశ్వరీ. 145

మ॥ కల నా కియ్యది నూజివీటినగరిం గన్పట్టె, నీస్వప్నపున్
ఫలితం బేఁ గనుఁగొంటి బందరుపురిన్ బహ్వాబ్దముల్. నాకు నే
ఫల మెప్డబ్బిన సర్వ మయ్యది భవద్భవ్యాంఘ్రిరేణ్వర్చనా
ఫలితంబే యనుకొందు, మత్కృతముగా భావింపఁ గామేశ్వరీ. 146

మ॥ తెగుళ్ళ ల్లోనగు చిక్కు లబ్బునెడ "నాత్మీయాఘ" మంచెంతు,నా
ర్తిగడుం దగ్గి సుఖంబు గల్గునెడ నీదివ్యాంఘ్రిరేణుస్మృతి
స్థగితం బంచుఁ దలంతు, నీవృశు ననుం దల్లీ! యెటుల్ జీవయా
త్రిగడన్ముట్ట నొనర్తొ? నీయదియ భారంబెల్లఁ గామేశ్వరీ. 147

మ॥ తృణముం జేయని నన్ను మేరువుగ నీదృగ్దీప్తి సంధించె, నిం
దణుమాత్రమ్మును లేదు సందియము; దుర్వ్యాధివ్యథాభార ము
ల్బణమై తోడయి వార్ధకమ్మునకు; నన్ వంచింపఁగాఁ జొచ్చె, వీ
క్షణమే కొంచెమొ?యూఁతఁ జేసి బలమున్ గల్పింపు కామేశ్వరీ 148

మ॥ మనవిం జేసెద నొక్కమూట వినుమా! మాహేశ్వరీ! వీఁడు రా
జును "తాతా" యని పిల్చుహేతువు భవచ్ఛుంభత్కృపాపూరభూ
ధనమే కాదె! అదే భవంబు తుదియౌదాఁకన్ గటాక్షించి మీఁ
దను నీసన్నిధిలో నొసంగు మెదియో! దాస్యంబు కామేశ్వరీ.149

మ॥ తిరుగన్ వేయు కొలంది గ్రంథములు; నీదివ్యాంఘ్రిభక్తుల్ సుదు
స్తరసంసారసముద్రమశ్రమముగా దాఁటన్ గలా రంచుఁ బూ
ర్వఋషిప్రోక్తము లెన్నియో కనుపడున్ వాక్యమ్ము; లేలాటిము
మ్మొకసులు స్నికృపగల్గ సత్త్వగుణముల్ గైకొంద్రు కామేశ్వరీ. 150

మ॥ "తమితప్పన్ గలుదాఁపువు ప్రతరవహా తత్తన్మహాఘంబు గా
తమిస్నానంబునఁబోవు" నంచు మునిసిద్ధాంతమ్ము లెన్నెన్నొ గా
తమిమాహాత్మ్యమునందుఁ గన్పడు యథార్థం బెట్టిదో! నాకు బో
ధము గాకున్నది మౌనివాక్యము లబద్ధం బౌనె? కామేశ్వరీ. 151

మ॥ అగుచో గంగనుగూర్చి చెప్పవలెనే! ఆమీఁదఁ గావేరిలో
నగునే ల్లున్నవి వేసవే లఘునివార్యంబుల్ప్రవాహంబు; లే
వగఁ బాపంబులు నిల్చు? నెల్లెడ మహాభాగాత్మకం బయ్యెడిన్,
జగ; మిం కెందుకు నారకంబులప్రశంసల్ తల్లి! కామేశ్వరీ. 152

మ॥ భగవద్దర్శన మెల్లపాపములు వాపం జాలుఁ దీర్థస్థల
స్థగితుండై భగవంతుఁ డుండుట యథార్థం, బమ్మహాత్ముండు స
ర్వగుఁడే యయ్యును దీర్థ మెక్కుడు పవిత్రంబౌట నచ్చోటఁ బ్రీ
తి గడున్ జూపెడి నన్న నేమిటికి సందేహంబు కామేశ్వరీ. 153

శా॥ పాపం బంచు కొఁడున్నచో నదియుఁ బాపం జాలువాఁ డుండు స
ర్వాపద్వారకమైన శక్తి యటఁ జెల్వారున్ ధ్రువం బింత నీ
వే పాపం బడఁగింతు, పాపములు మేమే చేతు మిట్లౌట ని,
న్నే పల్మాఱు నుతింతుఁ బద్యములఁ బై నేమైనఁ గామేశ్వరీ. 154

శా॥ పాపంబే పొనరింపకుండ భవముం బాటించువ్యక్తుల్ ధ్రువం
బేపట్లన్ గనరారు, నిన్నెఱుఁగు టే యేనోహరం, బిట్టులే
యేపెద్దల్ వచియింతుర్, భక్తగణ మాయామార్గమే పట్టె దు
ర్వ్యాపారుల్ పెడత్రోవలం బడుదు రన్యాయమ్ము కామేశ్వరీ. 155

మ॥ జనికిన్ హేతువు పుణ్యపాపములు; తత్సంపూర్తి యౌదాఁక దే
హనిబద్ధుండయి యుండి దేహి యెవియో యంహోహరంబుల్ పొన
ర్చునెడన్ రాఁదగుజన్మ ముత్తమముగా శోభిల్లు నిట్లే క్రమ
మ్మగ నత్యుత్తమ జన్మముం గనఁగ నొప్పుం దల్లి! కామేశ్వరీ. 156

మ॥ నుతులం గూరిచిరో? ననుంగుఱిచియో? స్తోత్రమ్ము నిన్నేను జే
సితిఁ దత్తత్త్వల మందఁగంటి నెపుడున్ శ్రీమద్భవత్పాదముల్
గతిగా నమ్మి చరించుచుంటి భయమే కానిమ్ము నీయందు ని
ల్పితిఁ జిత్తమ్ము; తరింపఁజేయుము ననున్ భీ మాన్ప; కామేశ్వరీ. 157

మ॥ జనియే దుఃఖము, జాయ దుఃఖము, జరాసంప్రాప్తి దుఃఖమ్మొక
న్నను దుఃఖ మ్మవి పూర్తిగానెఱఁగియున్ సంసారమందున్ మునిం
గినవారే బును లెల్లరున్; మునిఁగియుం గించిత్తు లోలో నెటో,
అనుతాపమ్ము వెలార్తు రేమి ఫల మంబా? దానఁ గామేశ్వరీ. 158

మ॥ సిరిసంపద్యమ్ముగల భక్తి గల్గిననరుల్ నేఁ డెక్కడోగాని చి
క్కరు, వారోటులుకూడఁ జిక్కుట కడుం గష్టంబు; యీకాల మే,
దురితంబుం బోనరించి పుట్టినదిరో! దోషాలవాలంబు; కు
మ్మరియావమ్మున లోహపాత్ర లెటు సంప్రాప్తించుఁగామేశ్వరీ. 159

మ॥ ధనికుండై జనియించుకంటెను దరిద్రత్వమ్ముతోఁ బుట్టుటే
మనుజున్ మంచికిఁ దెచ్చు; భక్తి నిడు, సామాన్యంబుగా రిక్తులే
ఘనులున్ భక్తులు నౌదు, రాఢ్యు లలసుల్ గా సోమరుల్ గా జగ
మ్మున నిందన్ గనుచుంద్రు,దరిద్రపుగుణమ్మొంజూడుకామేశ్వరీ 160

శా॥ నాకున్ సంతతి గల్గునప్పటికె మాన్యంబుల్ మడుల్ ద్రవ్యము
న్నీకారుణ్య మొసంగె బల్ కొలఁదిగానే; కుక్షి లీమాత్రకే
లోకజ్ఞానము లేనివాండ్రయి, రికన్ లోకోత్తరైశ్వర్యవ
త్ప్రాకామ్యమ్ముఁ బట్టఁ బగ్గము లెటుల్ ప్రాప్తించుఁ గామేశ్వరీ. 161

శా॥ ప్రాణమ్ముల్ పతియించియున్ గురుకులమ్ముంగొల్చియున్ లోకపున్
వృత్తాంతమ్ము లెఱింగి ప్రాజ్ఞునియు నింకెన్నేని మార్గమ్ములన్
వేత్తృత్వమ్ము గడింపఁగానలయు సం తేకాని "ఆగర్భశ్రీ"
మూర్ఖుల్ మత్తత చేటు వారిచదు వామాత్రింబ కామేశ్వరీ. 162

♦మ॥ పవలున్ రేయును నిన్ జపించుతపసుల్ పాలించుభాగ్యంబు త
క్కువ నోముల్ గలయన్నదాదుల కెటుల్ గోరంగ నోరాడు? నేఁ
గవి నౌచిత్య మెఱుంగుదున్, గవితయో? గానమ్మొ? నా కిచ్చి నీ
స్తవముం జేసెడివందిఁ జేయుటె మహౌదార్యంబు కామేశ్వరీ. 163

మ॥ సకలానర్థములున్ దపస్సుకతనం జక్కంబడున్, బూర్వు లే
సుకముం గాంచినఁ గష్టమాఁగినఁ దపస్సుం జేసియే; నాకు సం
తుకు శ్లోకానకుఁగూడ మంగళములం గూర్పంగ నీనామ మో
పికమై నే జపియింతు నన్నిటికి నీవే దిక్కు కామేశ్వరీ. 164

శా॥ సంసారం బనినంతనే భయముతో సంబంధ ముండున్, భయ
ధ్వంసం బెవ్వరి నాశ్రయించినను సంపన్నంబు గాఁబోద, యీ
హింసం బాపెడి దొక్కనీచరణమే, యిప్పట్ల నే నెంతొ మీ
మాంసన్ జేసియె నిర్ణయించితినిజమ్మా! తల్లి! కామేశ్వరీ. 165

మ॥ ధనవంతుల్ గలరెందఱో? కలరు దాతల్ గూడ నవ్వారిలో,
ధన మీనేర్తురుగాని వా రితరబాధల్ మాన్పఁగా లేరు, నీ
వనినన్ సర్వవిధాల సంసృతికి సౌఖ్యంబుం బ్రసాదింతు వెం
తని వర్ణింతుఁ ద్వదీయపాదయుగమాహాత్మ్యంబు, కామేశ్వరీ. 166

మ॥ అనుభూతమ్ముగఁ జెప్పుమాట యిది, నే నాజన్మము న్మాతృభ
క్తిని నీపై భర ముంచి వర్తిలుట నీకే కాక లోకాన కె
ల్లను విస్పష్టము, నాకుఁ జేకుఱిన తల్లాభంబు నామానసం
బున నే నేమఱ, నాకు నీస్మరణమే మోక్షంబు కామేశ్వరీ. 167

మ॥ జనులన్ దైవతభక్తి చచ్చెఁ, గడు హెచ్చుం జొచ్చె నాస్తిక్య,మిం
దునకు న్నీకును సమ్మతంబె యనుచుందోఁచున్, ధువ్రివం, బట్లు కా
దనుచో మాలలు మాదిగల్ గుడులయం దడ్డంకి లేకుండ దూ
రునెడం దల్పులు వీడునే? కలరే? ఆర్యుల్ నేఁడు కామేశ్వరీ. 168

♦టిప్పణి: వంది—స్తోత్రపాఠకుఁడు.

♦శా॥ జాతిన్ మంత్రపుబల్మికల్మిని మురారాతిం బురారాతి ని
ట్లే తత్తద్భగవత్స్వరూపముగ మున్నే విజ్ఞులో చేసి, రి
ప్రాతత్త్వమ్ము నెఱింగిరో? యెఱుఁగరో? అంతేవసజ్జాతులన్
బూతుల్ గాఁ జొరఁబెట్టుచుండి, రిది యేపున్నెంబొ?కామేశ్వరీ.169

మ॥ శివ నీవైతి, శివుండు నీపతి, భవత్సేవల్ సదా భక్తులన్
శివసంపన్నులఁ జేయు నం చెఱిఁగియే సేవించుచున్నాఁడ, నెం
త విపత్తేనియు మంచువోలె విరియున్ ద్వన్నామమున్ సంస్మరిం
పవరించున్ శుభముల్; నిజానుభవమున్, వాక్రుత్తుఁ గామేశ్వరీ.170

శా॥ అంబా! సంతతి నాకొసంగు మని నిన్ యాచింప నే లేదు, సం
తుం బేర్మిన్ గరుణించి యిచ్చితివి, నిర్దుష్టాయురారోగ్యభా
గ్యంబొనట్టు లనుగ్రహింపుమని యభ్యర్థింతు నాబొంది చి
ట్టంబుం గట్టుచునున్న, దీఁదు టతికష్టంబయ్యెఁ గామేశ్వరీ. 171

శా॥ నాయారోగ్యపు లోపముంగుఱిచియో! నా సంతునారోగ్య వి
ద్యాయుర్భాగ్యములం గుఱించియొ? సదా ప్రార్థించు టే యయ్యె నం
బా! యీయాశ్రియ ముంటఁజేసియసుమా? ఆపత్తులందాఁటి యె
ట్లో యీసంసృతి నీఁదుచుంటి నని నేనూహింతుఁ గామేశ్వరీ. 172

మ॥ పులి యన్నన్ ఫణియన్న మృత్యు వనినన్ భూతంబటన్నన్ మదిన్
గలుగుంబో? భయ, మంత కెక్కుడుగనే కన్పట్టు "సంసార"మన్
పలుకున్ విన్న, నికేఁమి సేయుదు? నెటో బందన్ బద మ్మొంచితిన్
వెలికి న్నిదయ యుద్ధరింపవలె దేవీ? నన్నుఁ గామేశ్వరీ. 173

మ॥ తనురోగానకు మందు లుండినను నాత్మవ్యాధికిన్ మందు లే
దనుటల్ తెల్లము, రెంటినిం దొలఁచు నీయంఘ్రిద్వయీరేణు సే,
వన; "మీసంసృతి నింతకన్న సులభోపాయమ్ము లే" దంచు నే
ననుకొందు, న్ననుమన్నుమందు, శరణం బర్థింతుఁ గామేశ్వరీ. 174

♦టిప్పణి॥ పూతుల్ గాన్=పవిత్రులుగాన్, అంతేవసజ్జాతులన్=మాలమాదిగలను,

శా॥ స్త్రీచేతం బురుషుండు పూరుషునిచే స్త్రీయున్ సుఖాశార్థులై
యీచిక్కుం గొని తెచ్చుకొందు, రిది తాహెచ్చైను నానాఁట; వి
ద్యాచుంచుల్ జనులొక్కరూపయిట; నీతంటాకు భీతిల్లియున్
మూఁచూడన్ వెనుదీయరెవ్వరునహో? మోహంబు కామేశ్వరీ 175

మ॥ నిను సేవించుటతప్ప వేఱుగతి లేనేలేదు సంసారి, కెం
దును, సంసారమునందుఁ జిక్కి లె కడుం దోఁచుంగదా? వానినె
ల్లను నీపాదరజోభరంబుడిపి యేలాగో? గృహిన్ సౌఖ్యవం
తునిగాఁ జేయు నిజానుభూతి వివరింతుం దల్లి! కామేశ్వరీ. 176

మ॥ నరుఁ డేదే నొనరించుఁగా "కదియిహానందానకే కా" దటం
చరయంగావలె నట్టులైనయెడఁ దద్వ్యాపారమెల్లన్ భవ
త్పరమే యై పరిణామ మందు సుఖముల్ ప్రాప్తించుఁ, బ్రాచీనసం,
సరణం బెంత పరీక్ష చేసిన నిదేసారంబు కామేశ్వరీ. 177

శా॥ పిల్లల్ జెల్లలు గొడ్డుగోదయుఁ గడుం బెంపొందు సంసారమే
యుల్లాసం బొడఁగూర్చు, దానిపొలు పేయొచ్చెమ్ము లేకుండ నో
తల్లీ? యూరయు టెట్లు? నీదయవినా; తత్సంపదభ్యున్నతుల్
చెల్లు న్నీదయ గల్గువారికె సుఖశ్రీ నీఁగఁ, గామేశ్వరీ. 178

మ॥ సతిఁ జేపట్టిన సంతతింగనిన విశ్వం బేలినన్ వైదిక
వ్రతముల్ సల్పిన నిల్లుగట్టికొనినన్ ద్రవ్యమ్ము నార్జించినన్
బ్రతికార్యమ్మునకుం బరం బిహముతో వర్తించుఁ బ్రాచీనప
ద్ధతులన్; బ్రస్తుతకాలమందు నది మృగ్యం బయ్యెఁగామేశ్వరీ. 179

మ॥ "భగవన్నామజపమ్ముకన్నఁ దరణోపాయమ్ము లే"దంచునే
అగుపట్టుం జదు వెంతగాఁ జదివినన్; వ్యామోహ మద్దేవుఁ డం
తగ నాత్మస్తుతియందుఁ బొందుటకు సందర్భం బదేలాటిదో?
తెగ దస్మాదృశమందబుద్ధులకు నిర్దేశింపఁ గామేశ్వరీ. 180

శా॥ వేదాంతమ్ముల నెంతగాఁ దడవినన్ వేద్యమ్ము గన్పట్ట దే
వేదుల్ తత్త్వ మెఱింగిరో? నిజము దేవీ! నీకుఁదక్కంగ నే
వేదాంతజ్ఞులకే నగోచరమ యీవిశ్వంబు మాయామయం
బై దైవాఱడి నిల్చె, క్రీడ యిది నీకౌఁ దల్లి! కామేశ్వరీ. 182

మ॥ మనముం గట్టిగఁ బట్టి ధ్యాన మొనరింపన్ స్వల్పకాలమ్ములోఁ
గనసా వేద్యమటందు రక్కలిని, నిక్కంబే యగుంగాక యె
వ్వనికి న్నీదయ లేక తాదృశమహాభాగ్యంబు చేకూరు! నా
కనుకంపన్ ఘటియింపు మట్టిమది ని న్నర్థింతుఁ గామేశ్వరీ. 183

శా॥ చూతుంజూతును బాల్య మాదిగ మనస్సు న్నీపయి న్నిల్ప, నా
చేఁ తేమాత్రముఁ గాక పోయె, నిపుడుం జిత్తమ్ము దుర్వాసనా
స్వాతంత్ర్యమ్ము వహించుఁ గాని భజియింపంబోదు ని, న్నట్టి దీ
పాతిత్య మ్మడఁగింపు మమ్మరో! భవద్భక్తుండఁ గామేశ్వరీ. 184

శా॥ శృంగారమ్మున నిల్చి వీరమున నిల్చి న్నిల్చి నన్యత్రి; భ
క్తిం గాసంతయు నిల్వ దేమికతమో? దీక్షాపరత్వమ్ము; నీ
కంగీకారమె లేదొ? నాహృదయమే ఆలాటిదో? దీక్షకున్
భంగం బబ్బనిభంగి నాకుఁ గరుణింపన్ లేవె? కామేశ్వరీ. 185

మ॥ నియమం బుండక పోవుఁగాక మఱియు న్నిష్ఠాపరత్వమ్ము త
ద్దయు శూన్యం బగుఁగాక శౌచవిధియున్ దవ్వే యగుంగాక, ఆ
శయ మెల్లప్పుడుఁ దావకాంఘ్రియుగళీ సక్తంబుగా నుండున
ట్లయినం జేయఁగదమ్మ?యింతియ నినుం బ్రార్థింతుఁగామేశ్వరీ. 186

మ॥ తరణోపాయము లెన్ని యున్న భగవద్ధ్యానానకున్ లోచ్చు,పూ
ర్వఋషుల్ దీనఁ జరించి రేను గవివర్గస్థుండనై "నాఽనృషిః
కురుతే కావ్య" మనంగ నిక్కమును నై రొంతేని అవ్వారి నై
ఝరి నా కబ్బదె? నీకు దాస్య మొని గాఁగా నేర్తు? కామేశ్వరీ. 187

శా॥ నూతం బోర్చెదు మున్గినంత వెస నెంతో పేర్మిఁ బైకెత్తె దే
యీఁత న్నేరని నన్ను; నెందనుక నీ విట్లాట సాఁగించె దో
మాతంగీ! యిఁక నెప్పుడమ్మ? పరిణామం బీవినోదాన కే
నేతంపున్ ఘట మెక్కొ-? భక్తుఁడను న న్నీడేర్పు కామేశ్వరీ. 188

మ॥ అనుకొన్నన్ మతి లాభమే మిపుడు నే నా జన్మము న్నీదుభ
క్తిని బ్రేమించెడివాఁడ నయ్యు మరలన్ గేహాది రక్తుండనై
జననమ్మున్ వృథ సేసికొంటిని; భవిష్యజ్జన్మమేనిన్ విర
క్తినిధాన మ్మొనరింపుమమ్మ! నిను నేఁ గీర్తింతుఁ గామేశ్వరీ. 189

మ॥ పనికిన్ మాలినవార్ధకమ్ము ముదిరెం, బ్రారబ్ధకర్మక్షయ
మ్మునకై కాయము వేచియుండె,నిపుడేమో? నిన్ను ధ్యానింపఁబూ
నిన నేమా? నటులేని మానగ యెటో నీధ్యానముం జేయుచుం
టి, నరోగిన్ బొనరించి ధ్యానము నెటో నెగ్గింపు కామేశ్వరీ. 190

మ॥ ధనముం బెద్దగ గౌరవింతురు యథార్థజ్ఞానశూన్యుల్, విర
క్తిని దానిం దులఁదూఁచి చూచినయెడం దేలున్ యథార్థంబు,దే
నిని గైకొన్న మహేంద్రుఁడేని యలవానిం జూచి కంపించు దా
నిని వర్ణింపఁగ బ్రహ్మకేని దరమానే? తల్లి కామేశ్వరీ. 191

మ॥ ధన మార్జించెద మేడఁ గట్టెదను, లేదా? దారపుత్రాదులన్
గనకాలంకృతులం బొనర్చెద, నిఁకేకా! యెంత సేపున్ మనం
బున నజ్ఞుల్ పొనరించుధ్యాన, మది యేమో? కాని విజ్ఞానులా
ఘనులున్ దీనికి దాసులై చెడుటయే కన్పట్టుఁ గామేశ్వరీ. 192

శా॥ ఎన్నే నాధులు వ్యాధులుం గలిసి నావృద్ధత్వముం జుల్కఁగాఁ
జిన్నంబుచ్చఁ గడంగుచున్నవి, త్వదాశీఃపాత్రుఁడ న్నేను; నా
యౌన్నత్య మ్మఖిలమ్ము నీయదియకాదా? దీనిఁ గాపాడఁగా
నిన్నే ప్రార్థనఁ జేతు, వేఱొకరుని న్నే వేడఁ గామేశ్వరీ. 193

శా॥ చీకుం జింతయు లేనిమంచిబ్రదుకుం జేకూర్చి రక్షింపు మెం
తో కాలమ్మిఁక నుండఁబో, దిపు డెపో? తుందుడుక్క లెన్నెన్ని యో,
నాకుం దోఁచుచున్న, వెట్టులో నను న్నాకాధిరూఢుం బలె
న్వీఁకం జేర్పఁగదమ్మ? యొడ్డునకు, దేవీ! తల్లి కామేశ్వరీ. 194

మ॥ ఒకచిక్కా? మఱియెన్నిచిక్కులో మదాయుస్థానమున్ జేరి న
న్నొకసక్కెమ్ము లొనర్పఁగాఁ దొడఁగె, నీదృగ్రక్షణ మ్మున్న "నా
కొకలోపమ్మును గల్గఁబో దనుచు నే నూహించుకొంచుం జలిం
పక యిట్లుంటిని దల్లి? చల్లనికృపన్ వర్షింపు కామేశ్వరీ. 195

మ॥ బ్రతుకున్ దీర్ఘ మొనర్పు మంచు నిను నేఁ బ్రార్థింప, నున్నట్టిజీ
వితమున్ శ్లాఘ్యముగా ఘటింపు మనియే వేమాఱు కేల్మోడ్తు నేఁ
గృతకృత్యుండను, నాకు లోప మెదిగానీ లేశమున్ లేదు నీ
కతనన్ సంపద లెన్ని యేవియుచు నేఁ గైకొంటిఁ గామేశ్వరీ. 196

మ॥ జననీ! యెంతని విన్నవింతును భవత్సంరక్షణ న్నేను బొం
దినసౌభాగ్యము; లోకమే యెఱుఁగు, నేదీనత్వమున్ లేనివా
నినిగా నన్ను ననుగ్రహించితివి, కానీ వృద్ధతంగూడ న
ట్లను మోదించితి వేనిఁ బూర్ణమగు ధన్యత్వంబు కామేశ్వరీ. 197

మ॥ జర రాఁబోఁగల దంచు నే నెఱిఁగియుం జర్చింపలే "దింతమ
స్తరమా" నంచగుఁ;గాక యిప్పుడయిదం ద్వాత్రింశదబ్దంబు లొ
దరుపై యున్నవి, దీని నశ్రమముగా దాఁటంగ నే నేస్తు "ప్లే"
మరుతో సాగరమెట్టి దేని సుఖగమ్యం బంబ? కామేశ్వరీ. 198

శా॥ నీపై భక్తి జనించుటే తడవుకానీ భక్తి చేకూరుచో,
నాపైనన్ జరగాని ఆమయము లోనౌ పీడలేగాని దూ
రాపాస్తమ్ము లటంచు నే నెఱిఁగియే ఆర్జించుకొన్నాఁడ నీ
కృపాప్తి; న్నన్నిఁక నేమి చేసెదొ జరాభాగస్థు కామేశ్వరీ. 199

మ॥ జర నాఁగా నొకి ఘోరరాక్షసికి విశ్వఖ్యాతమౌ పేరు, త
చ్చరితం బెంతగ సంస్కరింపఁబడినన్ సౌమ్యమ్ముగా నుంట ద
ష్కర, అట్టయ్యును ద్వత్కృపాకలన నాపైఁ బూర్తిగా నించి ఆ
జర నాకుం బ్రతికూలగాని విధమున్ శాసింపు కామేశ్వరీ. 200

మ॥ పసికిన్ మాలినవార్ధకమ్ము ముదిరెం బ్రాణాలపై దీపి వో
యిన "దేష్టానో? త్వదాష్ట" యంచు మదిలో నేఁ జూచుచున్నాఁడనీ
మను వార్థన్ జపియించుచుంటి, నను సన్మానింతువో? లేదో? ద
ర్శన మీఁగూడదె? స్వప్నమందయిన నేరంబేమి? కామేశ్వరీ. 201

మ॥ కలలో దర్శన మేమిలాభ మనుకోఁగా రాదు, సంసారమే
కల విజ్ఞానులదృష్టిలో; జననీ! యేకార్యమ్ము నాలాటి దే
యిల సర్వమ్మును స్వప్నమే మఱియు సందీస్వప్న మొక్కండు; నా
కెలమిం గూర్పఁగదమ్మ! యెట్లయిన నేమీ! దేవి! కామేశ్వరీ. 202

మ॥ చిరకాలమ్మయి పోయె స్వప్నమున నీచిద్రూపముం జూచి, నా
కఱవుం దీఱఁగ దర్శనంబిడు మహాఘంబుల్ పటాపంచలై
సురుఁగుంగావుత, దానఁజేసి హృదయక్షోభంబు దౌదవ్వగా
నఱుగుంగావుత, నాదుజన్మమును ధన్యంబౌతఁ గామేశ్వరీ. 203

శా॥ నా కీవ్యాధి భరింపఁగాఁ దగినచందమ్ముం గటాక్షించి యె
ట్లో కాలమ్మును నెట్టఁ జేయు, మిహమం దున్నష్టు నాకోర్కె యిం
తే కళ్యాణి? అనంతర మ్మెదియుఁగానీ నీదుదాస్యంబు ము
న్నే కోరంబడె, దానికిం గవితకు న్నేస్తంబు కామేశ్వరీ. 204

మ॥ కవన మ్మొక్కటిదక్క నింక నెదియుం గాదమ్మ? నాచేఁత; నీ
సవిధమ్మందునఁ గాళిదాసముఖు లిచ్ఛామూర్తులై యుందు రం
చవలోకించితి భావవీథిఁ, దిరుపత్యాఖ్యుండు సందుండు, నన్
గవులందాం బనిగొన్ము నిల్పి; యని నేఁ గైమోడ్తుఁ గామేశ్వరీ 205

మ॥ జపియింపన్ గోష్ఠునఁ గాళిదాసుఁడు వినాగా నీదుప్రత్యక్షమై
భవమున్ జూచినవారు లేరు, మఱి స్వప్నమ్మందునో? నన్ బలెన్
గను లేకొందఱో చూచియుందు,రదియుం గళ్యాణి! సామాన్యమా?
భవితవ్యంబు విభూతికిన్ గుఱుతుగా భాసిల్లుఁ గామేశ్వరీ. 206

♦మ॥ అలలీలాశుకు నంతవానికిని స్వప్నావస్థలో దర్శనం
బులతోఁ గాలముపుచ్చెఁ గృష్ణుఁడను దుక్ బోధించుఁద త్కావ్య,మిం
కిల మాదృశ్యుల లెక్క యేమి; కలలోనే యాత నీదర్శనం
బలమిన్ గాంచఁగ గంగలాఁడ,నటులే యీవమ్మ! కామేశ్వరీ. 207

మ॥ మది "పంచాపది"తోడ వ్యాధివెత లావ్మాయించుచున్ జీవితం
బిది యొందాఁక భరింతు? నిప్పటికి నా కేలోపమున్ లేక యు
న్నది, యుపాసన నున్నయస్థె కృపతో నాజ్ఞన్ బ్రసాదించి నీ
పదభక్తాగ్రిములందుఁ జేర్చికొనఁగాఁ బ్రార్థింతుఁ గామేశ్వరీ. 208

మ॥ తనువా? చెప్పినయట్లుగా వినదు వార్ధక్యమ్మునం, దట్టులే
తనుజాదుల్ విన, రెంతవానికిని నీ వైన్యంబు తుల్యంబ యో
జననీ! దీనివిముక్తికిం దెరువు విజ్ఞానంబ, తద్వ్యస్త వే
షమునలో నీపదపద్మభక్తికతనం బైకొందు కామేశ్వరీ. 209

మ॥ ముదిమిం గోరిక లుండ వందు రది యేమో! కాని నామట్టుకున్
ముదిమిన్ సైతము కోరికల్ కనుపడున్ మోక్షేచ్ఛ యొక్కండు ని
న్నెపుడు వీక్ష్య మొకండు సంతతికి సౌఖ్యం బబ్బ నొక్కండు, సం
పద నాసంతునకుఁ గల్గు నొక్కఁ డివి, యిమ్మా తల్లి! కామేశ్వరీ. 210

మ॥ "మునవేషన్ మది తప్పు" నందురు నిజమేమో? కాని నామట్టుకున్
మనసు చక్కఁగనె యుండె దేహబలమే మందీకృతం బయ్యె నీ
పదభక్తిన్ గడియించి యింట నెటులో వర్తించుచున్నాఁడ దె
బ్బదిపైదా పిప్ప, దేమిచేసెదవో? యీపై నన్నుఁ గామేశ్వరీ. 211

• "స్వప్నే దృష్ట స్తరుణతులసీభూషణో నీలమేఘః" అని కృష్ణకర్ణామృతము.

శా॥ ఏరీతిం బరికించి చూచిన సుఖం బేమాత్రమున్ లేని సం
సారమ్మందున సౌఖ్యముం గనెడియాశల్ భ్రాంతి; దుఃఖమ్ములో
నేరవ్వంతరయొ? తగ్గి యున్న నదియే యెంచున్ "సుఖం"బంచు సం
సారాసక్తుఁడు, జ్ఞానికిం దెలియు నిస్సారంబు కామేశ్వరీ. 212

♦మ॥ తను వత్యంతము హేయ "మన్ననుడి తథ్యమ్మే యగుంగాక ము
క్తిని బొందన్వలె నన్న దానిఁ గొనియే తీరన్ వలెన్ ధర్మసా
ధనసామగ్రికి నాద్య మయ్యదియు కాదా? దాని కీవమ్మ? వెం
కన నీకుం గడు భక్తుఁడేనియు నరుగ్ణత్వంబు కామేశ్వరీ. 213

♦మ॥ గృహసంబంధము వీడి మానసమునన్ "హేగౌరి" "హే దేవి" యం
చహమున్ రేయియు నీదునామములు సన్న్యాసమ్మునం దుండి నే
రహి ధ్యానించుచుఁ గాలముంగడపఁగా రాగిల్లితిం గాని యి
"మ్మిహ" ధాత్వర్థకరోగ మప్పుడవి లేమిం జేసెఁ గామేశ్వరీ. 214

మ॥ అలసత్యవ్రతుఁ డాసుదర్శనుఁడు లోనా భక్తు లేమంత్రవి
ద్యల శాస్త్రోక్తముగా జపించిరి? గుఱుం డవ్వారి కెవ్వండు నే
నలమార్గమ్మునె పట్టి నిన్ను మదిలో ధ్యానించెదన్, గాంచెదన్,
ఫలముంగూడ; నిను న్నుతించు టగునే! వ్యర్థంబు కామేశ్వరీ .215

శా॥ సారం బంతకు నంతకుం దఱిగెఁ గార్శ్య మ్మెచ్చె నిప్పట్ల నె
ట్లో రవ్వంత బలంబు నీవిడితి వేలోపమ్ము లేకుండఁగా .
నేరోజుల్ దిగఁద్రొక్కుచుంటి, నిఁక నాయాయుస్సికేలాభ మం
బా! "రార"మ్మని దాస్యమందు నిలుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ.216

మ॥ భగవత్సత్తకు నమ్మకుండెడి జనుల్ ప్రాణావశిష్టంబుగా
నగచాట్లం బఱునాదు దేహమును నాయం దున్న స్వాతంత్ర్యమున్

---

♦ టిప్పణి: శ్లో "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అని కాళిదాసు,

♦టిప్పణి: మిహ ధాత్వర్థకరోగము=మేహరోగము (మిహ సేచనే అను ధాతువునుండి మేహ శబ్ద మేర్పడినదని తెలుసుకోవాలి)

దగఁ గన్గొందురయేని చట్టన యథార్థంబెల్ల విస్పష్టమౌ
నిగమజ్ఞానులసేవ సేయుపని లేనేలేదు కామేశ్వరీ. 217

మ॥ ఇది నాకెక్కడనుండి వచ్చె నెటులో రేయి లేతుఁ గూర్చుంచు ప్రా
యుడుఁ బొత్తమ్ముఁ బఠింతు,సర్వమును నీయున్కి న్ మది న్నమ్మి నిన్
బదపద్యమ్ములతో నుతించుఫలమే, బాధింప నేమయ్యె? "నీ
గదమే న న్నిటు ధన్యుఁ జేసె"నని వక్కాణింతుఁ గామేశ్వరీ.218

మ॥ కడచున్ రాత్రి సుఖమ్ముగానె పగలే కష్టమ్ముగాఁ దోఁచు నే
విడుపో ఆర్తికిఁ గొంత నీ విడుటచే వేగింతుఁ గాలమ్ము, నె
ప్పుడుఁ బన్నుండుట కష్టమే అయిన నీపున్యాన నిట్లుంటి నీ
పడకన్వీడి చరించుశక్తి నిడఁగాఁ బ్రార్థింతుఁ గామేశ్వరీ. 219

♦శా॥ ఘోరారణ్యములం దపశ్చరణకై కూర్చున్న విజ్ఞానులు
నీ్నరూపుం గనలేమియే కతలు వర్ణించున్ జడస్వాంతుఁడ
న్నీరూ పేఁ గననేస్తునే? కలను ము న్నేఁ గంటి నాపుట్టు వా
హ్నై రంజిల్లెను నంత కిబ్బడిగ దీప్తం బొచుఁ గామేశ్వరీ. 220

మ॥ గురుసంబంధము ద్వాదశాధిపతి శుక్రుం డంది లగ్నమ్మునం
దు రహిం న్నిల్చె, గురుండు రాజ్యపతి,చంద్రుం డిర్వురం జూచెడిన్
బరిపూర్ణుం, డిటువంటిజాతకులు భవ్యం బిందునందుం బొరిం
బొరిఁ గాంచంగలరంచు శాస్త్ర మది తెల్పుంగాదె? కామేశ్వరీ.221

*మ॥ కుజరాహుల్ ఖలు లిర్వురుం గలిసి రకూర్రాత్ములౌ వీరితో,
ధ్వజుఁడో? చంద్రునితోడఁ గూడె,నిట "సంవాదమ్ము"చే మంచికే

♦ టిప్పణి; లగ్నం మిధునమనియు అందున్న గురుశుక్రులను సప్తమ స్థాన మందున్న పూర్ణచంద్రుఁడు చూచుచున్నాఁడనియు నెఱుఁగఁదగు—

* టిప్పణి: ధ్వజుఁడు—కేతువు. సంవాదమ్మచే — "సంవాదాత్ప్రామాణ్యమ్" అను జాతకశాస్త్రపరిభాషచే లగ్నమందున్న స్వతశ్శుభులైన గురుశుక్రులతో స్వతః పాపులైన కుజరాహువులు కలిసినను చంద్రుణ్ణి కేతువు కలిసినను మొత్తంశుభఫలానికే ప్రాధాన్యం కలదని తాత్పర్యం ,(అనుభవంకూడా దీనికి వ్యతిరేకించినట్లులేదు)

విజయం బజ్బెడిఁ బెద్దకుం గలుగ దే వీక్షించితిన్ నాకు ని
ర్వ్యాజనుల్ పొందెడి సద్గతిం గృపను నీ వీవచ్చుఁ గామేశ్వరీ. 222

శా॥ ఆయీ కూడిక నాదు స్వర్గతి కనాయాసప్రయాణానకున్
సాయంబుం బొనరించి తీరుఁదను విషన్నాత్రిమున్ లోఁగకే
యేయార్యుల్ పర మేగి? రీనలఁతే చా నేనోఽపహారార్థ మొ
కో! యేమో? భవదంతరంగ మెటు నేనూహింతుఁ గామేశ్వరీ. 223

శా॥ "ప్రారబ్ధం బనుభూతిఁదక్కఁ జెడ" దన్పల్కే మొ? సిద్ధాంతమే
యేకున్ దీనికి దాసులే, యిపుడు న న్నింకొక్కమార్గాన ని
న్నారాధించితి నంచుఁ బ్రోచునెడ శాస్త్రార్థకత్వంబు "దు
ర్వారం బౌ" నని మిన్నకుంటివని నే భావింతుఁగామేశ్వరీ. 224

మ॥ ఇపు డేమాత్రమొ కస్తి గూర్చినను నా కీమాత్రపున్ శక్తి దే
హపటుత్వ మ్మగుపట్టునప్డె భవదీయావాసముం జేర్చి నీ
కృపచూపింపఁగఁ గోరెదన్, ముదిమితో నెల్లెట్లొ వేగించుటల్
కృపణత్వానకె కాక యెందు కని నే నిట్లంటిఁ గామేశ్వరీ. 225

మ॥ కొడుకుల్ ప్రాజ్ఞులెయయ్యు వాంఛ్రమటినాకుంబ్రాజ్ఞులట్టుల్ కనం
బడ, రీచింత యొకండు మిక్కిలిగ నన్ బాధించెడిన్ నాకు నె
క్కుడుగా వాయువుఁ బెంచుటెందులకుఁ, జిక్కుల్ సర్వముందప్పు నీ
కడకుఁ జేర్పుము తల్లి! దోషములు నిష్కాసించి; కామేశ్వరీ. 226

*శా॥ అప్రౌఢాత్మవివేకులౌ జనుల కాయూసార్థమే ఆయుదా
ప్తిప్రాబల్యము, జ్ఞానవంతులకుఁ దద్ధీశక్తి నానాఁట ము
క్తిప్రాప్తిన్ గలిగించి సార్థక మగున్, గించిజ్ఞుడం దల్లి! నే
నప్రాజ్ఞుండను నాకు నేమిటికి దీర్ఘాయుస్సు కామేశ్వరీ. 227

* టిప్పణి॥ శ్లో. అప్రౌఢాత్మవివేకానా మ్మాయు రాయాసకారణమ్ అని జ్ఞాన
జ్ఞానసిద్ధం

మ॥ ఇతరవ్యాపృతి సర్వము న్విడిచి ని న్నేవేళ ధ్యానించుప
ద్ధతి నాకుం గరుణించెదేని యిడుమవ్యా? కీర్తి మాయుష్షు, సం
సృతిగోష్ఠీవినిబద్ధమా మనముతో నెన్నండు లీలాగు జీ
వితముం బెంచిన నేమి లాభమగు! దేవీ తెల్పు కామేశ్వరీ. 228

శా॥ "ఓనామా"లను మాత్రమే యెఱుఁగు నేరో? వెక్కశంకల్ సమా
ధానం" బిమ్మని చేసినంతటనె తత్త్వంబు గుర్తింపకే
నీనామస్మరణంబు మాని వృథగా నే నందుకున్ బ్రొద్దుమ
న్నా నేరంబు క్షమించి భక్తి నిడి నన్ రక్షింపు కామేశ్వరీ. 229

మ॥ గురుకోటిస్థలై యసత్యసత్యములతోఁ గొల్లఁగొట్టకుం బిల్వ నీ
స్మరణంబుం దిగఁద్రావి పత్రికలలో సత్యంబు నిరూపించువారిల్
పోరి వారియుం బురికొల్పకమ్మ? యెవరో? బొంకంగనేమయ్యె స
త్పురుషుల్ సత్యవిదుల్ గలారు నిజమున్ బోధింత్రు కామేశ్వరీ. 230

శా॥ నన్నుం బ్రాజ్ఞునిగాఁ దలంచు జను లున్నా రెందఱో? వారు నా
కన్నన్ మందులు; లోకమెల్ల నిటులే కన్పట్టు నిర్దుష్టమౌ
విజ్ఞానం బనఁ జాల మృగ్య మది యే వేదాంతులం దేని యి
ప్డున్నట్లో; అలవారి కంకనిదియై యున్నట్లు కామేశ్వరీ. 231

మ॥ ధనవంతుండగు గేస్తు నిన్ను మదిలో ధ్యానించుచో వచ్చి కి
చ్చినదారిద్ర్యమ్మును గాలదోషము లెడం బేకాకు గావించు న
ట్లని దారిద్ర్యము సాధనం బనియు వ్యాహారింప నే నొప్పఁ బ్రా
గ్జనిసంస్కారమె ముఖ్యహేతు వని వక్కాణింతుఁ గామేశ్వరీ. 232

మ॥ జనకుండన్నృపపాలి ప్రాగ్జనన సంస్కారమ్మునం గాదె? యే
మునులు న్నేరని తత్త్వరాజ్యమునకున్ మూర్ధాభిషేకంబు గై
కొనియెన్, నిస్పృహ యొక్కఁడే మనుజు విజ్ఞున్ జేయు నద్దానిఁ గై
కొనఁడేనిన్ జను డెంతటి క్షేత్రి నను గూర్చుండంబు? కామేశ్వరీ. 233

♦శా॥ ఎంతో పుణ్యమొసంగి కొన్నదిగదా? యీదేహము న్నొక; కా
సంతేనిన్ జెడకున్నయప్డై కృతకృత్యత్వంబు నైకొంద్రు ధీ
మంతుల్ యోగులు; మమ్ముఁబోట్లు వృధగామాంద్యమ్మునన్ గ్రుంగిదు
ర్దాంతాపారము సంసృతిం గనరు పారం బెప్డు కామేశ్వరీ. 234

మ॥ అరిషడ్వర్గమునందు లోభగుణ మత్యంతమ్ము దుష్టంబు; త
త్పరిభావం బది సర్వకాలము నరున్ బాధించుఁ, గామాదులో?
అరులే యయ్యు నొకొక్కకాలముననే ఆవేశముం జూపు, నీ
యరి స న్వీడునటుల్ పొసర్చుటకునై ప్రార్థింతుఁ గామేశ్వరీ. 235

మ॥ "చిరజీవిత్వము భాగ్య" మందు, రది తా సిద్ధించెఁ గా? కాక; కే
పరమార్థంబు గడించె దాన నది; అంబా? తాదృశం బైనచోఁ
జిరజీవిత్వము మానవత్త్వమున కేసేమంబు చేకూర్చిన
ట్లరయ న్నేరరుగాక మోఱకులు భూతార్థంబు కామేశ్వరీ. 236

శా॥ ఆరోగ్యానకు లేదు లోప, మెటులో ఆహార మార్జించుకొన్
దారుల్ కొన్నిటి నేర్చు, బిడ్డలఁ గనున్ దారానుకూల్యాన సం
సారంబుం దగఁ జక్కఁబెట్టుకొను, సంసారింబలెం గాక; యిం
తే రూపింపఁగ దీర్ఘజీవితఫలం బేముండెఁ గామేశ్వరీ. 237

*శా॥ "ఏనాఁ డౌభవదాజ్ఞ" యం చిపుడు గా దే నప్డు ప్రాయంపుగా
లానన్ విన్నప మంపికొంటి, నెదియో లాభంబు నా కీవు చి
త్తానం జే యఁదలంచికాదె? మఱి యిందాఁకన్ విలంబించి, త
ద్దానిం జేసితి లోటు లేద యిఁక నే ధన్యుండఁ గామేశ్వరీ. 238

• టిప్పణి శ్లో బహూనా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా॥ అన్న శ్లోకతాత్పర్యం దీనిలో అనువదింపఁ బడింది

* టిప్పణి॥ మొట్టమొదట కామేశ్వరీశతకములో వున్న "ఏనాడౌభవదాజ్ఞ" అనేపద్యం చూచుకోఁదగు.

మ॥ ఇటుపై నింకను నన్ను నిల్పుటది నీ కిష్టంబుగా నున్నచో
స్ఫుట మారోగ్యము మొసంగఁగావలయు నిచ్చో నీవు నా కిచ్చునం
తటి యారోగ్యము చాల, దంబ యయినం దాఁ గోరకే యిచ్చునే?
యెటులైన న్నను ధన్యుఁ జేయుపని నీదే తల్లి కామేశ్వరీ. 239

మ॥ ఎటులో భుక్తికి లేచి కాల్యముల కష్టో లేచి జీవించి యుం
డుటకన్నన్ భవదీయమా కరుణకున్ దుస్సాధ మేముండు? దు
ర్ఘటమే యైనను నీయనుగ్రహముచేఁ గైకొందుఁ గార్కశ్యవి
స్ఫుటమా కాయము, దీనిఁ బాపుము జరాపూర్ణంబు కామేశ్వరీ. 240

శా॥ ఆయుర్దాయముకోసమై మిణుకఁబో నంబా? యెటో శీఘ్రమ మీ
కాయంబుం ద్యజియించు భాగ్యమునకే కాంక్షింతుఁ గైవల్యము
న్నే యాచింపను దుర్లభం బది, యెదో నీసన్నిధిం దాస్య మొం
డే యాసించెద నిమ్ము మాను మది నీయిష్టంబు కామేశ్వరీ. 241

శా॥ పోనీ నీవు వసించు క్షేత్రములలోఁ బూజారిగా నుండున
ట్లైనం జేయుము కాంచినో? మధురనో? అన్యత్రనో? దాన బ్రి
హ్మానందమ్మునఁ బొంగి వచ్చుజనిలోనైన న్నినుం జేరు సో
పానమ్ముల్ సమకూర్చుకొందు నిదు నేఁ బ్రార్థించి; కామేశ్వరీ. 242

శా॥ వృత్తుల్ పెక్కులు గల్గియుండినను నిన్నే వేళఁ బూజించునా
వృత్తిం బోలవు, నింద్య మర్చకత యం చేవారో వాక్రుచ్చి, రే
వృత్తిం జూచిన దోస మందుఁ గననౌ, నీయర్చకత్వంబు సం
పత్తిన్ మోక్షము రెండు నిచ్చునని మద్భావంబు కామేశ్వరీ. 243

మ॥ పరమే కొన్ని యిహమ్మె కొన్ని యుభయప్రాప్తిం బ్రసాదించు నీ
చరణారాధన; అట్టిదీనికొఱకే జన్మింప ప్రాణుల్ మహా
త్తరసౌభాగ్యనిధుల్ గదా? సుఖ మిటాఁ ద్వైతేన కావించి స్వ
ర్గరము బొందక అర్చకుండె చెడుట నేరం బమ్మ! కామేశ్వరీ. 244

మ॥ ఒకచో నేఁగఁ బనేమి? యర్చకున, కేలయూ రేమి వైయుకన్ భవ
త్ప్రికటాంఘ్రిద్వయపూజకున్ వలయు తత్తత్పత్రపుష్పాది వ
స్తునికరంబును సేకరించుకొనుచున్ శుద్ధాత్ముఁడై నిన్నుఁ బా
యక సేవించుట భుక్తిముక్తు లిడుఁగాదా? తల్లి! కామేశ్వరీ. 345

మ॥ తనయంత న్నినుఁ గొల్వఁగన్న పితరుల్ "త న్నందు" రంచేని సీ
దినముం గొల్చెడియర్చకాన్వయమునందే పుట్టి పెంపొందఁ గాం
చిన ప్రాణిన్ సుకృతాత్ముఁగాఁ దలఁచు మచ్చిత్తంబు, నీపాదు కా
ర్చన మెట్లోని లభించుఁగాక అది వ్యర్థం బౌనె? కామేశ్వరీ. 246

మ॥ ధనమున్ గొంచుఁ బరార్థమర్చనము నింద్యమ్మంచు శాస్త్రమ్ములా
డునుగా, కందుల కొప్పరా, దొరుల నెట్లో పొట్టకై కొల్చు టె
వ్వనికో తక్కినఁ దప్పరాదు కద? అ ప్పాటున్ భవత్సేవయుం
బొనరింపం గలవాఁడు ధన్యుఁ డన నొప్పో? తప్పొ? కామేశ్వరీ.247

మ॥ క్షమ నేవృత్తియుఁ జేయు కెవ్వనికి సంసారంబు దుస్సాధ, మా
శ్రమ మన్యత్రి నొనర్చుకన్న భవదర్చం జేయఁ జేకూరఁ "ప
ర్థము స్వార్థమ్మును గూడివచ్చుట"గదా? తద్భాగ్యము నోర్చఁచి యు
క్రమమార్గమ్ములు ద్రొక్కు జీవితము గర్హ్యాంబంబ! కామేశ్వరీ.248

మ॥ ఫలము ల్లోనగు మంచివస్తువులు దేవప్రీతికై యుక్తమం
బులుగాఁ గైకొని ఆత్మసన్నిధికి భూపు ల్పెదలుంగూడ స
ద్గలపున్ భక్తిని దెచ్చి యిచ్చెదరు భాగ్యం బింతకన్నన్ మను
ష్యులలో నెవ్వని కున్న దర్చకుఁడుధన్యుండమ్మ? కామేశ్వరీ. 249

* మ॥ ధర వాణిజ్యము లాభకారి యనుచుం దజ్ఞుల్ ప్రశంసింతు రం
పరయ న్నిత్యము సత్యహాని ప్రతివాక్యమ్మందుఁ గన్పట్టుటన్
బరమే కాక యిహమ్మునందుఁ జెడు, నంబా? నీదు పాదార్చనా
భరమే యుక్తమొ? వర్తకంబెవరమో; వాకుృచ్చు కామేశ్వరీ.250

* టిప్పణి శ్లో॥ వాణిజ్యే వర్తతే లక్ష్మీ. స్తదర్ధం కృషికర్మణి. తదర్ధం రాజసేవాయాం భిక్షాయాం, నైవ నైవహి అని అభియుక్తవచనం.

మ॥ "హాలవృత్తిన్ గయికొంద"మన్ననుబళుబ్రాయుల్ పశుల్ సేప్యతా
స్థలముల్ గాఁదగు టబ్బు, విప్రులకుఁ దద్వ్యాపార "మాపన్నమా
కలనీయం" బని చెప్పఁడే? మనువు; త్వత్కైంకర్యముం బోల నీ
యిలలో నొండొకవృత్తి యెయ్యెడల లేనేలేదు కామేశ్వరీ. 251

*మ॥ నృపసేవాపను లొందు కష్టములు వేఱె చెప్పఁగా నేల? బల్
త్రప పుట్టించు స్మరించుమాత్ర "నసిధారాలేహన" మ్మంచు మున్
వ్యపదేశింపరె? పండితుల్; సుఖము త్వత్పాదార్చకత్వంబె, యే
యపకారమ్మును లేదు దీనఁ; బరమోత్ప్రాప్తించుఁగామేశ్వరీ. 252

మ॥ ఇఁక భిక్షాటనవృత్తి, దోస మొకఁడే నీవృత్తిలో లేద ఘా
ట్టకు నష్టప్పటి కంతొ? యింతొ? నసుకూడం గల్గు, నిద్దాన ని
ల్వకు సంపాదనగావు టబ్బ దిదియున్ భావత్కపాదాంబుజా
ర్చకువృత్తిన్ గడవంగ నేర దతినిస్వం బౌటఁ గామేశ్వరీ. 253

మ॥ కల వింకన్ బలువృత్తు, లెయ్యవియు నీకైంకర్యముం బోల, వీ
ఫలవంతమ్మగు వృత్తి పాల్పడియుఁ బాపవ్యాపృతిన్ బోవుని
ష్ఫలులం జూచి విచార మందవలెనో? సంతోషముం బొందఁగా
వలెనో?యిం దెది యుక్తమో?నొడువుమంబా దేవి?కామేశ్వరీ 254

మ॥ ప్రతిబంధమ్మన నేని నీదగుసమర్చ న్నిత్యమున్ సల్పువాఁ
డతిధన్యాత్ముఁ డటన్న యానుడికి నంబా! వ్యాసముఖ్యుల్ మహా
యతు లాధారము, దేవి! నీపద మెటో అర్చించుటే పుణ్యాసం
గతి, అట్లబ్బియుఁ జేయకుండు టది దుఃఖప్రాప్తి కామేశ్వరీ. 255

---

• టిప్పణి: ఆపద్ధర్మతయా మనోజ్ఞ కృషిగోరక్షాదికం సమ్మతమ్ అని పట్టికవి.

* టిప్పణి: రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనమ్.

శా॥ అంతో? యింతయొ? నీదుభక్తుఁడను నేనై యుండి వార్ధక్యవి
క్రాంతిన్ దాసికిఁ దోడు రోగభరసంక్రాంతిన్ గడున్ లోఁగితిన్
మంతు లెక్కకుఁ దేక నన్ను నెటులో? మన్నింగఁ బ్రార్థింతు నిన్
జింతింపన్ సకలాఘముల్ సుడుఁగుటే సిద్ధంబు కామేశ్వరీ. 256

మ॥ తలఁ జీపీడ యొకింత దక్కిన భవద్దాసుండనౌ నాకు నే
కలవున్ లేమి నిజంబు దీనికి ఘనం గాతర్యమే కాని నీ
కరుణం జేసియొ? యేమొ? దుగ్ధరము చీకాకంత కల్పింప ది
త్తఱి వార్ధక్యము మీఱె "నెట్లు" లనుచుం దర్కింతుఁ గామేశ్వరీ.

♦మ॥ నినుఁ బ్రార్థింతు రదృష్టశాలు, "లలనా శ్రీరోగులై సర్వదా
ధనధాన్యాదుల దొప్పదోఁగుచు, సుసంతానాఢ్యులై దాతలై,
ఘనులై యుందు"రటంచు నే నెఱిఁగియే కైకొంటి "సంసార" మన్
నవఘం దాఁటఁగ నీదు "పాద" మనునావన్ దేవి! కామేశ్వరీ.258

మ॥ నిను ధ్యానించుచునుంటి నీపతి నెద న్నే నమ్మియే యుంటి న
న్నును బాధించుట మానద య్యొగుజ అంతో యింతో; యాఁగాక నా
కు నుపాయంబు మఱొండు లేద యిహముం గూర్పం బరంబీఁగ నా
జనిసార్థక్యము పొంటె నీస్మరణమే సాఁగింతుఁ గామేశ్వరీ. 259

మ॥ నిను సేవించిన నూరకున్న నొకటేనిన్ మానుకన్న న్నినున్
మనమందున్ స్మరియించుటే జనపరో? "మాంగళ్య మం చెంతుఁగా
వున జ్ఞానం బది యుండుదన్క నిను నేనో! పద్యముల్ గూర్చి ప్రా
ర్థనఁ గావించెద నీదుప్రార్థనము వ్యర్థం బౌనె? కామేశ్వరీ. 260

మ॥ కదళీగర్భమువంటి సంసృతియెడం గాలూఁదు సంసారి ని
న్నెద నెప్పున్ స్మరియించుచుండవలె, నంతే కాని తానేమొ? సం
పదధీశుండ నటం చహంకృతిమెయిన్ వర్తింపఁగారాదు, నీ
పద సేవన్ ఘటియించు నెట్టిదయినన్ భవ్యంబు కామేశ్వరీ. 261

---

♦ టిప్పణి: క॥ కరులు గలవారు విలసత్తరుణీసంభోగ నియతసామ్రాజ్యధురం
ధరత గలవారు నరవర పరిచితచరణులును నీభక్తులు తల్లి. అని దేవీభాగవతం—

మ॥ నవరాత్రిమ్ములు వచ్చుచున్నవవిగో? నాచేత నీయే డెటో
సవిశేషమ్ముగఁ గాకయున్న మహామున్ సాఁగింతువా? యింటనే
పువు లుండెన్ దళముల్ పొలాన దొరకున్ బూజించుసామర్థ్య మి
క్కడి కెందుండి లభించు? నీదయవినాగాఁ దెల్పు కామేశ్వరీ. 262

మ॥ శయనంబే శరణంబుగాఁగ నెటులో చావాఁగి నన్నిల్పి తా
మయమున్ వెక్కసునెట్టి, జిహ్వ యొక సంభాషించుసామర్థ్య ముం
డియు వ్రాయంగల నేరుపుండియు వృథా నే నిట్లు పన్నుందునే?
పయనం బాఁగుటకుం బ్రయోజనము సంపాదింపు కామేశ్వరీ. 263

మ॥ శివనామంబు జపించుకొంచు సుఖివై జీవించుకన్నన్ మఱొం
డవనిన్ గల్గునె! భాగ్య" మందువా? నిజం బీలాటిదే కాని నేఁ
బవలున్ రేయును శయ్యపైని వృథగాఁ బన్నుండ లేకుంటి, నో
శివదాత్రీ? మఱికొంత సుస్థితికి నాశీస్సిమ్ము కామేశ్వరీ. 264

మ॥ ఒక డబ్బైత్తును లేనినాతనుపుచం దోయమ్మ? నీ వుండి యో
పికమైఁ బద్దెము లిట్టు లల్లుటకునై ప్రేరేపుచున్నావు నేఁ
టికి నాపైఁ గలనీదుపేరిమిని గంటి న్నేను ధన్యుండ, నీ
దుకటాక్షం బిహమందుఁబోలెఁ బరమందున్ జూపు కామేశ్వరీ 265

మ॥ కవితం జెప్పఁగఁ జేయుచుంటి విది భాగ్యంబే యగుంగాక న
న్నవమానింపఁ గడంగి బొందఁ బడి రేయార్యుల్ వివాదాన, వా
రు వృథా "కోర్టు"ల వెంటఁ ద్రిప్పుటకు నారోపింప నున్నారు తే
నివి నేరంబులు, నీకు డాఁగునొకొ? నానేరంబు కామేశ్వరీ. 266

శా॥ జ్ఞానం బావలివారి దెట్టిది యొ? వాజ్ఞానం బదేలాటిదో?
నే నీకు న్వివరింపనేల? యెఱుఁగు న్నీమానసంబే వృథా
గా నన్నుం గదలింపనేల? అటు స్వీకార్యరంబు కైకోఁగ నే
లా? నాపైఁ గనలేల? వారి; కిది నీ నాలింపు కామేశ్వరీ. 267

మ॥ "భజగోవిందము" చేసికొన్ దినములం బ్రార్థకర్మాన నీ
విజయోచ్ఛ్వాసము లైన పెద్దలయెడన్ విక్రాంతి చూపించి నా
నిజము న్వెల్లడి చేయుత ప్పొకటి నానెత్తిం బడెన్, నిక్క మీ
రజముం బాపి యొసంగు సత్త్వమని నిన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ. 268

మ॥ అల గుంటూర్కలహంబు సర్వమును నీ కస్థంకితం బిచ్చి యో
గ్యులు హాక్షింపఁగఁ గట్టితిం గవిత; నీ ప్రాఁకొట్టియే యుంటి, వం
దు లవంబేని యసత్య మున్నదియె? వృద్ధుం డొక్కఁ డద్దానిపైఁ
గలిభీతి న్విడనాడి ఖండన మెదో కల్పించెఁ గామేశ్వరీ. 269

శా॥ నిన్నున్ సాక్షిగఁ జేసి వ్రాసితిని మన్నించెం బ్రపంచంబు దా
ని న్నేఁ డీతఁడు కల్ల యంచు మిగుల న్వృద్ధయ్యు ఘోషించుఁ "ద
ప్పున్న న్నీ నెటు లూరకుంటి" వని ని న్నోయంబ? ప్రశ్నింతుఁ ది
క్కన్నం దాఁ దలఁ దన్ని పుట్టెనఁట? అయ్యార్యుండు కామేశ్వరీ.270

మ॥ చలికాలంబు చలిన్ బలెం గలి కలిన్ సాఁగించు దుర్మాసపున్
బలిమిం బున్నెముఁ బాప,మంచనక స్వాంతం బెల్లొవంచించి "యా
వల లోకం బొకఁ డున్న"దం చెఱుఁగ కేవారో? యెదో వ్రాయ నా
కల మాన్యైపుస కేగె నీనుతి తొలంగం దోఁచి; కామేశ్వరీ. 271

మ॥ ఎదియేనిన్ సహియింతుఁగాని యనృతం జే సైఁచి యూఁకొట్ట లే
నిది యస్మత్ప్రకృతిస్థమైన గుణ, మాయీహేతువుం జేసియే,
పది పాత్రమ్ములు నే నొర్వవలసెన్ వార్ధక్యమం దేసి వ
న్నిది వర్జించి సుఖింపనీ, దెఱుఁగవే? యీ వంబ? కామేశ్వరీ.272

శా॥ "బో" నారోహణ చేసి దేవు నెదుటన్ బుంఖానుపుంఖమ్ముగాఁ
"దా నేమానిసి యిట్టు లాడఁ" డనఁగన్ ధౌర్త్యమ్ముమైవక్రిమా
ర్గానన్ స్వార్థసమర్థనమ్మునకు వాక్ప్రామాణ్యమున్ వమ్ముగాఁ
గా నాట్య మ్మొనరించుకన్నఁగలదే? కష్టమ్ము కామేశ్వరీ. 273

శా॥ "కోర"న్నా కటువంటినైపుణిని, నీకుం దోఁచియే యిచ్చుచో
నేరం బెట్టిదొ? "కోర్టు" కేగి యచట న్నేఁ దేర్చికో నేస్తను
న్నా రీనాకును "నడ్వకేట్లులు" సఖుల్, నా కున్న సామగ్రి నీ
కారుణ్యం బది లేక వ్యర్థ మగుచుం గన్పట్టెఁ గామేశ్వరీ. 273

మ॥ తమశక్తిం బరశక్తిఁ జూచి కొనకే ధార్ష్ట్యమ్ముతో నన్నుఁ గ
య్యమ్ముకై చీరి పరాభవంబు గని యిష్టార్థేతరుల్ ద్రొక్కుమా
ర్గ మొకం డూఁతగ నూని "కోర్టు"న జయాకాంక్షం బ్రవర్తించున
క్రమ మీవేమని మందలింప వనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 274

♦మ॥ జననీ! యే మనె నమ్మురారి, యెదియో? స్వల్పంపుఁ బాండిత్యముం
గని యల్లంతన "పెద్దకుండ కెసరుల్ కై సేయఁగా రా" దటం
చనెనో? లేదొ? వచింపుమమ్మ! పరిష్కృతం బాలోపమే "కోర్టు"కుం
బని కల్పించెడి లోకమెల్ల నగఁగాఁ బాలాచుఁ గామేశ్వరీ. 275

శా॥ పాండిత్యంబున నిగ్గు దేల్చునది విద్వల్లోకమే కాని వే
ఱొం డేదిక్కును లేద, కోర్టున జయంబో? లేక అన్యంబో యా
చుండున్, దీర్పులు చూచి పాండితి నెవా రూహింతు, రక్కన్నటుల్
గుండె న్నిండి ప్రపంచకమ్ము నగఁగాఁ "గో"ర్టైకుఁ గామేశ్వరీ. 276

మ॥ ఉరిశిక్షన్ విధియింపఁ బో దొకట నే నోడందినం "గోర్టు" క్షి
ర్లరుజాపీడితుఁ డట్టిశిక్షకును దాఁ గంపింపఁ, డిం కెందు కే
నరికిన్ భీ వడుటన్నఁ "గోర్టు" కడ కేలా? యేగఁగా నేర్తు నం
చుర కే త్రొంకుచునుంటి నేగఁ గలనేమో? చూడు కామేశ్వరీ. 277

శా॥ వాదమ్మందున నోడిపోయి మఱి యావాదంపుఁ బూర్వోత్తర
ప్రాముఖ్యాతిని దెల్పు పొత్తము "యశోభంగంబు గల్పించు" నం

---

♦ టిప్పణి: శ్లో॥ న శబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయచ జనః కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు. అని మురారి.

చేదో? వంకరత్రోవఁ బోనడఁపఁగా నెంతెంత యత్నించినం
బో దాంపాస్యము; శాశ్వతంబయి కడుం బొల్పొందుఁగా మేశ్వరీ. 278

శా॥ అగ్గిన్ నైచినయంత బుగ్గియగు కావ్యా లుండుఁబో? కొన్ని, ఆ
తగ్గున్ జాతిది గాద యయ్యది; మహాదక్షాధ్వరంబందు నీ
వగ్గిన్ దూఁకితి, బుగ్గిగా నయితివే? ఆజాతి దాపాత్త్య, మా
సి గ్గిలాటి ప్రయత్న మేరికిని వాసిం దేదు కామేశ్వరీ. 279

శా॥ "పంచాంగమ్ములు చింప రిక్కలు నశింపంబోవుగా? పండితుం
డెంచన్ మంచిప్రయత్న మందులకుఁ "గో"ర్టే నెక్క నాపాత్త్యమే
మంచిన్ లేనిది యైనఁ బోవు బుధసమ్మాన్యంబె యాచో నిజో
దంచద్దీప్తుల నీనుచున్ వెలుఁగు నాతారంబు కామేశ్వరీ. 280

శా॥ ఓహో గెల్చును గల్గు వాదములలో నోడైనచోఁ గోర్టుకున్
బోఁ దేఁపండితుఁ, డింత కేను సరిగాఁ బోరాఁడుచోఁ గోర్టులో
కూడన్ గల్గద వాదికిన్ జయము; నేఁ "గో"ర్టెక్క తే నన్న యా
జాడన్ గన్గొని చేయు యుద్ధమిది కేశాకేశి కామేశ్వరీ. 281

మ॥ ఇల సర్వమ్ము జయించితిన్ మిగిలె నిం కీ "పిల్ల" యొక్కండె వా
క్కలహమ్మందున వీని నాఁగుట యశక్యం బందుచేఁ "గోర్టు" లో
పల నిర్జింతు నటన్న సద్దియు నసంభావ్యంబ యీలాటి "కే
సు"లలోఁ దొంబదితొమ్మి దీచుక యెచచ్చున్నమ్ము కామేశ్వరీ. 282

మ॥ అదిగా కెవ్వరి గెల్చె వాది? భవదీయాంతర్యమున్ దెల్పు మ
డ్డెద నే నిప్పు "డధాత్తువాద" మది యొండే చేతనా వాది "క
య్యాది యిప్పట్టున సాఁగ" దంచెటేఁగి "కో" ర్టాసించె నిక్కంబి దే
"తుద కబ్బుం దురకంబు నా వినమొ? వృద్ధుల్ తల్లి! కామేశ్వరీ. 283

మ॥ ప్రతివాక్యమ్మను "గోర్టు" కేగఁ దగునప్పాకమ్ములో నుంట నీ
నాతికిన్ గోచర మల్లవాదినొడులన్; మచ్చిత్త మట్లేగ గే

మతిమంతుండును మెచ్చఁబోని పథమం బా? యేల త్రొక్కన్వలెన్
గతి "కోర్టా"కొ? కలావివాదముల కేనాఁడేని కామేశ్వరీ. 384

మ॥ నను దూషించిన దూషణోక్తులకుఁ జిన్నల్ పెద్దలుంగూడ ము
క్కున వ్రేల్వెట్టఁగ నెంత చింతిలిరొ నీకుం దల్లి! విస్పష్ట, మోఁ
జనుచోఁ "గోర్టు"కు నేమి యౌనో! అదినీస్వాంతంబెఱుంగున్ జనం
డని మాత్రి మ్మలపండితుం డెఱిఁగి "కో"ర్టాసించెఁగామేశ్వరీ 285

మ॥ నిను వ్యాధ్యత్యయ మాత్మఁగోరి సతము న్నే వేఁడుచుండంగఁ "గే
సున" కేగున్ రిపుఁ, డంచు విజ్ఞు లెవరో! సూచించి "రా రార! యే
మని "కో" ర్టెక్కను నన్నుఁ దట్టి" యని నే నాశ్చర్యముం బొందితి నీ
కు నెఱింగించితి, నీకు మించి కల దే? "కో" ర్టొండు కామేశ్వరీ. 286

మ॥ అనృతం బాడఁగ వీలుగా దట "సిఫా" ర్సావంతయున్ గార్యమున్
గొన సాఁగింపదు, లేనిపోని పరుషోక్తుల్ కూడ వున్నట్టిదె
ల్లను బైటం బడి తీరుఁ "బ్లీడరుల" వాగ్లావణ్య మేమాత్ర మం
దనుకూలింపదు "కోర్టు"నా నదియు కా కన్యంబె! కామేశ్వరీ. 287

మ॥ ఒకచోరుం డొకగేస్తు గేహమున నెవ్వో శీర్షముల్ ద్రుంచె నం
దుకు సాక్ష్య మ్మొకకొంత యుండియును నిర్దోషత్వమే తేలి వా
నికి నేశిక్షయు లేక నిర్భయముగానే నేఁటి కున్నాఁడు "కో
ర్టు" కడం దేలెడి న్యాయ మిట్టిదిగ నుంగుం దల్లి! కామేశ్వరీ. 288

మ॥ చనువుల్ కాల్ప నెఁ బ్రాహ్మణాన్వయమునన్ జన్మింప నేమాయె? నీ
ముదురుం బ్రాయము "కోర్టు" పా లఘునుపా ల్మెచ్చట్లుగా స్సోల్లలో
మొదలం బాలుగఁ గాయమున్ విడిచి యేమే లందనో? వానివా
క్కుదనం బందున నోడి కోర్టుకడ కేగం జూచెఁ గామేశ్వరీ. 239

మ॥ తురకల్ గోవుల మాటు నెట్టుకొని హిందూ రాజులన్ గెల్చి రం
ధు మాయుద్ధముఁగూడఁ బ్రస్తుత మటే తోఁచున్ బరంబున్నయు

ట్లకయుక్తిరా, దవి లేకయే కపటమె అగ్రాసనం బెక్కి- రా
జ్యరమాపాలన మిచ్చె మ్లేచ్ఛుల కవార్యం బౌచుఁ గామేశ్వరీ. 290

*మ॥ మనువాదమ్ముల నోడుచెందినఘుమల్ మోసాలకున్ మొట్టవె
ట్టినయట్టుల్ వినరాదు గాని యెడియో పెంకాయ భూస్థాపితం
బును గావించి యెదో ఘొసర్చినయటుల్ పూర్వేతిహాసమ్ములన్
వినమా; నేఁటికిఁగూడఁ దాదృశులయున్కి- న్గాంచుఁ గామేశ్వరీ. 291

మ॥ ఒకవిద్వాంసున కోడి చేయునని లేకొంకొక్క- విజ్ఞుండు దు
ర్వ్యకలస్వాంతు నొసగ్చె శౌబరముచే; వేఱొక్క- విజ్ఞుండు కా
శికి దాదాపుననుండి వచ్చి మురలించెన్ దత్ప్రయోగంబు; కొం
కక యోడందిన పెద్ద లిట్టిపనులన్ గావింతురో కామేశ్వరీ. 292

మ॥ "అసలే లేవివి" యంచుఁ గొంద అనఁగా నాలింతు, లేకేమి? యు
న్నసమాచారము నిక్క-మే, తెలుచు గానన్ రావు భ్రాంతాత్మ్మ లే
విషమంపున్ గద మేని గ్గుబెనెడ నీవిభ్రాంతికిన్ లోఁగుటే
వసుధం గన్పడు మృగ్య మిర్గ్యుయిప్పుడీపాంతానఁ గామేశ్వరీ॥ 293

మ॥ ప్రకృతం బికళ చేఁతగాము నెరియో పట్టిట్టి వ్రాహింతు రూ
రక "త" ప్పన్నను "దప్పగా" దని యథార్థం బేను నీసాదసా
క్షికి లోనై కద? తెల్పితిన్ దుద కిదే క్లేశంబు కల్పించి కో
ట్లో"కుఁ బోఁగాఁ దగినంత పట్టుదల నాగోపించెఁ గామేశ్వరీ. 294

♦ మ॥ తపముంజేసి రిపున్ వధింపఁగల సంతానంబు నెట్టెట్టులో
నృపుఁ డొక్క-ండు వరించె, వేఱొకఁడు తానే ఆజిలో నొక్క-టన్
"రిపులం దోలెడిశక్తి ని మ్మనుచుఁ గోరెన్, దీనికిం గారణం
బు పరీభావమె అద్ది యెంతవఱకో పోనెట్టుఁ గామేశ్వరీ. 295

*టిప్పణి: పెంకాయ—ప్రయోగతంతు చేయువాళ్ళు కొబ్బరికాయ పాతి పెట్టుదు రని చెప్పికొందురు.

♦టిప్పణి: ఈపద్యంలో ద్రుపదుణ్ణిన్నీ సైంధవుణ్ణిన్నీ జ్ఞప్తికిఁ దెచ్చుకోఁదగు,

మ॥ శవమౌ ద్రోణుని కంఠముం దునిమె నాత్మజ్ఞానిప్రత్యుప్రింపు, తా
బవరానన్ మఱునాఁడ చచ్చి పడియెన్ బార్థప్రతాపాన లెం
డవనాఁ, డెండుల కేతపంబు, లటులే యస్మత్ప్రియాశ్నంబు లు
న్నవి నేఁ, డీకృషి కెట్టిలాభమును గానన్ రాదు కామేశ్వరీ. 296

*మ॥ పరిశీలించుకొలంద భారతము సర్వం బిట్టి వ్యాఖ్యారపుం
బరిణామం బగు రాముసత్కథకుఁ జెప్పంగాఁ బనేలేద "యీ
పరిణామం బని, సైఁపలేరు పరిభావం బెయ్యెడన్ శూరు; లీ
స్త్రీజీ సూరుల్ సయిపంగ లే రనుట సిద్ధం బయ్యెఁ గామేశ్వరీ. 297

మ॥ అరిషడ్వర్గపు దాస్యమున్ సలుపునట్లైనన్ భవద్దాస్య మే
మఱలే చింతయొ? అంతయో? మదిని సంభావించియే యుంటి శాం
కరి? నేఁ గాశికి నేగి వచ్చుట మొదల్గా, దాస్యపున్ భాగ్యముం
గర మాసించితి, నేఁడు వృద్ధదశనే కాదమ్మ! కామేశ్వరీ. 298

మ॥ పరవస్తుస్మరణం బెటేని యగుఁబో! "భద్రావహం" బన్నచో
సరియే నేమము నిష్ఠయున్ మఱియు నాచారమ్ములుం జక్కఁగా
జరుగంగావలె" నన్న నాయెడలఁ దత్సంపత్తి శూన్యమ్ము; శాం
కరి! నాకున్ శరణంబు నీచరణయుగ్మం బౌండె కామేశ్వరీ. 299

♦శా॥ ఎన్నెన్నో పఠియించితిన్ మఱియు నెన్నెన్నో పరీక్షించితి
న్నెన్నెన్నో గోరితిఁ దత్త్వముం దెలిసికో నే నెంచి; లాభించదే
మున్నం దెల్పుము నిన్వినాగఁ బర మొండోయమ్మ! ఆమ్నాయపుం
జెన్నుల్ వట్టఁగ లేదు మాదృశులకున్ ధీశక్తి కామేశ్వరీ. 300

---

* టిప్పణి: భారతమునకు ద్రౌపదీ పరిభావమున్నూ రామాయణానికి శూర్ప
ణఖా పరిభావమున్నూ ముఖ్యహేతువు లని తాత్పర్యం.

♦ టిప్పణి శ్లో॥ శ్రుతిశ్చ భిన్నాః స్మృతయశ్చ భిన్నాః" అను శ్లోకార్థము
నెఱుఁగనగు.

మ॥ జనసం బందఁగ నేల? పుట్టి మరలం జానేల? చావుంచు నం
చనుచో, మంచిది ఉట్టి గట్టికొని యయ్యా లూఁగు నన్గొంద మే
పని సాధించుట కంద, మీసకలముం బ్రారబ్ధమాహాత్మ్య మం
చనుకో మందువా? అంతియే తుదకు సిద్ధాంతమ్ము కామేశ్వరీ. 301

మ॥ హరి యిప్డెక్కడ నున్నవాఁడు? హరుఁ డేయాధ్యక్షపీఠమ్మునం
బరిపాలించెడి! వీరు గాక మఱియాపై నీవు నున్నావుగా?
దురితాత్ముల్ చెలరేఁగ నేటికి? జగద్ద్రోహమ్ము నానాఁటికిన్
దఱచౌటేటికిఁ, దెల్పుమమ్మ? యిది యేధర్మంబొ? కామేశ్వరీ.302

శా॥ "చైనా"లోన "జపాను" సల్పెడి దురాచారమ్ము లేరాక్షసే
శానుల్ సల్పిరి, ఆపురాసురులు శిక్షాపాత్రులై వీరు స
న్మానింపం దగువారె? యిద్ది తఱియే? మౌనాన కోయమ్మ? "యే
మైనన్ సాక్షికి నే" మటం "చనెద" వంచన్గొందుఁగామేశ్వరీ303

మ॥ హిమవంతమ్మున కెంతొ పైన యఁట? ఆయీయుద్ధ; మాబాలవృ
ద్ధముగా నూళ్ళుల కూళ్ళుఁ బట్టణములున్ దగ్ధమ్ముగా నీదృశా
క్రమమున్ జూచియు నీవు సైఁచెదవె? నేరంబేమి? "చైనా" యెడన్
సమదృష్టిన్ గన కుంటి వంబ? యిది యాశ్చర్యంబు కామేశ్వరీ.304

*మ॥ కనుపట్టె న్నెపమొందు"నాఽస్తికులపైఁ గారుణ్యముం జూప,సం
చనుకొందున్, మును త్యాగరాయ లటులే అన్నాఁడు "కద్దన్నకీ
ర్తనలోనన్, "జయినా""జపాను" ననునీద్వంద్వమ్మునాఽస్తిక్యపున్
గనులే కావున నీకటాక్షు మట కేగంబోదు కామేశ్వరీ. 305

శా॥ "ఉన్నావీ" వని సంతసించుటకు నెన్నో యుక్తు లుండున్ మఱిం
కెన్నో గన్పడు "నీవు లే" వనుట, కాయీరెంటిలో వేదపుం

* టిప్పణి॥ కద్దన్నవారికి కద్దు కద్దని మొఱలిడిన పెద్దల బుద్ధులు నేఁ దబద్ధ
మౌనె" అని త్యాగరాయలు గానం చేసె నని యెఱుఁగఁ దగు.

దెన్నం బట్టిన "నుంటి" వన్నదియె సిద్ధించున్ దరింపంగ నీ
తెన్నేమంచి" దటంచుఁ బల్కుటకు సంశేహింపఁ గామేశ్వరీ. 306

*శా॥ హిందూదేశము పూర్వ మాస్తికముగానే యుండె నిప్డిప్డు డా
చంపమ్మెల్లను మార్పు చెందిన దురాచారమ్ము లెన్నెన్నియో?
సందర్భించె "వినాశకాల" మది యాసన్నంబుగాఁబోలు! ము
న్నుం దాస్తిక్యము సర్వశూన్య మనియేబోధించుఁ గామేశ్వరీ.307

మ॥ "తరణం" బం చొకఁ డుండెనేని తరణార్థం బున్నమార్గాలలో
స్మరణోపాయమె మంచి, దిందులకు నామ్నాయార్థవిజ్ఞానవి
స్ఫురణం బక్కఱ లేదు, మూర్ఖుఁడయినం బోసేయు నీతోఁ జీవ నా
మరణంబున్ జనెనేని మోక్షపదసామ్రాజ్యంబు కామేశ్వరీ. 308

మ॥ "పరసౌఖ్యంబున" కంచు సోమరుల నేవ్యాపారమో చేసి పా
మరులంబెంపొనరించుపాంతె సిరిసంపాదించు లుబ్ధుండు వెం
బరగొట్టీతెగలోన నే నొకఁడ, నీవార్ధక్యమందేని దు
ర్భర మీమోహము నన్ను వీడ దది యేపాపంబొ? కామేశ్వరీ.309

శా॥ జ్ఞానం బున్నది కాల్పనే? పనుల కజ్ఞానుండనే యేను; న
జ్ఞానుండేనియుఁ గొన్ని కార్యములలో నాకన్న సుజ్ఞాని; యీ
పైనేని న్నను జ్ఞానిఁజేసి భవముం బాలింపు మోయమ్మరో
నానేరమ్ములు లెక్కపెట్టఁ దరమా నా! నీకుఁ గామేశ్వరీ. 310

మ॥ కొడుకుల్ సోమరు లేను సోమరిని రుగ్ణ్యాక్తుండనై యుంటి ని
న్నెడఁద న్నేఁడు స్మరించుకొంద మన నాఁయీ ఘోరసంసారపున్
బెడఁదల్ "పానకమందుఁ బుల్లల"వలెన్ బీడించు నేరీతిగాఁ
గడఁతున్ సంసృతి; నీకృపాకలనచేఁ గాకున్నఁ గామేశ్వరీ. 311

---

* టిప్పణి శ్లో॥ వినాశకాలే విపరీతబుద్ధిః

శా॥ సంసారమ్మును జిక్కఁబెట్టుకొను సత్సంతానముం గన్నవి
ద్వాంసుల్ ధన్యులుగాక వార్ధకమునన్ దత్సంసృతిన్ మున్గువి
ద్వాంసుల్ ధన్యులె? తావకాంఘ్రియుగళీధ్యానానకున్ గ్రూరపున్
సంసారమ్మున కెంత యంతర మహో? చర్చింపఁ గామేశ్వరీ. 312

మ॥ ధనవంతుల్ దరియింప లోభగుణమే తా నడ్డుగా నుండు ని
ర్ధనులం దుండెడిఁగాని దాన మది వ్యర్థం, బిక్కతానన్ విత్త
ర్ణి నెవండున్ దరియింపలేఁడు భవదంఘ్రిధ్యానమే ముక్తికిన్
జనఁగాఁ జిక్కనితోవ, అయ్యది మనస్సాధ్యంబు కామేశ్వరీ. 313

మ॥ మనమన్నన్ మఱిమర్కటం బదియెటుల్ మాద్రుష్టుల్ చెప్పవో
ప్పునఁ బోవున్; దనయిచ్ఛవచ్చినగతిన్ బోవున్ ఘనుల్ యోగిరా
జ్జనులే దానిని వంపఁజాల రమనస్కత్వంబు గైకొన్నయ
మ్మును లెవ్వండిరో? నేఁడు లే రెటులొకో? మోక్షంబు? కామేశ్వరీ 314

మ॥ జననీ? నిన్ను స్మరించునట్టిపనికిన్ సంకల్పముం జేయునం
తనె చిత్త మ్మొకటికేనియుం జను నెవో తర్కించు సంసారపుం
బనులంగూర్చి; భవిష్యదంశములు సంభావించి చింతించు దీ
నిని నిశ్చింతముఁ జేయ శక్యమగునేనిం దెల్పు కామేశ్వరీ. 315

♦మ॥కొమరుల్ మువ్వురలోనఁ బెద్ద మిగులన్ గోత్తండఅవ్వాని చం
దము సర్వమ్మును దాతపోలికిని, గన్పట్టున్ బరుల్ బంధు లిం
టిమనుష్యుల్ పరులల్లవాని, కిది యెంతేఁ జిక్కగా నుండె నా
మము నీపా నలవాని నోము మనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 316

మ॥ తనకుం దోఁప దొరుల్ వచించిన వినం దా నొల్లఁ డవ్వానికిన్
జిననాఁ డొక్కసవర్ణుతోఁడఁ గలిగెన్ స్నేహంబు; వేశ్యాంగనా

---

♦టిప్పటి:—తాత పోలికిని=తాతవలె (పితామహునివలె) మాతండ్రిగారివలెనే యమాయకు డనుట, ధాతయునియు ధ్వని.

జనసాంగత్యమె దీనికన్న మెఱుఁగౌఁ జర్చింపఁగా; వాఁడు దు
ర్జనమూర్ధన్యుఁడు వీఁడమాయికుఁడెటుల్ సాధింతుఁ గామేశ్వరీ.317

మ॥ చదువున్ సందెయుఁ గొంతఁ జెప్పితిని వాచాలుండుగాఁడయ్యెఁగా
కెద ముగ్ధం బనరాదు తెల్వి గలదే యేకర్మమో? వానికిన్
గుదురున్ శుంఠలతోడ మైత్రి; వృధగాఁ గూర్చుండు నెల్లప్పు; డే
మిది" యన్నన్ బ్రితి చెప్పఁ డెట్లుడుగు నాకీచింత; కామేశ్వరీ.318

మ॥ కనెనే? నన్నయభట్టు విజ్ఞులను; దిక్కన్నెనియుం దాఁ గలా
ఖనులం గాంచినయట్లు వింటిమె? యెదో? గార్వాణ్యస్వపున్శోభ నం
దనులం గాంచుట; అంతెకాని తనవిద్యాబుద్ధులెల్లన్ స్వనం
దనులందున్ గనువారు మృగ్యులనియే నాయూహ; కామేశ్వరీ.319

శా॥ గాలింపం గనుపట్టె బాణకవి; తత్కాదంబరిన్ దండిప్రితోఁ
బోలున్ వీఁ డనునంతమంచిఫణితిన్ బూరించెఁ దత్పుత్రుఁ; డా
యీలక్ష్యంబొకఁ డేమిసేయుఁ, గవులం దెవ్వారికో? గాని యీ
శ్రీలాభంబు సుదుర్ఘటం బనుటయే సిద్ధంబు కామేశ్వరీ. 320

శా॥ నాయంత్రైనను గాకయున్న నెటులో? నాధాటియున్ గైతయున్
స్వాయత్తమ్ములుగాఁగ మధ్యముఁడు ప్రఖ్యాతుండు గాఁజొచ్చె నే
నీయూవద్భర మత్తనూజుపయినే యెట్లుంచ నుంకింతు? నె
ట్లో యుంచంబ్రయతింతుఁబూనఁగలఁడేమో?చూడుకామేశ్వరీ.321

మ॥ అవధానమ్మునయందుఁ బోలెఁ గవనమ్మందుంబలెన్ సంస్కృతిన్
దవులంబాఱు తనూజులన్ గనుకవుల్ ధన్యుల్; కవిత్వాదులం
దవధానంబు గడించుమాత్రఁ బిత్రుభారాక్రాంతి శాంతింప ద
క్కవి తా నెట్లు తపించు నిన్గుఱిచి; వక్కాణింపు కామేశ్వరీ. 322

* టిప్పణి॥ శ్లో॥ అర్థ్యం య మర్చతి గృహేగృహమేవ లోకః॥ అనే ఉత్తర
కాదంబరీశ్లోకం చూడనగు

శా॥ సూత్రప్రాయము నా ప్రవర్తనము, హెచ్చుందగ్గు లెప్పట్ల నే
మాత్రమ్ముం గడకుండు నే సభలలో మాటాడుచో వ్రాయుచో,
శత్రుల్ సైతము దీని కొప్పుదురు, నన్ సంతుష్టుఁ గావించునే?
పుత్రుం డెం తవధానియైన నగుతంబో? తల్లి! కామేశ్వరీ. 323

*మ॥ ఎవడు న్నచ్చని నాకుఁ బుత్రకుఁడు తా నేరీతి నచ్చున్ "దనూ
భవుఁ" డం చందువో? అట్టిపక్ష మది నావంశాననే లేదు, నిన్
బువులం బూజ యొనర్చినందు కెటులో పూరించి తీమాత్రపుం
గవి నేనిన్ సుతు నిచ్చి కోర్కెని; నమస్కారమ్ము కామేశ్వరీ. 324

శా॥ పాపంబో మఱి పున్నెమో నుడివెదన్ "బ్లాట్ఫార" మందెక్కి నే
నేపుంతం బడిపోదునో! మొదట నా కేకొంచెమున్ దోఁప, దె
ట్లో పోదున్ సభ నిస్తరంగజల మట్లుండున్ భవత్పాదపూ
జాపారమ్యము నాకొసంగె, నిది నాసత్త్వంబె? కామేశ్వరీ. 325

శా॥ నాకు న్నీ విడినట్టి వాక్యరచనానైపుణ్యమున్ యుక్తిసం
ధాకౌశల్యము నాతనూభవులలోనంగాని శిష్యాదులం
దే కానీ కనరావ యిప్పటికి, నే వృద్ధత్వమున్ గంటి నా
పాకం బింతటితోడఁ బోఁదగమి నాపాదింపు కామేశ్వరీ. 326

శా॥ నారీతిం జదువు న్మదాత్మజులలోనన్ మధ్యవాఁ, డెందఱో
"నారీతిం బఠియించు నేరుపరు లున్నా" రంచు నేవిందు, నే
నేరాగానఁ బఠింతు దాని కొకపేరే లే, దదే రాగమున్
జేరంబో, దట నెన్నియో? కలియు వచ్చీరాక, కామేశ్వరీ. 327

శా॥ "శ్రీరాగం" బని "కాదు కా దిదియగున్ రేగుప్తి" యంచున్ మఱే
దో! రాగంబని, యేదియో తెలియ దెంతో స్వాద్య మద్దాని కెం

* టిప్పణి॥ సీ॥ ఒరులు నచ్చని నాదుగరువంబు సడలింపఁ జాలె నెవ్వని మనీషాబలంబు॥ అనే నానారాజసందర్శనం చూడఁదగు.

తో! రాగిల్లు మనంబు పేరు సరిగా నూహింపరా దండ్రు నే
నేరాగానఁ బఠింతునో? యెఱుఁగు దీవే దానిఁ, గామేశ్వరీ॥ 328

శా॥ ఏదో; నీదయ నా కొసంగె నది, తానే రాగమో, దానిలో?
నేదో యున్నది హాయిమాత్ర, మది నన్నే కాదు విన్నట్టి యే
నాదజ్ఞానినిగూడ సంతసములోన న్ముంచు, సంగీతమా?
కా, దింకొక్కటి కాదు, వేఱొకటియుం గాదమ్మ! కామేశ్వరీ. 329

మ॥ గురుశుశ్రూషకుఁ గొన్ని నైపుణులు లోఁగున్ యుక్తిచాతుర్యను
స్వరనైపుణ్యము తేరి కేనియు జనుస్సంపాద్యముల్, పూర్వపు
ణ్యరసాపాద్యము, లింత నీ వెఱుఁగవే? నాతల్లి! నీసేవయే
స్వరమాధుర్యము నా కొసంగె నిది నాసత్త్వంబె? కామేశ్వరీ.330

మ॥ ధర లే రెందఱు గాయకోత్తములు? తత్తచ్ఛక్తు లాబాల్యమున్
గురుశుశ్రూష యొనర్చి నేర్చినవి, నాకో? లేదు శుశ్రూష "శం
కరుఁ"డం చుండెడివాఁడు, బాల్యమునఁ దద్గాత్రంబు నే వింటి, నె
వ్వరికిం దద్గళమాధురీమహిమ శ్రావ్యం బెంతో? కామేశ్వరీ॥ 331

*మ॥మఱి యింకొక్కనిగూడ నే నెఱుఁగుదున్,మద్బాల్యమం దొక్కదా
సరి శ్రీ "కృష్ణకలాప"మం దెదిరియొ? వేషం బూని నర్తించువాఁ
డరశే? తద్గళనాదమందలి సుఖం బాత్మైకవేద్యంబు నా
మరణంబున్ మఱువంగరానిది జగన్మాన్యంబుఁ గామేశ్వరీ. 332

శా॥ ఆయీ వ్యక్తులు రెండుగూఁడను స్వయంవ్యక్తమ్ములేగాని యీ
దోయిన్ శంకరుఁ డస్మదీయునకుఁ డెంతో? కొంత తంజాపురిక్
శాస్త్రియంబుం గడపెన్, మఱొక్కఁడో? పారంపర్యతఃప్రాప్తవరా
నాయీ వేసవృత్తిదక్క నెఱుఁగం డన్యంబు కామేశ్వరీ. 333

---

* టిప్పణి॥ ఈదాసరిపేరు వీరాస్వామి, ఇతఁడు జలక్రీడలలో మొదట యశోదగానూ పిమ్మట గోపికగానూ వచ్చేవాఁడు గోపికగాత్రం వినితీరాలి.

శా॥ నీ వీయన్ వలె గీతిగాని కవితానిష్ఠాపరత్వమ్ముఁ గా
నీ వేఱొక్కటిగాని, దాన సఫలం దేశాధిపత్యంపు సు
శ్రీవాల్లభ్యము గైకొనన్ వలయు, వారిన్ వీరి సేవించి వి
ద్యావంతుం డగుఁగాక రంజకతకున్ దాదవ్వు కామేశ్వరీ. 334

శా॥ అమ్మా? డెబ్బదికొండు తక్కువగు(69)ప్రాయమ్మందు నేనుంటి గొం
చె మ్మేనిన్ దనుశక్తి లే దిపుడు నాచేఁ జక్కఁగా నీవు ప
ద్యమ్ముల్ పాడఁగఁ జేయుచుంటి విని శ్రోతల్ సంతస మ్మందఁ, బు
ణ్యామో? నీదయయో? వచింపఁ దరమానా? తల్లి! కామేశ్వరీ. 335

శా॥ ఈపుణ్యానకు సంతసింపుదునొ? యిం కేనెందుకుం గా కిటుల్
కౌపీనమ్ము ధరించి యింట నెటులో కాలమ్ము వోనెట్టుచున్
గూపస్థంబగు కూర్మమున్ బలె నోరుల్ "కో"ట్టన్న భీ చెందునా
యీపాపానకుఁ జింత నొందుదునొ? యీవే చెప్పు కామేశ్వరీ. 336

శా॥ యావద్గుంటురిసీమ యేకమయి న న్నానాఁడు వంచింపఁ బోఁ
గా వేఱొక్కని సాయముం గొనక యే కాలూఁది ధైర్యమ్ము మై
నాపీటన్ బారిఁ బీఁటవెట్టుకొను టాద్యంతమ్ము సర్వమ్ము నో
దేవీ! నీవ యెఱుంగు, దెందరిగె నాధీ నేఁడు, కామేశ్వరీ. 337

*శా॥ సాకేతాధిపుతో ననెన్ ముని "అవస్థాపూజ్యతే రామ" యం
చాకాలమ్మున; నాకుజుం డదియుఁ గావ్యస్థమ్ము గావించె నీ
లోకంబెల్లను దాని వాకొనెడి నాలోచింప నాయొక్కమా
టే కావ్యార్థము సర్వముం దెలిపె నం చేనెంతుఁ గామేశ్వరీ. 338

మ॥ అలనాఁ డర్జునుఁ డట్లు దొంగలకు లోనై యూరకుండెంగదా?
బల మప్పార్థుని దేడ కేగె శివునిం బ్రార్థించి కైకొన్నన

---

* టిప్పణి॥ సాకేతాధిపుతోన్=రామునితోఁ, నాకుజుండు=వాల్మీకి. ముని=భరద్వాజుఁడు, శ్లో॥ వామలూరుశ్చ నాకుశ్చ॥ అని కోశం

త్ఫల మప్పాశుపతంపుఁజేవ యది యేపాతాళముం జేరె? ని
ష్ఫలమే సర్వ; మవస్థయే సకలమున్ సాధించుఁ గామేశ్వరీ. 339

మ॥ అవురా! "కో"ర్టనినంత భీ వడునె? వెంక, న్నందులోనన్ జయం
బవలీలన్ సమకూర్పఁగాఁ దగిన దివ్యంబైన పొత్తానకా?
శివ? యెంతక్కఁజ, మీాతఁ డెల్లపుడు నిన్ సేవించుచే భీ నిటుల్
దవులంజేసెనొ? స్త్రీస్వభావ మదియేలా తప్పుఁ గామేశ్వరీ. 340

మ॥ శివునే కొల్చెడివాఁడనేని యిటు నేఁ జేకొందునే? భీతి; "కో"
ర్టువుఁగా కయ్యది వేటొకండె యగుఁగా, కావంతయున్ జేవ లే
దవుఁగా, కింతకు స్త్రీస్వభావ మది నా కభ్యస్తమై భీ మదిన్
దవులం జేసెను "గోర్టు" కేగుటకుఁ, దథ్యం బింత కామేశ్వరీ.341

శా॥ విద్యావాదము "కోర్టు" కేగు టది సంవిత్ప్రాఢికిన్ లో టటం
చుద్యోగింప నటందునో! స్వయముగా నుద్యోగియౌ టొప్ప, ద
న్యోద్యోగ్యానకుఁ గాఁగనేగుటది తా నొప్పుంగదా? భీతికే
సద్యోఽవస్థనుబట్టి లోఁగితి, నిదే సత్యమ్ము కామేశ్వరీ. 342

మ॥ "కపటం బెందునుగూడఁగూడ" దనువెంకం డొతువుంబోలెఁ బా
లుపయోగించిన లాభమేమి? నిజ మెట్లో లోక మూహింపదే?
అపధానన్ యశమున్ గడించుటకునై యత్నించుకన్నన్ గడున్
సుపథానం గొనుదుర్యశంబె తుదకున్ శోభించుఁ గామేశ్వరీ॥ 343

శా॥ ఏరోగమ్మును లేక దేహబలమున్ పుష్టమ్ముగా నున్ననాఁ
డే రా నిమ్మెటువంటి వ్యర్థవిషయం, బే నందుకున్ మొగ్గఁగా
నేరన్, గీర్తి కళంకితం బగునె? యీానేరాన, నిందూదయ
శ్రీ రాజిల్లెడి క్షీరసాగరము నాఁ జెల్వారుఁ గామేశ్వరీ. 344

శా॥ ఈవే చెప్పుము కీర్తిఁ గోరుమనుజుం డేవ్యాజమో? పొల్పి త
న్నేవారో! అపధాన దింపుటకునై యెంతెంతొ యత్నించుచో

నావై వేగమి యుక్తమో? అరుగులే యర్థంబా? సత్కీర్తి "జ
ట్కావాలా" లోనో? చెప్పికోఁదగిన వాటాదార్లు కామేశ్వరీ. 345

మ॥ "ఎవ రెట్లుండిన నొడ్లకే" మనెడివారే కాని "భూపాలురున్
గవులున్ వీరు చరిత్రపుంబురుషులే కాఁబట్టి సత్యంబు వ్రా
యవలెన్ వీరలవ్రాయునప్పు" డనుచుం దర్కించువార్స్రుగ్యు లౌ
రవురా? నేఁటిప్రపంచనాగరిక సౌహార్దంబు కామేశ్వరీ. 346

శా॥ వ్యక్తిద్వేష మొకండు పెట్టుకొని చావన్ జేరువావేళ న
వ్యక్తుల్ వోలె జగంబునవ్వుటకునై పాలొంచు దుష్కల్పనా
సక్తిన్ "గోర్టుల" వెంట సత్కవి యశస్సంపత్తికై యేగు నా
రక్తిన్ గాంచి ముదంబు గాంచెడినె? ఆర్యశ్రేణి కామేశ్వరీ. 347

మ॥ చలపాదించుటయున్ ఋతేతరవచోజల్పాకతాస్ఫూర్తియున్
గలవా రన్నయశమ్ము దీనఁ గలుగుంగా, కంతియేకాని "వి
జ్ఞులు విద్వాంసులు శాంతిదాంతియుతులున్ సుశ్లోకు, లన్నట్టి య
ప్పలు కేనోటను రాఁడ యెందుకువృథా పంతంబు కామేశ్వరీ. 348

మ॥ నను "విద్వత్కవి" యంచు నీ వననిచో నాశక్తిఁజూపింతుఁ గో
ర్టునఁ గన్గొందువు నాప్రతాప మనుచున్ రోషించి గర్జించు నె
వ్వనికీ న్నచ్చెడిఁ, గీర్తికిట్టిపథ మేప్రాజ్ఞుండు మున్ ద్రొక్కె? ని
ప్పని యేనాఁడును మాననీయమని నే భావింపఁ గామేశ్వరీ. 349

మ॥ చదువుల్ నేరని మూర్ఖపున్జనుల పజ్జన్ జేరియే నేఁటికిన్
బ్రదుకన్ సత్యము; సర్వభూస్థలిని విద్వత్ప్రపరిచారంపుసం
పద సొంపారిన సత్యదేవత బలిత్వమ్మువల్ల భేజ్జిహ్వాయం
దొదుగంగా వలె నంచుఁ దోఁచెడిని నాకోయమ్మ కామేశ్వరీ. 350

మ॥ అతివిజ్ఞత్వము గల్గు ప్లీడరులతో నప్పప్పు భాషింతుఁ ద
చ్చతురత్వ మ్మెద కక్షజంబు గెలుపున్ సత్య మ్మసత్యమ్ము త

వ్వృతమం దున్నటులే కనంబడదు ప్రజ్ఞాప్రాభవ మ్మొక్కచో
శ్రుతమా వారివచఃప్రసంగము నెడన్ శోచ్యంబు కామేశ్వరీ. 350

మ॥ ఎవఁ డాత్మన్ గికురింప నేర్చు నలవాఁడేతప్ప వేఱొక్క స
త్కవి కాత్రోవలు నచ్చు, వట్టికవియాథార్థ్యమ్ము నవ్వారలో?
అవలీలన్ బడగెంటివైచెదరు, సత్యాసత్యనిర్ధారణ
ప్రవణుల్ "కోర్టు"కు నేగరాదనియె నే భావింతుఁ గామేశ్వరీ. 351

శా॥ ఈనీతుల్ గుఱిపించు నీ వెపుడుఁగానీ "కోర్టుబో" నెక్కవో?
ఆనాఁడాడవొ? సూనృతేతరము" లంచంబా? నను౯ దూఱఁబో
కేనుంగూడ నొకప్పు డాడితిఁజుమీ? యెన్నె నసత్యమ్ములు౯
శ్రీనాథున్ గుఱియించి, స్వార్థ మచటన్ లేదమ్మ? కామేశ్వరీ. 352

*మ॥ అదియే నాకవిపద్యముల్ పరులు "దుష్టార్థమ్ము" లంచాడ నొ
ప్పిదమా నర్థముఁ జెప్పఁ"గోరు" టది యొప్పెన్ మెచ్చె నన్నష్టకో
విదవర్గం, బది పాండితీగరిమకున్ విఖ్యాతికేకాని యె
య్యదియో! లాభముఁగోరియాడునమృతంబా? తెల్పు కామేశ్వరీ. 353

మ॥ ఇఁక నేఁ "గోర్టు"న నాడినట్టి యనృతం బేలేశమున్ లేదు "కో
ర్టు"కు నే నంతగఁ బోనె లేదు మఱి యేరో? సాక్షిగాఁ బిల్వ నే
గక యేలాగునఁ దప్పు? నేగి యచట౯ గష్టోక్తులాడంగలే
దకటా! దబ్బరలాడు జీవితము గర్హ్యాం బంబ? కామేశ్వరీ. 354

మ॥ కవినోటన్ మఱికొన్ని కల్పనలలోఁ గన్పట్టు కేలాగుఁ ద
ప్ప వసత్యంబు, లటే ప్రపంచకమునన్ వర్తించుచోఁగూడ నే

టిప్పణి॥ శ్రీనాధుని వీధినాటకపు పద్యాలు ప్రకటనార్హములుకావని గవర్న మెంటు కేసుపెట్టినప్పుడు ఆంధ్రదేశంలో సుప్రసిద్ధపండితు లందరున్నూ వాట్లను సమర్థించడానికి పూనుకోవడం వగయిరాసుప్రసిద్ధమె. ఆసందర్భంలో ఆపద్యాలలో వున్న బూతుమాటలకు వెం॥ శా॥ సదర్థమును జెప్పి కోర్టునొప్పించె నని యెఱుఁగునది.

లవమో? హేలలలోన నుండు నిపు డే లజ్జింతు నెంతేని య
య్యవివేకానకుఁగూడఁ, దెల్పితి రహస్యంబెల్లఁగామేశ్వరీ. 355

శా॥ శృంగారాది రసమ్ములం దెలఁగున ట్లైట్లని "వార్ధక్య" మన్
గంగాంభస్సునఁ దానమాడియు మదిన్ గాపట్యముంబూని "బో
నుం" గోర్టెల్లరుఁజూడ నెక్కి "అవురా? నో" రంచుఁ దత్రిత్వ్యు లా
డంగా సత్కవి నోరు జాఱ నది చూడన్ సిగ్గు కామేశ్వరీ. 356

శా॥ వచ్చె న్నాకుఁ బరీక్షకున్ సమయ; మిప్పట్ల న్ననుం జూతు వేఁ
బొచ్చెమ్మే వచియింతునో? నిజమునే "బో"నెక్కి వాకుత్రుత్తునో?
నచ్చె న్నీనుదికే; సభాధిపతియు న్నన్ గొంత ప్రశ్నించు నీ
రచ్చె న్నీవును నుండి నాదుయశమున్ రక్షింపు కామేశ్వరీ. 357

మ॥ క్రతువుల్ వేయును నొక్కసత్యమునకున్ గావంట? తుల్యమ్ము, లే
మతిమంతుం డలసత్యమందు నెదియో? మాత్సర్యముం బూని స
ద్గతిదూరుండగు? నేరికి న్వశ మగున్, ధర్మప్రచారమ్ము లు
న్నతులన్ వీడెడికాల మెల్లయెడలన్ వ్యాపించెఁగామేశ్వరీ. 358

శా॥ పాపంబుల్ తను సోఁకకుండుటకునై బ్రిహ్మాండమౌ యత్నముం
గావుం బెట్టిన వార్ధకేతరవయఃకాలమ్ములన్ సోఁకుఁటే
ప్రాపించుం, బరిణామకాలమునఁ బాపంబున్ ఘటింపించు దు
ర్వ్యాపారమ్ములకై యెగంబడుట ప్రారబ్ధంబ కామేశ్వరీ. 359

మ॥ అవసానంపుదశావశేషమునఁ "గృష్ణా? రామ? శంభో? సదా
శివ?" యంచున్ స్మరియించి ముక్తిపదని శ్రేణిం బ్రకల్పించుకో
కవివేకమ్మునఁ "గోర్టు" కేగునెడ న న్నాబాలవృద్ధంబు స
త్కవు లెగ్గాడుదు రం చెఱింగి మదిలోఁ గంపింతుఁ గామేశ్వరీ. 360

శా॥ ప్రారబ్ధంబులు రెం, డొకండు స్వక, మన్యం బన్యదీయంబు, స్వే
ఛ్ఛారూపం బిది కాదు, వేఱొకరియిచ్ఛన్ "గోర్టు"లో వాదముల్

ప్రారంభించెడి నన్ను నీ వితరవిద్వాంసుల్ క్షమింపన్ వలెన్
వేళోం దుండిన దారిఁ జూపు మని నావిజ్ఞప్తి కామేశ్వరీ. 361

మ॥ "జయమే నా కగు నిం" దటం చెఱుఁగుదున్ పష్ఠసితుండిచ్చునా
కయ మర్త్యాత్మజుఁ" డం చెఱుంగుదును విద్యావాద మీాఫక్కి క
స్వాయముంగాంచ దటం చెఱుంగుదును న్యాయంబిట్టు లుండంగ నా
భయ మారోగ్యము లేక పుట్టినది సంభావింపు కామేశ్వరీ. 362

మ॥ "శ్రవణానంద మసత్కవిత్వ"మని తత్సంచార మార్గం బ్రియ
త్నవిధానం బది యెంతయో సలిపినన్ దైవం బెటుల్ సేసె న
ట్లవునేమో? పరికృతప్రియత్నము; వృథాహంభావముం బూని న
న్నవమానింపఁ దలంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ. 363

మ॥ శివనామంబుఁ దలంచునట్టి జనులన్ శ్రీయమ్ముఁ బ్రాపించు నా
కవినాభావముగా శివస్మరణమే వ్యాపార,మద్దానసే
తెవులందుండి సుఖించుచుంటి నోరు లేదేఁ గేసు గల్పించి న
న్నవమానింపఁ దలంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ. 364

మ॥ కవినై త్వత్పదభక్తితత్పరుఁడనై కాపట్యపున్ మార్గమం
దెవరింగూడ నెదుర్చు నిచ్చ మదిలో నేమాత్రమున్ లేసధీ
రవరున్ మ్రొక్కెడివాఁడనై బ్రదుకు సర్వంబున్ సమర్థించు న
న్నవమానింపఁ దలంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ. 365

మ॥ చవి యేమాత్రము నా కసత్యరచనాచాతుర్యమం దీ వొసం
గవు, నా కిద్ది మహాప్రసాద మిదియే గట్టెక్కఁగాఁ జేయు నా
భవ మం చువ్విళు లూరుచుందు నెటు నన్ బాలించెదో? యిట్టిన
న్నవమానింపఁ దలంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ॥ 366

మ॥ "కవితామార్గమె వీఁడు నేరఁ" డనుచున్ గర్జించి యెన్నెన్నియో
యవమానోక్తులు గూర్చి నాసలుపు వ్యాఖ్యానంబు ఖండింపఁగా

నెవియున్ యుక్తులు లేక తుట్టతుద కేదే వక్రమార్గాన న
న్నవమానింపఁ దలంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ. 367

మ॥ కవన మ్మారక వెక్కిరించి పయిఁగాఁ గాండ్రించి గర్జించి న
న్నవమానింపఁగ నెంచి చేసిన విమర్శాభాసమే ముప్పునన్
దవధూమంబుగ మూత్రెఁ గల్పన లెటుల్ దాని న్నివారించు? న
న్నవమానింపఁగ నెంచినన్ శివుఁడు లేఁడా? పైని గామేశ్వరీ. 368

మ॥ అన్నృత మ్మొక్కటి విత్తుగాఁ బడి గయావాస్తవ్యమా మఱ్ఱిచె
ట్టన శాఖల్ మఱి యూడలుందొడిగి తానాకాశమున్ ముట్టుచుం
డె నదే వాదికి స్వర్గతిన్ జనెడిచో నిశ్శ్రేణి కావచ్చు నం
చనుకొందున్ సురలోక మచ్చటనెకాదా? యుండుఁ గామేశ్వరీ369

మ॥"అరు లెందో! కల"రంటతప్పు, మదినే యవ్వాండ్రిసంచార, మీ
శ్వరుఁడున్ బట్టఁగ నింటిదొంగలయెడన్ శక్తుండు గాఁ డంచు రం
తరరుల్ సైతము నేరి కేనియును వార్ధక్యమ్మునంగూడ నం
కరు, నీపాదరజోభరం బడఁచుఁ దద్గర్వంబు కామేశ్వరీ. 370

మ॥ గతమం దెట్టిఁడనైన నౌదు నది యీకాలమ్మునం దిట్టిచో
బ్రతుకన్ శక్యమె? శేషజీవితము యావత్కాలమున్ ద్వత్పద
ద్వితయాధీనముగాఁ జిదాశ్రితముగా దీవించుచో భస్మసా.
త్కృతమా నాతొలిపాప; మట్లు సలుపం గేల్మోడ్తుఁగామేశ్వరీ.371

శా॥ జ్ఞానాగ్నిన్ సకలాఘముల్ సురుఁగు టే సత్యంబు, కాకున్న గీ
తానాదం బటు మ్రోఁగునే? కవితలోఁ దత్వజ్ఞతన్ బ్రహ్మవి
జ్ఞానిం జేయవు నీకటాక్షమున నే కా కన్యథా కల్గునే?
జ్ఞానం; బయ్యది లేని జన్మము వృథా కష్టంబు కామేశ్వరీ. 372

శా॥ నిన్నో? నీపతినో! జపించుచు హిమానీపర్వతప్రాంతమం
దున్నా రిప్పుడుఁగూడ "యోగు" లని యేగో? చెప్పఁగా వింటి న్ను

త్పన్న జ్ఞానుల నట్టివారి నెలమిన్ దర్శించి మోక్షానకుం
దె న్నేర్పాటొనరించు శాంతి నిడి నన్ దీవింపు కామేశ్వరీ. 373

మ॥ ఎవరో? తిట్టిననే మసూయమెయి, నిం కేవారొ? స త్యేతర
ప్రవణత్వమ్మున నే కుకల్పనమునో?పన్నంగ నేమయ్యె, స
త్యవిదు ల్లోకమునందు లేరె? వృధగా నాతట్టుకుం బోక నీ
సవిధమ్మందున నామది న్నిలువఁగా శాసింపు కామేశ్వరీ. 374

శా॥ నాకుం దోఁచినమాట, వైహికమటన్నన్ దీర్ఘయాత్రాపరుల్
వీఁకం జేయు మకాములం దొకటియా వేయేండ్లు జీవించినన్,
లేకల్ దీనియథార్థమున్ దెలియఁగా లే కింతలో నెన్నియో?
పోకల్ వోదురు "పోకు"లం బడుదు రేపుల్ సూపి కామేశ్వరీ.375

మ॥ మది నిల్వన్వలెఁ గాని నిల్చునెడ నేమంత్రమ్ము నీలేని నె
మ్మది నీనామజపంబె యీఁగలుగు నామ్నాయాదులన్ లేశమున్
జదువంగాఁ బనిలేదు పూర్వజనిసంస్కారమ్మునంగాని నీ
పదలగ్నంబగు మానసంబు లభియింపంబోదు కామేశ్వరీ. 376

మ॥ శ్రుతిమార్గానఁ జరించు దంటుకులజున్ సుబ్బావధానిన్ జన
శ్రుతు నీ కే నెఱిఁగింపఁగావలెనె? యీశు న్నిన్నునుంగూడ న
ర్చితులం జేయు నతండు; పండితులఁ బిల్చెన్ బూజఁ గావించె న
ర్చితు నన్ జేయఁదలంచె నేగుటది నాచేఁగాదు కామేశ్వరీ. 377

మ॥ "తెలుఁగుంబీర" మటంచు నిల్పి యచటన్ దేవుం బ్రతిష్ఠించి ని
చ్చలుఁ బూజించుచు నేఁటికేఁటి కొక యుచ్చైఃప్రజ్ఞ నూతార్లచే
నలరన్ జేయు నతండు; ప్రస్తుతము న న్నర్చింప రాఁగోరె భీ
తిలు నాచంద మెఱుంగఁ డయ్యనఘుఁ డో దేవేశి! కామేశ్వరీ.378

మ॥ "మదరా" స్పట్టణ మేగఁగావలయు నమ్మా "రాజమండ్రి"కి నే
"గిద" నన్నన్ దగుచేవ లేద యెటులో గేహమ్మున న్నిదయా

స్పదమా జీవితశేషము న్నిను మదిన్ ధ్యానించుచు న్నెట్టునా
కెదియుక్ వల్వదు పేర్మిచూపు మిటులే యెల్లప్డు కామేశ్వరీ. 379

మ॥ "నవమీపూజ యెటుల్ ఘటించు" ననుచు న్నాతల్లి! చింతిల్లితిన్
గవనాన న్నిను వేడితిన్ సుఖముగా గట్టెక్కె "మద్రాసు" గా,
రవముం "బొంద ననుగ్రహింపు" మని కోరన్ సాహసింప న్నినున్
నవుఁబా టందక కాల మేగు టొకటే నాకోర్కె కామేశ్వరీ॥ 380

మ॥ కవినై పొందెడి గౌరవమ్ము లెవియో కైకొంటి నింకిప్డు గౌ
రవముల్ పొందఁగ దూర మేగఁదగు దార్ఢ్య మ్మున్నటు ల్లేదు నీ
సవిధమ్మం దెవియో యొకానొకపనిన్ సాధింపఁగా నెంతు నా
కవినాభావముగా భవత్స్మరణమే యాచింతుఁ గామేశ్వరీ॥ 381

మ "మదరా" సీగఁగ లేని నేను హిమవత్క్ష్మామండలారణ్యమం
దెవ నిన్నున్ జపియించువారిఁ గనఁగా నెట్లేగఁగా నేర్తు, నా
కది సిద్ధింపదు, శేషజీవితము నీయంఘ్రిద్వయీ సేవనా,
స్పదమున్ జేయుము చాలు దీనసె తరింప న్నేర్తుఁ గామేశ్వరీ॥382

శా॥ "ఏదో భావికి మంచి నిచ్చుకొఱకే యీవార్ధకమ్మందు న
న్నీదీక్షామయ మాశ్రయించిన" దటం చే నెంతు, నార్తుండనై
పాదాంభోజము నాశ్రయించినను సౌభాగ్యానకున్ హేతు వౌఁ
గాదే? నీదయ యిందు నందు శుభముల్ గల్పించుఁ గామేశ్వరీ॥383

శా॥ కోఁతింబోలెఁ జలించు మానసముతోఁ గొండొక్క నీధ్యానమున్
జేతున్ బాల్యమునుండి నేఁ; నదియు సుశ్రీఁ గూర్చి నన్ గొంత ప్ర
ఖ్యాతుం జేసిన, దింక నిశ్చలమనోవ్యాపారు లెంతెంత ప్ర
ఖ్యాతిం బొందెదరో? వచింపఁ దరమా నా? తల్లి! కామేశ్వరీ. 384

శా॥ నాకున్ గోరికలెల్లఁ దీరె, నిఁక నిన్ దర్శించి నీసన్నిధిన్
మూకాదుల్ బలె నుండుకోర్కె యొకటే మున్ దెల్పితిన్ దానికే

వీఁకన్ జో టొనరింపు మీసుమెయి నన్ వేధించు దుశ్శాత్రివా
నీకం బంతరరిప్రకాండమును శాంతిన్ జెందుఁ గామేశ్వరీ. 385

మ॥ జననీ! షష్టికి లోపునన్ విజయలిప్సన్ గొంత యత్నించినన్
దనువున్ వీడఁదలంచు వార్ధకమునన్ దద్యత్నముల్ శోచ్యముల్
మనమం దిట్లు తలంచు నన్ను నరినిర్మాద వాక్యమ్ము లీ
సునకున్ దాసు నొనర్చఁ బట్టితి ధనుస్సుం గేలఁ గామేశ్వరీ. 386

మ॥ ఇది యేమంబరో? యెరిపై కరుగ నే నేనాఁడు, నాపైకి దూఁ
కెద రెవ్వారలొ? వాడులాచుఁ, దుద కగ్గిం దూఁకినట్లె వృథా
చెదిరింపన్ దొరఁకొందురి వ్యాజపుఁబనుల్ వెంపం బ్రయత్నింతు రీ
యెద నీచిక్కుల కర్త మెట్టు లగు నంబా? తెల్పు కామేశ్వరీ. 387

మ॥ బిరుదుల్ దోఁచిన వేను బెట్టికొనియే పే రందితింగాని యె
వ్వారి నర్థింపఁగ లేదు వచ్చె నిపు డీవార్ధక్యమందున్ గళా
పరిపూర్ణుం డనునట్టి మేల్బిరుద; మీ భారమ్ము మోయంగ నా
తరమే? లే దిది దాల్చునంతటి సమర్థత్వంబు కామేశ్వరీ. 388

మ॥ ఒకలోటున్ గనుపట్టకుండుగతి న న్నో తల్లి! కాపాడి వా
ర్ధకభారమ్ము వహింపఁజేసితివి తత్త్వజ్ఞాన సామ్రాజ్యశా
లికపీంద్రుం బొనరించి పోవిపుము భవల్లీలల్ సదా పాడికొం
చిఁక నాజన్మము ధన్యమున్ సలుపుకొం చే నుండుఁ గామేశ్వరీ. 389

మ॥ ఇలు వీడంగల చేవ లేదు "మదరా" సీనాకు సన్మానమున్
సలుపం బిల్చెడి "రా" నటన్న విన దీశానీ! యి దే "లంఘన
మ్ములలో మన్గడు" పందు నందుకై జగంబుం బ్రోత్సహిం తిట్లు; నా
వలనన్ దార్ఢ్యములేమి నీవెఱిఁగి యుం బా? తెల్పు కామేశ్వరీ. 390

మ॥ ఎవరు న్నమ్మెడి వ్యాధి కాద యిది నా కే కాని బోధింప ద
ట్లవుటం బిల్తురు నన్ను రెంతగను నే వ్యాఖ్యానముం జేసినన్

భవదీయంబు దయావిశేష మిటు మద్వార్ధక్యమున్ సర్వథా
స్తవనీయమ్ముగఁ జేసినందుకు నమస్కారమ్ము కామేశ్వరీ॥ 391

శా॥ గుంటూ ర్నన్ను నుపన్యసించుటకునై కోర్కుల్ పిసాళింప ర
మ్మంటల్ నీవు నెఱింగినట్టివియె అంబా? నే నుపన్యాస మే
వెంటన్ జేయఁగ నేర్తు నిండుసభలో; వృద్ధత్వముల్ రోగమున్
గెంట న్నాతరమే? గళస్వరము తగ్గెం గొంత కామేశ్వరీ. 392

*మ॥ ఎలమిన్ మొన్నను మండపేటపుర మాయీనాకు సన్మానమున్
సలుపం గూర్చిన యాసభాస్థలి విశేషం బెల్ల వీక్షించి తో
లలితాంబా? సమయాన కే నను రుజాలానాన బంధించి నా
గళమున్ గట్టఁ దలంచి తేమిటికి? వక్కాణింపు కామేశ్వరీ. 393

శా॥ అంబా? నాకుఁ గళాపరిపూర్ణ బిరుదం బార్జించి యద్దాని నా
లంబింపన్ సభ కేగుశక్తి నిడ వీలాగైన చో "సీకృపా
లంబం బున్న దటంచుఁ జెప్పికొను టేలాగమ్మ? యెట్లెట్లో జీ
వం బున్నన్ ఫలమేమి? అయ్యది వృథాభారమ్ము కామేశ్వరీ.394

శా॥ జీవం బుండిన యన్నినాళ్ళు నిను నర్చింపన్ భజింపన్ బొరిన్
భావింపన్ సఫలం దొరకించుక యుపన్యాసంబు గావింప నో
దేవీ? దార్ఢ్య మొసంగుమమ్మ?అటు కాదేని న్నను న్నమ్మ "కే
దో?వంకంగొని యింట నుండె"ననుకొండ్రో యమ్మ?కామేశ్వరీ.395

మ॥ ఎటులో నిన్ను స్మరించి కొంచు గృహమందే యుండఁగాఁ దగ్గ ది
దిప్పటినాపై ఖగి; దేశముల్ దిరుగు దర్పం బున్న దే? సిదుసం
ఘటనల్ చిత్రము; లేనిశక్తి నెటులో? కల్పించి "ప్లాట్ఫారు" మె
క్కుట కేర్పాటొనరింతు వైహికవిరక్తు న్నన్నుఁ గామేశ్వరీ॥ 396

శా॥ రాగిం గాను విరాగి గాను నిను నారాధించు దూరోగి న
న్నేగో డందక యుండఁ బ్రోచుటకు నీదే భార మోతల్లిరో?

*టిప్పణి॥ రుజాలానాన్—రోగమనెడి గజబంధనపుఁ గట్టుకట్టుయందు

నాగార్యాఖ్యపుభావిశోభ త్వదధీనం బెట్లు కాపాడెదో?
ధీగంభీరులు గారు కుఱ్ఱ లుర కుద్రేకింతు? కామేశ్వరీ. 397

మ॥ జననీ! పూర్వపుసంస్కృతుల్ ప్రకృతసంసారాభముల్ గావు త
ద్ఘనులం బోలరు వీండ్రు దుర్వ్యయములన్ గావింతు రీనాఁటినూ
తనవహా నాగరికప్రచారమునఁ దత్పంతానముల్ మున్గి యెం
దునకుం బొందక యెట్టెటో చెడెడిఁ గన్గోవమ్మ? కామేశ్వరీ. 398

మ॥ గతకాలంపు మహీసురోత్తముల మ్రొక్కుం జెల్లు నవ్యారిజీ
వితమే జీవిత మెంతో బీదలయి యున్ బృథ్వీమహేంద్రుల్ పదా
నతులై వర్తిలఁ గాలముం గడపి రీనాఁ డిట్లు నిర్వీర్యమై
పతితంబయ్యెడి బ్రహ్మజాతి; యిది యేపాపంబో? కామేశ్వరీ. 399

మ॥ చదువుల్ విస్తరికుట్లు జంతెపుఁబనుల్ చాపల్ మఱిన్ దోడ్లలోఁ
బొదలుం గూరలు గాఁగ వర్తిలిరి తద్భూమీసురుల్ నేఁటిసం
పద "మోటారులు" మేడ లోడలునుగా మాఱెంగదా? వీరికు
న్నదె? అవ్వారలతృప్తి వారిసుఖ మానందంబుఁ గామేశ్వరీ. 400

మ॥ "షుగరున్" దోసముతోఁడ బుట్టునిసువుల్ శుద్ధాలసుల్ శుంఠతా
ధిగతుల్ మ్లేచ్ఛసదృక్షు లిప్పటిద్విజుల్; దీనత్వమున్ దోలు తు
ష్టి గలారప్పటివారు పై మెఱుఁగులున్ డొక్కల్ మఱి న్నిక్కులు
"న్నగుఁబా"టంచుఁ ద్యజించు దూరముగవిజ్ఞశ్రేణి కామేశ్వరీ. 401

మ॥ తినిరో? పస్తు పరుండిరో? మును ద్విజుల్ దేవార్చనల్ మానిన
ట్లును నాచారము లుజ్జగించి చెడినట్లున్ లేదు నేఁడో? పొరిన్
దినుటొక్కం డగుపట్టు నింకెదియు లేనేలేదు బ్రాహ్మణ్య మిం
కను నున్నట్టులె చెప్పికోవలెనె? వక్కాణింపు కామేశ్వరీ. 402

మ॥ "చన లే నే మదరా" సటన్న జననీ సాధించి "మద్రాసుకున్
జన్ను" మ్రాఁగచున్ దయి లెక్కఁ జేసితిరి నీసంకల్ప మేలాటిదో?

చనఁగా మాసఁగ మాసవుం డెవఁడు నీసంకల్పసూత్రింబ స
ర్వ నియంతృత్వము పూని సర్వమును సంపాదించుఁ గామేశ్వరీ. 403

మ॥ మొగమోటమ్మధికమ్ము నాకు నదియున్మాలింపఁగా లేక నేఁ
దగుదుంబో? యని యేగుచుందును సభార్థం; బంబరో? దీని బం
దుగులున్ ద్వేష్యులు నన్యథా అపలపింతుర్కొందఱో "లోభి" యం
చగ తాళిన్ బొనరింత్రు నిక్క మది నీకే గుర్తు కామేశ్వరీ. 404

శా॥ "చుట్టాలింటికి రాఁడుపో? సభలకెచ్చో నైననుఁ బోవు" నన్
రట్టున్ అవ్వయు నీవ నాకు జననీ? రప్పించి తే నిందుకే
పుట్టంబోలును అన్వకేమి? యిటులే పోనిమ్ము నాజీవితం
బెట్టో? దాని భరింతు సత్సభలె నాకిష్టంబు కామేశ్వరీ. 405

శా॥ "మొట్టో? రాఁగలశక్తిలే" దనిన నామొట్టాలకింపంగఁ బో
ర్నొట్టం బట్టినవాని కున్నవెలయున్ వెంకన్న కిప్పట్ల లే
దట్టుంకించి గ్రహించి గెంటెడి విధం బా నేమిచిత్రింబో? నేఁ
గుట్టుండున్ బలె నూరకుందు మది నీకున్ జంకి; కామేశ్వరీ. 406

*మ॥ చనుచున్నాఁడ సపుత్రికమ్ము గను సచ్ఛాత్రముగా మాట ద
క్కునటుల్ సేయఁగదమ్మ? రెడ్డికిని నాకు న్నీకుఁ ద్వద్భక్తురాల్
కనకాంబామణి కల్లసుబ్బనకు; సత్కార్యంబు శోభింపఁజే
సిన నీపుణ్య మగణ్యమై మిగుల వాసిం గాంచుఁ గామేశ్వరీ. 407

మ॥ ఋతుకాలం బరుదేర నుంద విడి గో వేగన్ శివమ్మెక్కె; స
త్కృతికాలం బరుదేర వెంకనయు నక్లే పోవు నిల్వోడి తా
నితికర్తవ్యము చర్చ సేయ? కిటులే యీజాతక మ్మెప్పుడున్
బ్రతుకంగా లిఖయించఁబోలుఁదొలినా బ్రహ్మాయ్య; కామేశ్వరీ. 408

---

టిప్పణి॥ రెడ్డి—చుండూరు వెంకటరెడ్డి అనే వైశ్యుఁడు. సుబ్బన—దంటు
సుబ్బావధాని—బ్రహ్మయ్య—గురువైన బ్రహ్మయ్యశాస్త్రి అనిభావని.

మ॥ జననీ? యిప్పటి నాకధన్ గనిన విస్పష్టమ్ముగాఁ దేలు "జీ
వునకున్ లేదు స్వతంత్రశక్తి"యని; అబ్ధుల్ దాఁటు మిన్ పాకు దూ
రును బాతాళము దుఃఖియౌ సుఖియునౌ రోషించు ఘోషించు ని
ల్చును గూర్చుండు నిదెల్లఁగర్మవశమౌచున్ దోఁచుఁగామేశ్వరీ. 409

•మ॥ "గదిగా నుండిన నన్ను వెంటఁగొని చక్కన్ "జెన్నపూ" ర్వచ్చితె
య్యదిగావించెదొ?!" యంచు నే మొదట నుయ్యాలూగితింగానిమొ
క్కొద నోతల్లి! కిరీటిఁ జేసితివి శ్రీకృష్ణుండ నిప్పైతి నీ
దుద యెవ్వా దేకము మేరమీఱె"నని సంతోషింతుఁగామేశ్వరీ. 410

*మ॥ "జననీ! సాంబునిమూర్తియే యితఁడు నిస్సందేహ" మంచున్ జగ
జ్జనముల్ చెప్పికొనంగఁ జాలిన యశశ్శ్యాలిన్ బురోధఃకృతి
స్థనిగాఁ జేసి కిరీటమున్ శిరమునందు న్నిల్పఁగా జేసి ధ
న్యుని గావించితి వద్దు దాఁట దతఁ డెందు న్నీకుఁ గామేశ్వరీ. 411

మ॥ పరతంత్రుండగు సాంబమూర్తి నను సంభావించెఁ బట్టాభిషే
కరమాభాస్వరుఁగా నొనర్చి; కవితాఖండైక సామ్రాజ్య మే
భరియింపంగలనే? మదాప్తసఖుఁ దిర్పన్నన్ వెలింజేసి యొం
టరిగా నిల్పియు నింత సేయుదు రె? అన్యాయమ్ము కామేశ్వరీ. 412

• టిప్పణి॥ గది—రోగి (గదః రోగః అస్యాఽస్తి) గదగలవాఁడని అర్థాంతరం. గదిగా నుండిన నన్నున్—గదియే నేను నేనే గది యన్న రీతిగా నున్ననన్ను అనఁగా పడకగదితప్ప వీధిముఖంకూడా చూడనినన్ను. అని తాత్పర్యం. కిరీటిన్—కిరీటముకలవాణ్ణి, నాటిసభలో పుష్పకిరీటంతో సమ్మానించిరని తాత్పర్యము గదకలవాఁడున్నూ, కిరీటం కలవాఁడున్నూ శ్రీకృష్ణుఁడు ("కిరీటినం గదినం" అని భగవద్గీత చూ॥)

* టిప్పణి॥ సాంబునిమూర్తి—సాంబమూర్తి. శ్రీబులుసు సాంబమూర్తిగారు సభాధ్యక్షుఁడై ఆపుష్పకిరీటము నలంకరించిరనుట, నాల్గవచరణంలో దేవీభాగవత సంప్రదాయరీత్యా సమన్వయించుకోవాలి—శివుఁడు శక్త్యధీనుఁడని ఆశయము—

టిప్పణి॥ పరతంత్రుఁడు—గవర్నమెంటు మంత్రి, అని పరిష్కృతార్థం, శక్తిపరతంత్రుఁడని శివునిపక్షం,

*శా॥ సాంబుం డెవ్వఁడు? రామదా, సతఁడెవో?సాంబుండు, వీరిర్వురో
యంచా? నీదయకల్మి నాయెడల సత్యంతానురక్తుల్ నితాం
తంబున్ బూజ్యులు నాకుఁ, బూజకులుగా దైవాళి రెంతెంత కా
ర్యంబేనిన్ ఘటియించు నీదుకృప సత్యం బింత కామేశ్వరీ. 413

♦మ॥ సుతుఁడై యుండఁదలంచి వెంకన తపస్సుం జేసియున్నాఁడు, త
త్కుతుకం బింతియు, తోడఁబుట్టుటకు సంకోచించు నేమన్నఁ ద
న్మతికిన్ దద్గదశబ్ద మెట్టులయినన్ గల్పించుఁ బో? భీతి; పు
త్రితకే అర్హుఁడు వీఁడు; తత్పదవినే స్థాపించుఁ గామేశ్వరీ. 414

□శా॥ తోఁడం బుట్టినవానికన్నఁ దనపుత్రున్ వేయిరెట్లెచ్చు గా
పాడున్ దల్లి! యటంచు నే నెఱిఁగియే భ్రాతృత్వ మార్జించియున్
వీడంగా వలసెన్, నిరాదరణగా వీక్షింప కోయమ్మ? నీ
వాఁడన్ జెప్పెడిదేమి? నీయదియ నాభారమ్ము కామేశ్వరీ. 415

---

* టిప్పణి॥ రామదాసు—రామునికి భటుఁడు, ఆంజనేయులు శివావతారము గాన సమన్వయ మగును. అతఁడెవో—ఆ ఆంజనేయులే, సాంబుండు—శివుఁడు, పూర్వోక్తరీత్యా యిద్దఱికీ అభేద మనుట, వారిద్దఱును దేవతలలోనివారే కనక నేను పూజించఁదగ్గఁవారు. ప్రస్తుతసభలలో నన్ను పూజించుచున్నారు. ఇదంతా నీయనుగ్రహ మాహాత్మ్యముగాని నాశక్తి కాదనుట. ఒకనాఁటిసభకు బులుసువారున్నూ వేఱొకనాఁటిసభకు వేమవరపువారున్ను అధ్యక్షులయి గౌరవించిరని ముఖ్యతాత్పర్యం,

•టిప్పణి॥పరశక్తి నారాయణ సహోదరి యనువిషయము స్మరణకుఁ దెచ్చుకొని గదశబ్దములో రోగార్థకత్వ మున్నదని గ్రహించుకుంటే యీపద్యార్థం సుగమం, కేవలకిరీటిత్వం మాత్రం వుంటే శ్రీకృష్ణుఁడు కావడం లభించదనిన్నీ దానికి గదిత్వం తోడు కావలసివస్తుం దనిన్నీ అందులో రోగం స్ఫురించడంచేత నాకు భయమనిన్నీ తాత్పర్యం.

□టిప్పణి॥ కిరీటధారణద్వారా శ్రీకృష్ణత్వం సిద్ధిస్తే భ్రాతృత్వం సిద్ధించినట్లయింది కనుక దాన్ని యెట్లో సంపాదించుకొనిన్నీ పైకారణముచేత వదలుకొన్నందుకు అన్యథా తలఁపవద్దని అభ్యర్థించినట్లు పద్యార్థం సమన్వయించుకోవలెను.

మ॥ పలుమాటల్ పలుకంగ నేల? యెటులో పచ్చప్ప కాలేజిలో
పలుగూడన్ బురవాసులన్ దుది కెవో పద్యాలచే వార్ధక
స్థలనాదుల్ పొడకట్టకుండ దయతో సంతుష్టులంజేసి య
ర్మిలి చూపించితి నిన్నుతింపఁగఁదరమ్మే? నాకుఁ గామేశ్వరీ. 416

శా॥ తాఁ "గాలేజిని" నొజ్జయై కవనవిద్యన్ సర్వధా ప్రాజ్ఞయై
యోగంబందుఁ బ్రవిష్టయై సతత ముద్యోగించు వేదాంత వి
ద్యాగోష్ఠిన్ జననంబు సార్థకతకున్ దాసై ప్రకాశింప నీ
ధీగణ్యన్ గనకాంబ నెన్నవలదే? స్త్రీలందుఁ గామేశ్వరీ. 417

మ॥ ధన మార్జించుప్రసక్తి లేశమును నీ తత్త్వజ్ఞకున్ లేక యుం
డిన విద్వత్తను గారవించుటయు సల్లె వేంకటాదిప్రభు పూ
జను నెగ్గించుట రెండుకార్యములు తా సాధింపఁగా నెంచి స్త్రీ
జనవిద్యాలయమందు నొజ్జతిక మాసాదించెఁ గామేశ్వరీ. 418

మ॥ మునుపుండెన్ దరికొండ వెంకమ * బుధామోదంబుగా వేంకటే
శుని బూజించి కవిత్వమెల్లఁ గడు సుశ్లోకంబుగా వేంకటే
శుని కర్పించి పర మ్మిహ మ్ముభయమున్ శోభింపఁగాఁ జేయ నే
ర్చిన యిల్లా, లిప్పు డీపె కన్యడియె నారీకోటిఁ గామేశ్వరీ. 419

మ॥ ఒక స్వామ్యర్చనమాత్రిఁ దృప్తిపడ కీ యోషాశిరోభూష గొ
ప్ప కవీశానుల విద్వదీశ్వరుల సంభావించి నూటార్లచే
సకలాంధ్రావనికిన్ యశమ్మొనఁగెడిన్ సామాన్యమా? యీ మహో
పకృతి న్నీవును మెత్తువంచు మదిలో భావింతుఁ గామేశ్వరీ. 420

మ॥ పయనంబన్న భయంబుఁ జెందు నను సౌభాగ్యంబు మజ్జాతికా
శ్రియ మేదో తరువాయి యున్నదని "మద్రా" సేగఁగాఁజేసి యు

* టిప్పణి: వెంకమ్మగారికి కనకమ్మగారి అమ్మమ్మతల్లి శిష్యురాలు కూడాను.

చ్ఛ్రియయోగంబును సంఘటించి పిదపన్ ప్రైలెక్కుచున్నాడితేలో
దయనీయంపుటవస్థ గూర్చు టిది యే ధర్మంబు? కామేశ్వరీ. 421

మ॥ కలలో నేనియు దర్శనం బిడుమసంగా నేడు నెల్లూర ని
మ్ములఁ బ్రత్యక్షపు దర్శనమ్మొ దొరకెన్ బుణ్యమ్ము గిం గంటి స్వా
ములు చిదూ్రిపులు కామకోటిగురు లీ పూర్వండసమ్మందు భా
సిలుచున్నా "ర్వైదకంగఁ బోవులతో" లై శ్రీదేవి! కామేశ్వరీ. 422

శా॥ సామీప్యమ్మునఁ గూరుచుండు మని హస్తంబెత్తి నన్ గూర్చి చల్
పేర్మింజూపిరి స్వామివా రది భవత్ప్రేమంబుగా నెంతు నీ
నామంబున్ స్మరియించువారలకు విఘ్నాణంబులోనైన సు
క్షేమంబుల్ సమకూరునంచుఁ దుదకున్ సిద్ధంబు కామేశ్వరీ. 423

శా॥ అంబా! కాంచిపురాధిదేవతవు నీ, వా పీఠమో? నిన్ను ని
త్యంబుం బూజలొనర్ప నేర్పడిన దే నాయీ నిన్ భక్తి భా
వం బొప్పన్ భజియించుచుంటి నిచటం బ్రత్యక్షమై తింక ధ
న్యంబయ్యెన్ భవ మింత కెక్కుడగు భాగ్యం బేది? కామేశ్వరీ.

శా॥ మాయూరే దయచేతుమం చొకట శ్రీమత్స్వామివా ర్వా స్తి శ్రీ
ప్యాయత్తమ్ముగ నంపియుండి రది భాగ్యంబంచు నే నెంచ న
ట్లా యార్యుల్ దయచేయ రిప్పు డెటులో అబ్బెన్ భవద్దర్శనం
బోయమ్మా! కృతకృత్యమయ్యె భవమం చూహింతుఁ గామేశ్వరీ.

మ॥ జననీ! నిత్యము నిష్ఠతోడ నినుఁ బూజన్ దన్పు సన్మౌనిప
ర్యాని దర్శించి యనుగ్రహింపఁబడితిన్ రోగమ్ము బాదవ్వగాఁ
జన కింకేగతి నన్ను వేపఁగలుగున్ జన్మాంతరమ్మందుఁ జే
సినపుణ్యంబు ఫలించె నిక్క మిది తచ్చిహ్నంబు కామేశ్వరీ. 425

మ॥ కలికాలం బగుఁగాక నిన్నెఱిఁగి చక్కం బూజగావించువా
రల కింపుగ మఱియెందు నే సిలుగులుగ రాఁబోవు ప్రారబ్ధముల్
గలిమి న్నెట్టఁగవచ్చు నీదుకృపకుం బాత్రత్వ మార్జించి; యే
కలుష మ్మంటదు నీదు భక్తులకు నిక్కం బింత కామేశ్వరీ. 426

శా॥ కాంచీపట్టణ మేఁగి త్వత్పదయుగీకంజాతముల్ మ్రొక్కి సే
వించంగాఁ దగుపాటి దార్ఢ్య మది దేవీ! నాకు లేదంచు నీ
వెంచంబోలు నతర్కితోపనతమై యీపీట నీసేవ లా
భించం గారణ మేమి లేకునికి నీవే చెప్పు కామేశ్వరీ. 427

మ॥ ఇలువేల్పంచు భజింతునో? మఱియు నిన్నీ రేడులోకాలకుఁ
దలవేల్పంచు భజింతునో? యెవరు నీ తత్త్వమ్ము బోధించువా
రలు నాకో జగదంబ? నీవ యెపుడో బ్రహ్మజ్ఞఁ గావింపఁగా
వలె నేకాన్న నిటు భజించెదను లోపం బేమి? కామేశ్వరీ. 428

మ॥ తనయస్త్రం బఖిలమ్ము సార్థకముగాఁ ద్వత్పాదపద్మార్చనా
వినియుక్తాత్మవివేకు నిమ్మునిని సేవింపంగ నా కబ్బె నో
జననీ! యెంతటిపుణ్యమో! యిదియుఁ దా సామాన్యమే? రుగ్ణుఁడౌ
మనుజుం డేగతిఁ దీర్థయాత్ర లొనరింప న్నేర్చుఁ గామేశ్వరీ. 429

మా॥ *స్వార్థదర్పంబు తృణీకరించి భవదర్చుక దీక్ష నార్జించి శా
స్త్రా రహస్యమ్ము లెఱింగి జ్ఞానమున సాక్షాచ్ఛంకరుండో యనం
జెలుప్రాయమ్మునుండి మోక్షపదనిశ్రేణీవిధానమ్మునం
దెలియు యోగిని గంటి నీచరణసాన్నిధ్యానఁ గామేశ్వరీ. 430

---

* టిప్పణి: శ్లో॥ "నమోనమః కామకోటి మహాపీఠాధివాసినే
స్వామినే వేదవేదాంతసారసర్వస్వగామినే."

ఇది శ్రీ స్వామివారికి నమస్కరించునప్పుడు చెప్పినది.

మ॥ జనయిత్రీ ! నిను సర్వమంగళను విశ్వఖ్యాతచారిత్రి భా
గ్యనిధి న్నమ్మినవాఁడ నై సుళువుగా గట్టెక్కఁగాఁ జేయు మెం
దును లోపం బగుపట్టకుండుగతి సంతోషమ్ముతో జీవితం
బును నెట్టింపుము నాదుదోసములు నిర్మూలించి కామేశ్వరీ. 431

మ॥ నినుఁ గాంచీపురపీఠదేవతను గంటిన్ వంటు సుబ్బావధా
ని ననున్ శ్రీకనకాంబసత్కృతికి నై నేమించి రప్పించుటన్
గనకాంబాకవయిత్రి నిత్యముఁ ద్రిలింగశ్రీమహాపీఠవ
ర్ధనియై శ్రద్ధమెయిం బొనర్చెడి సపర్యం గంటిఁ గామేశ్వరీ. 432

మ॥ *అమృతానందగురుండు నల్పు నుపదేశాభిఖ్యపీయూష ము
త్తమురాలా కనకాంబ సుబ్బనయు విత్తస్వామియున్ రెడ్డి స
త్తముఁడుం గోరి తదర్థ మర్త్యులకు నందంజేయఁ ద్రైలింగపీ
ఠమునం జేయు ప్రయత్న మిప్పటికిఁ జూడం గంటి గామేశ్వరీ. 433

మ॥ తనసౌధమ్మున బీఠమున్నిలిపి నిత్యం బేడుసారుల్ కృపా
ఖని శ్రీవేంకటనాథు సర్చితునిగాఁ గావించుచున్ శ్రీగిరిం
ద్రినివాసిన్ స్మరియింపఁజేసెడి కృతార్థజ్ఞాన సత్కావ్య వ
ర్ధని శ్రీమత్కనకాంబభక్తి మిగులన్ ధన్యంబు కామేశ్వరీ. 434

మ॥ గురువాక్యంబుల సారమున్ సకలమున్ గ్రోడీకరించెన్ గవి
త్వరసం బొండొక తోడుచేసి; భగవద్గానమ్ముతో విద్యాదా
దరముంబూని యొనర్చు సత్కృతులతో సంభానపేతమ్ముగా
జరుపున్ మా కనకాంబ జీవితము మెచ్చం జెల్లుఁ గామేశ్వరీ. 435

---

* టిప్పణి: ఈ పద్యంలో వున్న వ్యక్తులందరికీ జ్ఞానోపదేష్ట అమృతానంద స్వామి. త్రిలింగపీఠస్థాపకులు గూడ ఈయనయే.

శా॥ తాతా శాస్త్రియు, దెందుకూరికృతి విద్వాన్మౌళి శ్రీపాదవి
ఖ్యాతశ్రీనరసింహశాస్త్రి, మఱియున్ గవ్యగ్రణుల్ పేరవి
ఖ్యాతిన్ దెల్పుదు రీబుధోత్తముల నాకారించి నూజార్లచే
నీతస్వీమణి గారవించె వినియుంటే? తల్లి! కామేశ్వరీ. 436

మ॥ పలువు ర్పండితు లేగుదెంచి కనకాంబా సౌధరాజమ్మునం
దలి శ్రీవేంకటనాథుసన్నిధిని శాస్త్రంబుల్ ప్రసంగించున
య్యేలమిన్ గాంచిన "గద్దవాల" పురసాదృశ్యంబు నానెమ్మదిన్
గలయంబ్రాఁకి స్ఫురించె నింతకును భాగ్యంబేమి? కామేశ్వరీ 437

*మ॥ కలలెల్లన్ గలలౌట దర్శశశి నాఁగా నున్న యీదేశమం
దలి విజ్ఞానము భావికాలమున నాధారమ్ము చేకూరుచో
వెలయన్ విత్తనముల్ లభింపవని తద్బీజమ్ముల న్నిల్ప నీ
తెలుఁగున్బీరము యత్నమున్ సలిపెడిన్ దీవింపు కామేశ్వరీ. 438

మ॥ కవితల్ సెప్పెడి స్త్రీలు మున్ గలర,యక్కాంతల్ కవిత్వమ్మునన్
స్వవివేకమ్మును జూపి, రీకనకమాపాండిత్య మల్లంతఁ బో
క విశేషించి విచక్షణత్వమునకున్ గాణాచియై విశ్వమా
నవకళ్యాణము గోరి వర్తిలెడి ధన్యంబౌచుఁ గామేశ్వరీ. 439

శా॥ యావజ్జీవము విద్వదాదృతికి శ్రీహర్యంఘ్రిపద్మార్చకున్
దావై యీకనకాంబసౌధము ప్రసిద్ధం బౌత" మంచే నిదే
దీవింతున్ జననీ? "తథా" స్తనుము నాదీవించుటల్ సార్థక
శ్రీ వాటించెడి, నింతమాత్ర మిడుమీ!చేయూఁతకామేశ్వరీ. 440

మ॥ కనకాంబార్పితమా బహూకృతికి స్వీకర్తృత్వమున్ "గామకో
టిని దర్శించుట, పిమ్మటన్ "విజయవాటిన్" నీదు మేలోప్రిలియం
దున నెన్నో దినముల్ వసించుటయు, వృద్ధుండైన నా కబ్బఁజే
సె ను శ్రీదంటుకులుండు సుబ్బన మదాశీఃకామి గామేశ్వరీ. 441

* టిప్పణి: కలలు=విద్యలు, లేదా చతుష్షష్టికళలు, కలలు—స్వప్నములు,

మ॥ కలికాలం బిది భక్తి యన్నను విరాగంబన్న విజ్ఞానపుం
గలసం బన్న సభస్సుమంబు లగుచుం గన్పట్టునిప్పట్టునన్
గలిసంతారకుఁడైన వేంకటనగాగ్రస్థాయి సేవించు నీ
"తెలుఁగుంబీర" మదృష్టవంత" మని నిర్దేశింతుఁ గామేశ్వరీ. 442

*మ॥ బెజవాడన్ వసియించు పెద్దల నిటుల్ ప్రేరేపి న న్నీగతిన్
భజియింపించిన నీకు వారికి నమోవాకమ్ము లర్పింతు నీ
రుజులై యీ బెజవాడపౌరులు యశోఽర్థుల్ సంపద్వృద్ధిన్ సదా
భజియింపన్ గరుణింపు మమ్మ!యనినిన్ బ్రార్థింతుఁగామేశ్వరీ.443

మ॥ తలఁచే నామయపీడ నాఁగుటకునై త్వన్నామమంత్రింపుసం
స్మరణంబుంబొనరించుచుందు, నిది నీసంస్థానమా పోర్లు, త్వ
చ్చరణారాధనకున్ ఫలంబుగ నిటన్ సన్మానముంగూర్చి నీ
బరుపున్ దింపికొనం దలంచినయటుల్ భావింతుఁ గామేశ్వరీ. 444

మ॥ ఇదియే నిక్క మటంచు వేని నిను నే నీమాత్ర పీడన్, భవ
త్పదపూజారతికిన్ ఫలం బిదియునోఁ, దత్త్వజ్ఞు లాసించున
ప్పదవుల్ వే, అవి గోరి నేను దసియింపం బూనితిన్, దానికి
య్యదియాసన్ గలిగించునట్టి యొకసూచ్యార్థంబు కామేశ్వరీ.445

శా॥ "నేరంబుల్ పదివేలు గల్గిన నిదో? నేర్పున్న సద్దానినే
ఆరాధించెద రుత్తమోత్తము" లటం చార్యోక్తు లాలింతు నీ
పౌరుల్ నాయెడఁ జూపునాదృతియుఁ దద్భావంబె తెల్పున్ బుర
స్కారమ్ముల్ ఘటియించు నీ కిదె నమస్కారమ్ము కామేశ్వరీ.446

---

టిప్పణి॥ చెన్నపురిలో త్రిలింగపీఠసన్మానం జరిగిన తర్వాత నెల్లూరులో శ్రీకామేకోటి పీఠస్థుల దర్శన మైనదనిన్నీ తరువాత బెజవాడలో పురపాలకసంఘం వారి పెద్దసమ్మానం జరిగిందనిన్నీ తెలుసుకోవలెను.

*మ॥ కనకమ్మున్ గురిపింతువంట?అదియుం గాదమ్మ; చోద్యమ్ము?మ్రు
త్కనకంబుల్ సమదృష్టిఁ గాంతురుగదా! ధన్యుల్ మహాభాగు లో
కనకాంబా? ఘను లీగతిన్ సలుపు సత్కారంబుకన్నన్ మఱిన్
"గనక" మ్మంచొకఁ డుండునే? వినెద వక్కాణింపు కామేశ్వరీ.447

మ॥ అసలే యి ల్లదలంగఁ జాల నను న న్నాయూరి కీయూరికిన్
వెస నేగించితి పెద్దపెద్దలకు నావేశంబు కల్పించి పె
ద్దసభల్ సత్కృతులున్ ఘటించితివి వృద్ధత్వమ్మునం దిట్టి మే
లుకసి గల్పించిన నీయుపాసనకు మ్రొక్కుల్ పెక్కు కామేశ్వరీ.448

•మ॥ ననుఁ గాపాడితిరుగ్ణ వృద్ధు;జ్వరితు న్నాకుక్షిఁగాపాడి తి
న్నని యారోగ్యము నిచ్చి యైహికసుఖానందప్రదం బైన నీ
ఘనపీఠమ్మున నున్న స్వామి నెలమిన్ గన్గొంట చేకూర్చి తెం
తని వర్ణింతును? నీకృపాకలనమాహాత్మ్యంబు కామేశ్వరీ. 449

మ॥ భవితవ్యంబగు నైహికమ్ముకొఱకే బ్రహ్మాండమౌ యత్నమున్,
గవులుం బండితులు న్నృపాలు రొరులుం గావింతు రేకొంచెమున్
శివ! యేమందును? పారమార్థికముపైఁ జిత్తమ్ము శిక్షింపఁ బో
రవివేకమ్మున? దీనికన్నఁ గలదే? అన్యమ్ము; కామేశ్వరీ. 450

మ॥ "తెఱవంబట్ట దివంపుద్వార" మని నిర్దేశించె నోయమ్మ? యీ
నరజన్మంబును వ్యాసమౌని; అది సంధానించియున్ జ్ఞానపుం
దెఱువుం జూప వదేమి? తల్లి! సకలార్తిధ్వంసకంబుల్ భవ
చ్చరణాంబుల్ "శరణ" ణంటిఁ బోకడపు మజ్ఞానంబు కామేశ్వరీ.451

---

* టిప్పణి॥ కనకాంబా:--కనకదుర్గా?

• టిప్పణి॥ త్రోవలో చిన్నబిడంబికి అనారోగ్యం ఏర్పడి భగవదను
గ్రహముచే నివారించినదని గా॥

మ॥ తను వున్నంతకుఁ బ్రాణికోటి కెదియో తాపత్రయ మ్మొందు "న
త్తనువున్ వీడి సుఖింపవచ్చు" ననుచోఁ దన్వంతరం బబ్బు న
న్మను లేమార్గము దోఁచకే నినుఁ బరమ్మన్నెమ్మి ధ్యానింతు ర
ప్పని శ్రేయస్సుల కెల్ల "మూల" మనుచున్ భావింతుఁ గామేశ్వరీ. 452

శా॥ "బంగాళీ" అల "రామకృష్ణుఁడు" తరింప న్నేర్చె నీయర్చక
త్వాంగీకారముచేతఁ, బిమ్మట "వివేకానందుఁ" డాయొజ్జచే
తం గాదే? తరియించె, జ్ఞానమునకుం ద్వైత్సేవయే ముఖ్య మె
బ్భంగిన్; ధీవరుఁ డాదిశంకరుఁడు నీభక్తుండు కామేశ్వరీ. 453

శా॥ సారం బించుకయేనిఁ గన్పడని సంసారమ్మునన్ భార్యయే
"సార" మ్మందు మొ? యెంతసార మది సత్సంతానమే సంసృతిన్
సార మ్మందు మొ? అట్టి సంతతి ప్రపంచమ్మందు మృగ్యంబు, ని
న్నారాధించు టొకండె సంసృతిని సారాంశమ్ము కామేశ్వరీ. 454

మ॥ ఇది పాపం బడఁగించి పుణ్యకృతులందే యిచ్చ చొప్పించు, సం
పద కాసించిన లోప ముండదు, దురభ్యాసమ్ము లం బుట్టనీ
యదు జన్మాంతరమున్ ఘటించిన భవిష్యత్కాలమెల్లన్ శుభా
స్పదమా నట్లొనరించు ముక్తియును సంపాదించుఁ గామేశ్వరీ. 455

మ॥ ఒకఁడున్ హ్రాయఁ డదేమి పాపమొ? మహాయోగమ్ము సంసారమం
దకలంకమ్మగు నట్టిదున్న దని దివ్యజ్ఞాని; అట్లయ్యు దీ
నికి నాలాయపడం గడంగుదురు మానిశ్రేష్ఠులెల్లన్ విరా
గికదా! మంచి యదృష్టశాలి; అతనిన్ గీర్తింతుఁ గామేశ్వరీ. 456

మ॥ ఉఱుకన్ బుద్ధి జనించు సందర్భమున నొక్కొక్కప్డు సంసారపున్
సరణిన్ జూచిన; నంతలో నెటులొ వాత్సల్యమ్ము చూపించు నీ
చరణారాధన; అక్కటానఁజూమి? యీసంసారమందుండి నీ
స్మరణన్ సల్పుచునుంటి నెట్లు నను సమ్మానింతో? కామేశ్వరీ. 457

శా॥ భారంబున్ వహియించునప్పుడె తృణప్రాయమ్ముగా నుండె సం
సారం; బిప్పుడు భార్య పోయినది, నే సన్న్యాసి నై యుంటి సం
సారంపున్ భర మేను లోఁగుకొలఁదిన్ సాధింపఁగాఁ జొచ్చె నే
నేరీతిన్ దరియింతు? నీదు చరణంబే దిక్కు కామేశ్వరీ. 458

శా॥ సంతోషంపడుచున్ గ్రహించుఁ గడు విశ్వాసమ్ము చూపించు నే
సుం తేనిన్ బెరవాని కిచ్చునెడలన్ స్తోత్రమ్ము గావించుఁ, దా
నెంతే నిచ్చునుగాక సంస్కృతి, కొకండేనిన్ లవంబేనియున్
సంతోషింపఁడు తృప్తిఁ జెందఁ డిది నైజం బంబ? కామేశ్వరీ. 459

మ॥ గతమందే గతియింపఁగాఁ దగిన నాకాయమ్ము దీర్ఘాయురు
న్నతికిం బాత్రముఁ జేసి నిల్పితివి, దీన న్నను నీనామస
న్నుతి సేయంగలవాఁడ నైతిఁ గడు ధన్యుం జేసి తల్లి! యే
వెతలుం సోఁకఁగ నీక చూడుమని ని న్వేఁడింతుఁ గామేశ్వరీ. 460

♦మ॥ ధనధాన్యమ్ములు చాలినంతవఱకే తల్లి! నినున్ గోరియుం
టి నఁటే యిచ్చితి వేను సంస్కృతి నకుంఠీభూతవకా తీవి నె
వ్వానికిన్ లోఁగక నెట్టుచుంటి, నిపుడో? వార్ధక్య, మేలోపమున్,
నను బాధింపకయుండఁ జూడు మరియే నా మొక్కు కామేశ్వరీ. 461

*మ॥ నలుబై యేండ్లకు మున్ను నేను గలలో నం గామధేన్వాకృతిన్
గలయం గన్గొని "కామధేను" పద మంకం బుంచి దారిద్ర్యమున్
దొలఁగఁ జేయు" మటంచు వేడితి, నఁటే దూరమ్ముగా నెట్టి ని
చ్చలు నా కిచ్చితి వెచ్చుగా సకల మైశ్వర్యంబు కామేశ్వరీ. 462

• టిప్పణి॥ మొట్టమొదటి కామేశ్వరిలో—అతిథుల్ వచ్చిన గారవింపుడు॥ అనే పద్యంలో చూడఁదగు.

* టిప్పణి॥ కామధేనుస్మరణ నీదుకరుణ నాపబుని జలుకవమ్మ॥ అనే సీస పద్యాలు గోదేవి అనేపుస్తకంలో చూడఁదగు.

□ మ॥ శివసంధాయిని, వీ వొసంగనివి యేశ్రేయమ్ములున్ లేవు స
ర్వవిధాలం గనిపెట్టుచుంటి "సిరిసంపత్తుల్ గలా౯," డంచు ని
క్కవి కెందున్ యశ మబ్బఁ జేసితివి, మోక్షం బింత కేముందు? నా
కవనంబే యొకముక్తి, నాకవన మేగం జూడు కామేశ్వరీ. 463

మ॥ అది సాధించెడి దొక్కభక్తియె, త్వదంఘ్ర్యంభోజసంసక్తి నా
కొదవుంగాక, మఱొక్కజన్మముననో? ఒండొక్కజన్మాననో?
త్వదధీనంబగు నాదుకోర్కెయిది సిద్ధంబౌత, "మిష్టే" యటం
చెద కేమాత్రము లేదు తొందర, రెపుడో? యీవమ్మ? కామేశ్వరీ.

మ॥ అయిదాఱేండులనుండి జీవితము "కారాగార" మన్నట్టు లే
దియొ? మాదిరిం గనుపట్టెడిన్, సభల కెందేనేగ నేమయ్యె? నీ
దయనీయంపుటవస్థ గణ్యమగునే? తల్లీ! దివారాత్రముల్
శయనాగారమునందె యేగు టదియున్ సౌఖ్యంబె? కామేశ్వరీ.465

మ॥ జరుగున్ శిష్యులపాఠముల్ గవితయుం సాఁగున్ గవుల్ గౌరవ
స్ఫురణం బొప్పఁగ విన్పుకబ్బములఁ దప్పుల్ దిద్దునానేరుపున్
నుడుఁగన్ లేదిది యేటిరోగమొ? ధృతాసు న్నన్ను శయ్యాగృహో
దరవాసం బొనరించె నీ కిదె యుపేక్ష్యాంబయ్యెఁ గామేశ్వరీ. 466

మ॥ "జరదోషం" బిది యందువేమొ! విను నిచ్చల్ వృద్ధులెందఱొ యీ
ధర నల్లాంకలు "రైలు"పైఁ దిరుగు నాధన్యాత్ములల్ పల్వు రుం
డిరి, నాకంతటిపాటి యోపికయినన్ లేదయ్యె శయ్యాగృహో
దరమే సర్వము నయ్యె నీ కిది యుపేక్ష్యంబయ్యెఁ గామేశ్వరీ. 467

---

□ టిప్పణి॥ నాకవనము—స్వర్గవనము, నందనోద్యాన మన్నమాట. నాకు౼ అవనంబు (రక్షణము) అనియును మొకట నాకవనపదమును విడదీసికొందగు, ఆపక్షంబున, నీవు రక్షించుటయే ముక్తి అని తాత్పర్యం, నే నెల్లప్పుడు నిన్ను తలచి జపము చెప్పికొనుచుండుటయే ముక్తి అని ధ్వని—

శా॥ నీనేతృత్వమునన్ జగమ్ము నడుచు న్నీభక్తుఁడ న్నేను నీ
ధ్యానంబుం బొనరించు నాకెదియు దైన్యం బబ్బఁగా రాద యె
ట్లో నాదైన్యము "నీదుదైన్య" మని నీ వూహించి నాజన్మమున్
మానార్హమ్ముగ నేగున ట్లొనరుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 468

శా॥ అద్వైతం బది యెంత వల్లెయిడినన్ ద్వైతంబె పో! ముక్తికిన్
సద్వైద్యంబగు, భక్తి ద్వైతముననే సర్వత్రి వర్తించు నే
నద్వైతిన్ జని నయ్యు ద్వైతమునకే అర్పింతుఁ జిత్తమ్ము, భ
క్తిద్వారమ్మున మూఢుఁడేనిఁ గను ముక్తిప్రాప్తి కామేశ్వరీ. 469

మ॥ "దినమున్ గండము" గాఁగ నిల్పితివి నా దేహమ్ము నానాఁట జీ
వనశేషమ్ము గుణించి పెంచె దిదివో; "పాపీ చిరాయుష్క" యం
చనులోకోక్తకి లక్ష్య మాఁపునెడ దార్ఢ్యం బిమ్ము లేదేని చ
య్యన నీసన్నిధిఁ జేర్చుకొమ్మితర మే నర్థింపఁ గామేశ్వరీ. 470

శా॥ ఆరోగ్య మ్మిడ నేస్తు వాయు విడ నే నైశ్వర్య మీనేస్తు వం
బా? రాజ్య మ్మిడ నేస్తు, విన్నియును మిథ్యాభూతముల్ వీని నె
వ్వారున్ జ్ఞానులు గోర రే నెఱిఁగి యప్రాజ్ఞుండ నౌచుంటు సం
సారం బింతకు మూలము, మయ్యది కడుం జండాలి కామేశ్వరీ. 471

శా॥ ఏనీచమ్మునుగాని పాడుపనిగానీ లంచమేగాని యే
దేనింగాని యొనర్పఁ జేయునది యీ ఘోరంపు సంసారమే
మహానుల్ సైతము దీనఁ జిక్కుకొని యామ్నాయార్థముల్ ద్రోసి య
జ్ఞానానం బడువార, లెంతయది??? సంసారమ్ము కామేశ్వరీ. 472

మ॥ పడుచున్ లేచుచు దేహయాత్ర నెటులో పాటించు నిద్దేవి ని
న్నెడఁద న్నిల్పి భజింపఁగాఁ దగినదే ర్పిచెతి, వేకేతి గాఁ
గడతు న్నే భవసాగరంబు; భగవత్కైంకర్యమే తప్ప వే
ఱుడుపం బింకుల కెంకునేని గలదే మో? తెల్పు కామేశ్వరీ. 473

మ॥ పరిశీలించితి నేను ద్వత్పదయుగీభక్తుల్ వరం బీయఁగా
నరుదేరం గని మొ్రొక్కి యేయితరమే నర్థింప కర్థింతు్రి "భ
క్తిరసం బి"మ్మని; జన్మజన్మములకున్ దేవీ! భవద్భక్తియే
తరణోపాయము లేదు వేఱొకఁ డిదే తథ్యమ్ము కామేశ్వరీ. 474

మ॥ "గురు"వంచుం బ్రతిదానికిన్ వలయు, నాకో? నీపదద్వంద్వమే
గురు వన్నింటికి, మంత్రతంత్రములు నేఁ గోరంగ లే దేరిఁ; ద
క్కొరులంగోరుటకన్న నిన్నడుగుటే యుక్తం" బటం చెంచి నీ
చరణద్వంద్వమె పట్టుకొంటి నఘనిష్కాసంబు కామేశ్వరీ. 475

మ॥ కరముల్ గాలినమీఁద నాకులకున్నై కష్టించు చందమ్మునన్
మొుఱకుల్వోలె బుధాగ్రగణ్యులును దుర్మోహమ్మునన్ బు్రింగి నీ
చరణారాధన వీడి నీచచరణాసక్తిన్ గడు న్నొచ్చి య
ష్టయివం జొత్తురు భక్తియుక్తులయి; వింతోఁగాదె? కామేశ్వరీ,476

మ॥ నరజన్మంబు పరీక్షకై యొసఁగు నన్నాళీకజన్ముండు, దేవ
రహస్యం బిది, ఆర్యులీవిషయమున్ వాకు్రిచ్చి రందందు; ధీ
వరు లీయంశ మెఱింగికూడఁ దరుణీవ్యామోహముం జెంది నీ
చరణారాధన వీడి చచ్చి మరలన్ జన్మింతు్రి కామేశ్వరీ. 477

మ॥ చదువుల్ నేర్చితి నశ్రమమ్ముగ, నృపాస్థానమ్ములన్ బూజ్యతా
స్పదమై మించితి నశ్రమమ్ముగనె, సంసారమ్మునన్ బేరుగా
బ్రిదుకన్నేర్చితి నశ్రమమ్ముగనె, త్వత్పాదద్వయీభక్తి నా
కొదవుం గావుత మశ్రమమ్ముగనె యి ష్టోతల్లి! కామేశ్వరీ. 478

శా॥ దేవీభాగవతమ్ము నాంధ్రముగ నీదివ్యానుకంపామృత
ప్రావిర్భావముకల్మి నే నొడివితిన్, బ్రాప్తించె వేదాంతపుం
దో్రివల్ గొండొక అక్కఱానఁ; నది యేదో? కొంత వ్యార్థక్యమం
దావేశించి మనఃప్రశాంతికి నుపాయం బయ్యెఁ గామేశ్వరీ. 479

మ॥ అది తెల్పించుటకేని కారణము నీయవ్యాజకారుణ్యమే
విదితం బిప్పటి కయ్యె, నేఁటికిని దేవీ! భావికాలంపునం
పదకేకా కటువంటి సన్మతి జనింపం బోదు, నిక్కమ్ము, త్వ
త్పదముల్ పట్టినదాసికిన్ ఫలము సంప్రాప్తించెఁ గామేశ్వరీ. 480

మ॥ గురువౌ బ్రహ్మమునీషి వ్యాకృతిని నాకుం జెప్పుచోఁ గొంత యు
త్తరమీమాంస ప్రసక్తియున్ దొరలి తత్తత్సర్మముల్ గొన్ని నా
కెఱుఁగంగాఁబడె, వేఱు దేశికులు లేనేలేరు, వేదాంతినై,
తరియింపంగల జ్ఞాని నాదునొకో? యేతన్మాత్రఁ గామేశ్వరీ. 481

శా॥ "భక్త్యండ్డె తరియించుటే సులభ" మన్ భావంబు వేదాంతపున్
సూక్తుల్ దెల్పెడి, మంత్రతంత్రజపముల్ యోగమ్ములున్ మాదృశా
వ్యక్తుల్ నేరరు, మానులే తగుదు రప్పట్లన్, ననున్ భక్తిసం
పృక్తున్ జేసి యనుగ్రహింపు మిదియే వేవేలు కామేశ్వరీ. 482

శా. వ్రాయం దగ్గది యెంత యున్నదియొ? సర్వంబున్ మునీంద్రుల్ జగ
ద్గేయుల్ వ్రాసియె యుంచి, రీతనువునన్ గించిత్తునున్ గారవం
బాయార్యుల్ గమనింపరై, రిది పరం బ్రార్థించుచోఁ బూర్తిగా
సాయఁ బోట "నహేయ" మంచు నొడివెన్ శాస్త్రంబు కామేశ్వరీ.

మ॥ "దినగండమ్మును దీర్ఘమాయువు"గ నన్ దీవించి యిట్లుంచి నం
దున నేముండెఁ ఫల" మ్మటంచు మదియందున్ జూడఁగా నొక్కటే
కనుపట్టెన్, శివనామసంస్మరణమున్ గావించుకో నిట్టిచి
క్కనుసంధించితి వింతకన్న మఱిభాగ్యం బేది? కామేశ్వరీ. 484

మ॥ గతకాల మ్మెటులున్న దానికొఱ కొక్కండున్ విచారింపఁ డా
గతకాలమ్మునకే యతించు, నది యేకార్పణ్యముల్ లేక నన్
గృతకృత్యుం డనిపించున ట్లొనరుపన్ గేల్మోడ్తు నోయమ్మ? సం
స్మృతిమగ్నుండను గాన నిట్లడిగితిన్ జే సాచి కామేశ్వరీ. 485

మ॥ గతమందుం బ్రతిజీవి గర్భనరకాగారమ్మునందుండి యే
క్షితి కేతెంచెడిఁ గాని లేశమును దత్క్లేశమ్ముఁ జింతింపఁ, "జా
గతమా రే పొకపీడ" యంచుఁ దెలియన్ గంపించుఁ జింతన్, బరీ
క్షితుచారిత్రమె దీని నొజ్జయగుచున్ శిక్షించుఁ గామేశ్వరీ. 486

మ॥ "ప్రతివాఁడున్ మృతిఁ జెందు నేనొకఁడనే బ్రహ్మాయువై యుందు"నన్
మతితో నెల్లరు జీవితమ్మునెడలన్ మాంద్యమ్ము గైకొందురో వ్యా
ధితుఁడున్ వృద్ధుఁడు నయ్యు జాతకముపై దీర్ఘాయువే నమ్ము, నే
కృతకృత్యుండును "సిద్ధ" మంచుఁ బలుకం డేమమ్మ! కామేశ్వరీ. 487

మ॥ తినుటే కష్టము, తిన్నవస్తు వది సంధిగ్ధంబు జీర్ణించు, చే
పనికిం దాఁ గొఱ గాఁడు, మిన్నొరయు లౌభ్యం బెన్న, నీతుల్ కడున్
వినుచున్ గాని వినం డెవండు, నకటా? వృద్ధుండు జీవించు ని
చ్చను వర్తించు నటన్న నెంత యపహాస్యం బంబ? కామేశ్వరీ. 488

మ॥ మును తాఁ జేసినయట్టి యప్పులనె ముమ్మాటికిన్ జేయుచుం
దనువెల్లన్ వళులై స్వరమ్మునెడ గాద్గద్యంబు నర్తింప గ
వ్వను గన్గొన్నను జూపికన్ బలెనె లౌభ్యంబుం బ్రదర్శించు వృ
ద్ధుని కన్నం బసిబాలుఁడే మెఱుఁ గటందు న్నేను గామేశ్వరీ. 489

మ॥ మనుజత్వమ్మును బ్రాహ్మణత్వమును సంపన్నంబుగాఁ బైని వి
ద్య నెటో కొండొక నేర్చియుండఁ బరమాత్మన్ గూర్చి యత్నం బొన
ర్పనిచో మూర్ఖుఁడె వానికన్న మిగులన్ బ్రాజ్ఞుండు; యత్నంబొన
ర్చినచో దుర్లభమేని నీకరుణచే సిద్ధించుఁ గామేశ్వరీ. 490

మ॥ "అమనస్కత్వ" మటంచు గ్రంథములు వ్యాఖ్యానించు నద్దాని నే
సుమనస్కుల్ గొనఁగల్గిరో? తెలియ దీశుల్ గారు సామాన్యు ల
య్యమనస్కత్వముపట్ల; భక్తిమెయి నిన్ ధ్యానించుటతప్ప నిం
క మఱే యోగము నే నెఱుంగ నెటులో? కాపాడు కామేశ్వరీ. 491

మ॥ కలఁడేమో? యొకఁడేని సంసృతిని సౌఖ్యం బందుచున్నట్టి వాఁ
డిలలో, లేఁడనియే యనన్ వలయు లేనేలేనిచో నేల? వి
జ్ఞులుగూడన్ బడి పోర్లఁగావలయు నీశు న్నీపతి న్నిన్ను న
ర్మిలి సేవించి సుఖమ్ముఁలం బడయలేరే? తల్లి కామేశ్వరీ. 492

మ॥ అరయ న్నే నొక చిల్లిగవ్వయును గా నాలాటి యీనన్ను ధీ
వరుఁగా మేటిగృహస్థుగా సలిపి పేర్వ్యాపింపఁగాఁజేసి తెం
దఱో? నన్నున్ గన వత్తు రర్థులయి యంచాన్నభంగదోషమ్ము నో
ప్పరికింపం జనునమ్మ నీ కిది కడుం బాపమ్ము కామేశ్వరీ. 493

మ॥ కఱ వేతెంచెడి యుద్ధహేతువున లోకంబెల్ల నల్లాడు "హి
ట్లరు" దుర్వారుఁడు రావణున్‌బలెనె వాలాయమ్ముఁ గావించుచుఁ
మ్కరతల్ భీతిని గొల్పుచున్న యవి యాచాన్నభంగదోషమ్ము దు
ర్భర మెట్లో? "మరియాదనిల్పు"మనినిన్ బ్రార్థింతుఁగామేశ్వరీ. 494

మ॥ ధన మీకున్నను వచ్చుబ్రాహ్మణునకున్ దాహంపుఁదీర్థమ్ముతోఁ
దిన నన్నం బిడునట్లుసైనను ననున్ దీవింపు మోయమ్మ? యీ
జని కీమాత్రము సాయమున్ సలిపి యాచాన్నభంగదోషమ్ము సోఁ
కనిఫక్కిన్ గరుణింపు నీ కిదె నమస్కారమ్ము కామేశ్వరీ. 495

శా॥ నాయర్ధాంగి ననుగ్రహించితివి ధన్యం బయ్యెఁ దజ్జీవితం
బాయుర్దాయము నాకుఁ బెట్టిచనె నిల్లా లెన్నియో? చిక్కలే
నై యీఁదం గలవాఁడ నైతిఁ బోడుగా నాయుర్బలం బుండెఁగా
కేయాధారము లేదు ని న్నడుగుటే యే నేర్తుఁ గామేశ్వరీ. 496

మ॥ మును పద్యాదవులట్లు "యూరపు" జనుల్ ముక్కాఁకలం దేఱిదే
వుని లెక్కింపరు వేద మొప్పికొనరున్ భూమీసుపుల్ నాఁ గనుం
గొనరున్ వారలలోన వారలకె యంకూరించెఁ బో రప్పు డే
మననౌ, భూభరమూఁగనియ్యదియుఁ బాధమొ్మక్కొ? కామేశ్వరీ 497

మ॥ అవివేకమ్మున కున్నవ్యాప్తి జగమం దావంతయున్‌గూడ లే
దు వివేకమ్మున కేమి హేతువొ కదా? దుష్కార్యముల్ సేయువాఁ
డెవఁడో? వాఁడె యగున్ ధరాధిపతి; లోకైకేశ్వరుం డెట్టిఁడే
యవునో? లేక వివేకియౌనొ? తెలుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ 498

మ॥ జనులన్ దోఁచియు నూళ్లు గాల్చియు జగత్సంహారమున్ జేసి రా
జను నుచ్చైర్బిరుదంబు గైకొని గజాద్యారోహణాదుల్ పొన
ర్చిన నేమాఁ గృతమా నఘమ్మది జనుశ్శేషమ్మునందో? పరం
బుననో? పట్టి పలార్చకుండునె? చలంబుం బట్టి కామేశ్వరీ. 499

శా॥ ఏజోలిన్ గలిగించుకోక మది నిన్నే నిల్పి పేర్మిన్ మహా
రాజుంబోలెను నిర్విచారముగ వార్ధక్యమ్ముఁ బోనెట్టఁగా
నేఁ జాలం బ్రియతింతుఁ బుత్రికులు నా కీ రింత విశ్రాంతియున్
నాజన్మర్క్షమె కారణం బగునొ? అన్యం బౌనొ? కామేశ్వరీ. 500

శా॥ ఆయమ్ముం గనిపెట్టి చేయరు వ్యయం, బార్జింప రేలేశమున్
శ్రీ యార్జించిన దెన్నినాళ్ల కగు? నాశీర్వాద మిమ్మంచు ని
న్నే యాచించెద వట్టి సోమరుల నా కీ విచ్చి ఆశీస్సునే
నీయన్ మానితివేని నెగ్గు కెటు లీవే చెప్పు కామేశ్వరీ. 501

శా॥ ప్రాచీనాచరణమ్ముల న్నడువ రభ్యస్తమ్ము లయ్యె న్నవీ
నాచారమ్ములు; వీనికిం దగిన ద్రవ్యం బేది? ఆర్జింప రే
కాచంబుల్, దుదిరోజులందు రుజయే కాకీవిచారంబు న
న్నేచంబూనె విరక్తి నా కెటులొ? నీ వీవమ్మ? కామేశ్వరీ. 502

మ॥ అరరే? భారతభూమిదుర్దశ? అరణ్యాన్యంతరంధుస్థద
ర్దురజాతిం బడి యుంద మన్న నటకుం దోడ్తో "సినీమాలు" నా
గరికాకారపుసారు "టీ" యు "నుపమా" "కాఫీ" బిడీయున్ మొదల్
పరిపంధివ్రజ మ్మేగి పిల్చు నిది యేపాపంబొ? కామేశ్వరీ. 503

మ॥ "భగవంతుం డొకఁ డున్నవాఁ డనుచునే" ప్రాబల్యలందేలు లేఁ
డగుపట్టండె? నిజాన కున్నయెడఁ, నం చజ్ఞుండు వాదించుచున్
దెగు దుష్కర్మము లాచరించుటకుఁ; దద్ధీరత్వమే నెగ్గిన
ట్లగునేమో కద? నీయుపేక్షయును దోషానేని కామేశ్వరీ. 504

మ॥ భవదీయాలయముల్ చెడం గనియు స్వల్పంబేని గల్పించుకో
వెవరో? యూరపు ఖండమం దెవరినో? హింసించుచున్నారనన్
జెవికి న్నీ కెటులెక్క? నీదునునికిన్ సిద్ధాంతమున్ జేయ స
త్కవు లేయూదరు వింకఁ జూపవలె వక్కాణింపు కామేశ్వరీ. 505

శా॥ నాదా నాల్క "నమశ్శివాయ"యనుమంత్రం "బోం" సమేతమ్ముగా
నూదంటున్బలె నంటుకొన్నది, ననున్ శుద్ధుం బొనర్పంగ నీ
వో దేవీ? యిది నా కొసంగితని నే నూహింతుఁ దన్మంత్ర మా
స్వాదింతున్, మదిమాత్ర మూరక యెటో పర్వెత్తుఁగామేశ్వరీ. 506

శా॥ వ్యాధిగ్రస్తతచేఁ బవిత్రతకు నే నర్హుండఁ గానంబ? నన్
శోధింపం బని లే దెఱుంగుదు మనశ్శుద్ధుండు వీఁడంచు; దు
స్సాధంబైన భవత్పదాశ్రయమునే సాధించితిన్ దాన స
ద్బోధం బందితి దీని నిల్పు మనిశమ్మున్ దల్లి! కామేశ్వరీ. 507

మ॥ శివనామమ్ముజపించు హేతువున నీ "చెళ్పిళ్ళ" వెంకన్న తాఁ
"దెవులంనుండి సుఖంచుచుంటి" ననుచున్ దెల్పంగదా? "తద్వచ
స్సువృథా గానియటుల్ భవత్కృపనొగిఁ జూపింపుమోయమ్మ? న
న్నవని న్నిల్పినయంతకాల" మని నిన్నర్థింతుఁ గామేశ్వరీ. 508

మ॥ తెవులున్గొంటుగ నుండి కూడ సుజనధ్యేయమ్ముగా జీవితం
బెవరున్నవ్వనిరీతిగాఁ గడపినాఁ డీవెంకఁ డిందాఁక; న
న్నవమానింపఁ దలంచె నీతెగులు సాయం బీఁగదమ్మా? మహా
కవినై యె ట్లవమానముం గుడుతు వక్కాణింపు కామేశ్వరీ. 509

మ॥ ఒకదీర్ఘంబగు వ్యాధి నన్ గుడుపు నెన్నో చిత్కు-, లేమందు దీ
నికి లేదంబరొ? నీదుపాదరజమొండేయుంటె, నాయుస్సు బా
ధకమై నన్నల యించుచున్నది భవద్ధ్యానంబు గుర్తింపరా
దకటా! దీని కుపాయమున్ దలుప లేవా? తల్లి? కామేశ్వరీ. 510

శా॥ నా కన్యం దుపచారమున్ సలుపకుండన్ దేహయాత్రావిధుల్
నీకారుణ్యముకల్మి నిందనుక నేనే సల్పికొంటిన్, గృప
న్నాకోర్కె-న్ సఫలం బొనర్చి తుదిదన్కన్ బోవని మ్మిట్టులే
నీకారుణ్య మొసంగలేవ దొకఁడున్నే? తల్లి! కామేశ్వరీ. 511

మ॥ పలువుర్ శిష్యులు సేవకుల్ గలరు నాపై భక్తిమంతుల్, పదం
బుల నొత్తంగఁ గుతూహలంపడు నెడం బోఁ ద్రోయఁగా లేక యం
కిలి నేఁజెప్పఁగ లేమి నీకెఱుకయే, కించిత్తునుంగూడ న
న్యులకు న్నేఁబని చెప్పకుండ వరమిమ్మా యమ్మ కామేశ్వరీ. 512

మ॥ పరమానహ్యముగాఁ గనంబడెడి నంబా! చేతులుం గాళ్లులుం
బరమేశుం డిడియుండ నొండొకనిచేఁ బ్రాజ్ఞుం డెవో గొప్పకై
పరిచర్యం గొనుదైన్యముం గనినఁ "దత్ప్రార్థకర్మంబు నా
పరమున్ జేయకు" మంచు నారెకునినుం బ్రార్థింతుఁ గామేశ్వరీ 513

మ॥ అది "యైశ్వర్యపులక్షణ" మ్మనియె దేహారోగ్యసంపన్ను ల
భ్యుదయస్థుల్ తలపోయుచుందు రది నాకొక్కింతయు న్నచ్చ దా
పదకున్ గుర్తది, మద్గురూత్తముఁడు శ్రీబ్రహ్మాయ్యవిజ్ఞుండు నా
కిది నేర్పెన్ దనదాపరివర్తనముచే నేనాఁడె కామేశ్వరీ. 514

మ॥ బ్రతుకీనాయది నీకు నచ్చునెడలం బ్రస్థానముంగూడఁ బం
డితమాన్యంబగున ట్లొనర్పు మనియే నిన్నేను బ్రార్థింతు జీ
వితశేష మ్మఖిలంబు నిన్నొ! హరినో విశ్వేశు నీభర్తనో;
మతిలో నిల్పెడినే ర్పొసంగి నను సంబాళింపు కామేశ్వరీ. 515

మ॥ రుమరాకల్ మఱి భస్మ మీద్వయము నోరుద్రాణి? నీభర్త కా
స్పదముల్; గావున నాకు వీనియెడలన్ భక్తిప్రపత్తుల్ ప్రారం
గుదిరెన్ బాల్యమునందె; యీద్వితయమే "గొంపోవుఁ గైలాస"మం
చెద నూహించెద నాక్య మున్నయది నాకిప్పట్టుఁ గామేశ్వరీ. 516

మ॥ జననీస్వర్గతివేళ శామనభటుల్ సాక్షాత్కరింపంగ సూ
చన నా కయ్యెను చేసె నే నిడితి మంచమ్మందు రుద్రాక్షమా
లను, మాయమ్మభయమ్ముదీరె నిదివాలాయమ్ము సాక్ష్యమ్ము నా
కనుభూతంబగునట్లు కన్పడియె నే లా! వేఱు కామేశ్వరీ. 517

*మ॥ అసదర్థమ్ముల నర్థవాదములు వ్యాఖ్యానించుటల్ గూడ ను
న్న సమాచారమె కాని కొన్నిటియెడన్ యాథార్థ్యమేయుండునా
రసి తన్నిర్ణయ మాచరింపఁగల ధీరగ్రామణుల్ మృగ్యులా
రసికుల్ నమ్ములు వారిపాదముల నారాధింతుఁ గామేశ్వరీ. 518

మ॥ శ్రుతివాక్యమ్ములలోఁబురాణములలోఁ సూక్ష్మాంశముల్ దేహి ను
న్నతికిం దెచ్చెడి వుండవచ్చు, నవి విజ్ఞానుల్ గ్రహింపంగలా
ర్మతిమత్తన్ గడుఁ గల్గియుండియును దుర్మానుల్ గనన్ లేరు సూ
నృతమా మార్గము చిక్కుటన్నఁ బయిపై నే యున్నె? కామేశ్వరీ.

మ॥ శ్రుతి భిన్నంబు స్మృతుల్ విభిన్నము,లటంచుం బల్కుచో నేకవా
క్యత సిద్ధించుట యెట్లు? తావకకటాక్ష శ్రీనిధానుల్ మహా
మతులున్నారు మహానుభావులు; తదామ్నాతంబు లర్థంబు ల
న్వితికిన్ వారికి లోఁగు సత్యముగుఁ దన్నిర్ణీతి కామేశ్వరీ. 520

మ॥ నదులెల్లన్ జలధిం జొరంబడుపయి న్నానాప్రభేదమ్ములున్
వదలున్; గోచరమా నభేద మటులే ప్రజ్ఞాస్థిరత్వ మ్మొకం

---

* టిప్పణి॥ శామనభటుల్ = యమదూతలు, ఆయీపద్యమునందలి విషయం తత్కాలమం దక్కడ నున్న బంధువులు వగైరా లందఱూ చూచి ఆశ్చర్యపడిరని యెఱుంగునది. నాకీనమ్మికకు కారణం దేవీభాగవతమే.

దుదయింపం గనుపట్టుఁ దత్త్వ, మది యెన్నో! జన్మముల్ సేయుభా
గ్యదశంబట్టి లభించుఁ బైపయిని లే దాదృష్టి కామేశ్వరీ. 521

మ॥ కవితల్ గట్టఁగవచ్చు తాలు గరఁగంగాఁ బాడఁగావచ్చు భూ
మి విభుండై కడుఁ బొంగవచ్చు, నెలమి న్మింటన్ జరింపఁగవ
చ్చు "వివేకంబు గడింప నేరఁ"డనుటేచోద్యంబు,శోచ్యంబు మా
నవజన్మ మ్మది లేకయుండినయెడన్ వ్యర్థమ్ము కామేశ్వరీ. 522

మ॥ తెగులుం "బూర్తిగ రూపు మాపు, మనివేధింపన్నినున్ గర్తృపుం
దగులున్ మాపఁగ నేరికేని దరమే? తల్లీ! యెటో కాలము
న్నగుఁబో టందకయుండ నెట్టునటులైనంజూచుచున్నావు, వృ
ద్ధగు నాకింతియ చాలు నింతకధిక మ్మర్థింపఁ గామేశ్వరీ. 523

మ॥ నవరాత్రిమ్ములు వచ్చెనేమనెదవో! నాశక్తి నానాఁటికిన్
జివికెన్ వ్యాధికి ముక్తి లేదెటులు నాచేఁ బూజ నెగ్గింతు నీ
శివతాతిత్వము సాయమైన యెడలన్ సిద్ధించు నేలాటినై
భవముల్ దోమయు నేనుఁగై యెలమి విభ్రాజిల్లుఁ గామేశ్వరీ. 524

మ॥ గతసంవత్సర మిట్టిశంకయె మదిన్ గన్పట్ట ని న్నెను గో
రితిఁ బూజించెడి శక్తి నిచ్చి వ్రతపూర్తిన్ జేయుటే కాక స
త్కృత్కై పిల్చిన చెన్నపట్టణము న న్నెగించి తావైచెది య .
ద్భుత మెల్లేగితి! నెట్లు వచ్చితి? నదేదో? మాయ;కామేశ్వరీ 525

*శా॥ నీ తేజస్త్రసరేణు వగ్ని నటు మండించున్ భవత్తేజ మ
వ్వాతూలు న్నెగడించు మేఘములచే వర్షంబు గల్పించు నో
మాతంగీ? అలకత్తృణంపుఁ గత యీమర్మమ్ము వాకుచ్చు యా
థాతథ్యమ్ముగ నేరికిన్ దెలియు? నీతత్త్వమ్ము; కామేశ్వరీ. 526

---

*టిప్పణి॥ కత్తృణంపుఁ గత=నీరసమైన గడ్డిపోఁచకు సంబంధించిన యితిహాసము అయీ యితిహాసం తృణమొక్కండటఁబెట్టి అనే నాలుగవపద్యపుటిప్పణిలో కొంచెం సూచింపబడింది అక్కడ చూచుకోండి.

మ॥ చెవికిన్ లేవుగదా? చెవుల్, కనులకున్ జెన్నారునే? కన్ను, లి
య్యావి యమ్యొ పను "లెట్లు సల్పు" నన? నమ్యోచోట్ల నీ తేజపున్
లవ మమ్యొ పను లాచరించెడిని వాలాయమ్ము తా నుండి నా
కవితాకల్పన గాదు వేద మిటు వక్కాణించుఁ గామేశ్వరీ. 527

మ॥ చెవిలో నుందువు కంట నుందు హృదయక్షేత్రమ్ము నం దుందు వ
య్యావి నిన్నుంగన నీ "చిదంబరరహస్యం" బెట్టిదో? ఇంటివాం
గవు నీ, వీశున కేనిఁ బట్టువడ వౌఁగా? యీపపంచంబు పెం
తువు నీ కిచ్చజనింపఁ దుగ్రింతు విదియేదో; మాయ కామేశ్వరీ528

మ॥ సృష్టింగూర్చి యొనర్చు ప్రశ్నకు జవాబేలేద యేపెద్దలున్
స్పష్టంబౌగతిఁ జెప్పలేరు త్వదభిప్రాయంబు; సాక్షాజ్జగ
త్స్రష్టం బృచ్ఛ యొనర్చినప్డును సమాధానంబు శూన్యంబ యౌఁ
గష్టింపం బని లేదు హేతు వెదియో? కావచ్చుఁగామేశ్వరీ. 529

శా॥ మాయన్ బుట్టుచు మాయనే పెరుఁగుచున్ మాయన్ దుదిన్ గిట్టుచున్
మాయాకార్య మెఱుంగ లేనిజడు లామ్నాయార్థముల్ నేర్తురే?
కాయంబే పరమాత్మగాఁ దలఁచు నజ్ఞశ్రేణి కే రెంతగా
నాయాసంపడిబోధ చేసిన వృథాయాసంబ కామేశ్వరీ. 530

మ॥ అమృతం బాగళ మాహరించినను "దేహం బెప్పుడో యాడు" నం
చమరేంద్రాదుల జీవితావధులు వ్యాఖ్యానించు నప్లాటచే
నమరత్వ మ్మది "నేతిబీఱ" వృథగా నద్దాని కై చాల య
త్నము గావించుటకూడఁ గూడ దనె విజ్ఞశ్రేణి కామేశ్వరీ. 531

శా॥ స్వఃపూఃప్రాప్తికి యజ్ఞయాగము లొనర్పం బోవువారెల్ల "నా
న్యః పంథా" యని వేద ముంటెఱుఁగకే యత్నించువార్గారు ఛం
దఃపాతానకు సార్థకత్వ మటు సంధానింతు రద్దానఁ జే
తఃపాథోజము శుద్ధిఁ గాంచు నని తాత్పర్యంబు కామేశ్వరీ. 532

మ॥ †క్రతువుల్ "చిత్తవిశుద్ధిహేతువు" లనన్ "గా" వన్న వాదున్ శత
క్రతువుల్ చేసిన యిందుఁ బ్రైదములు నిష్కర్షించి పోషించు నీ
శ్రుతిమార్గమ్మున శ్రోత్రియుల్ చనెద, రేశుంతాత్ములుంగూడ స
ద్గతికింబోదురు ని న్నెద న్నిలిపిః నిక్కం బింత కామేశ్వరీ. 533

మ॥ తిని యింటన్ గలవారి నెల్లరను సంతృప్తాత్ములన్ జేయనో
పిన కాలమ్మున నేరు జీవితసమాప్తిం గాంతురో? వారిజీ
వనమే జీవన, మట్లుగాక యెటులో? వార్ధక్యమందుండి జీ
వనము న్నెట్టుట యన్నఁ గేవలరసాభాసంబు కామేశ్వరీ. 534

మ॥ మతి కెవ్వేనియు "విశ్రమం" బనుచు నేమాత్రంబు సంసార సం
గతులౌ వారల కుండఁబోదరసి నే గాలించితిన్ దాదృశుల్
కృతకృత్యుల్ గన రార, ఉన్న పనులం దిద్దాని నొక్కండు గా
మతిమంతుల్ గని నిన్నెద న్నిలిపి యామ్మాయింత్రు కామేశ్వరి535

శా॥ స్నా నాదుల్ పొనరించి ఆసనవిధానజ్ఞుండనై నీపద
ధ్యానంబున్ బచరింప లే నెటులొ; శయ్యాశాయినై నీపద
ధ్యానంబుం బొనరింతు నాదునపరాధం బోర్చి నాకున్ మహా
మానుల్ సేయుతపాన కిచ్చు ఫల మిమ్మాతల్లి? కామేశ్వరీ. 536

శా॥ నా కేమాత్రము శక్తి యుండినను సన్న్యాసంబు నీపాటికే
కై కొందున్ గురురాహుయోగమున నాకై కొంట సిద్ధింప దె
ట్లో కైకోకయె సన్న్యసించిన మహాయోగీంద్రులాసించు నీ
దాకైవల్యము గోరుసజ్జ సయిపం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 537

మ॥ ధనలోభం బెప్డుడే నెఱుంగ నతినింద్యం బైన యీదుర్గుణం
బున "కారా! తుద కబ్బెఁ బో!తురక"మన్పూజ్యోక్తిపా లౌచునె
మ్మనమున్ ద్రిప్పుట తప్పుగాదె? యెటు సంబాళించెదో? నన్ జగ
జ్జననీ? సంసృతి యెల్లదోషముల కాస్థానంబు కామేశ్వరీ. 538

† టిప్పణి యజ్ఞయాగములు ఇట లోకవ్యవహార మనుసరణీయము,

మ॥ కొడుకుల్ మువ్వురలోన నొక్కఁడు కడుం గుఱ్ఱండు జ్యేష్ఠుండువీ
టిఁడి గాఁ డుత్తయుఁపూయకుం డెదియు దారిం దెన్ను లేకుండనుం
డెడి సర్వాగ్రప్రవృత్తి; మధ్యముఁ డె పేనిన్ బ్రాజ్ఞుఁడే గాని చి
క్కఁడునాయాజ్ఞకు నున్నప్రాజ్ఞత యెటోకన్పట్టుఁ గామేశ్వరీ. 539
మ॥ ధనమార్జించిన దుండుఁగాక అది నొందాఁకన్ మముం బ్రోచు సం
దను లార్జింపరు నేను వృద్ధుఁడను సత్రం బట్టు లుండున్ భవ
ద్ఘనకారుణ్యముకల్మి మద్గృహము, వెన్కన్ గాశి ని న్నన్నపూ
ర్ణను బ్రార్థించితి నాదు ప్రార్థన యథార్థంబయ్యెఁగామేశ్వరీ. 540
మ॥ "పదివే ల్వచ్చును నాకుసాలు కనుచున్ భావించువారొక్కండ ఱేఁ
బదివేల్ రొక్కమునిల్వయున్న"దని యూపాదించువారొక్కండ ఱి
య్యాది నీచిత్త మెఱుంగుఁగా! జనని సత్యంబో! అసత్యంబా? త్వ
త్పదఘూళున్ గలిగించు నెంతటి యశోభాగ్యంబుకామేశ్వరీ. 541
మ॥ "ధనలోభం బొకఁ డంకురించినది వార్ధక్యమ్మునం"దంచు ము
న్ననినాఁడన్ మఱియీరహస్య మది నీయాంతర్యమే తక్క నే
మనుజన్మండు నెఱుఁగఁ డేధనికునిం బ్రార్థింపలే దిట్లు జీ
వన మాశ్వాసనివృత్తి నేగఁగ నినుంబ్రార్థింతుఁ గామేశ్వరీ. 542
*మ॥ "భవితవ్యం బెటు" లన్న శంకయె ననున్ బాధించెడిన్ బ్రాప్తకా
లవిశేషజ్ఞునిభంగి వర్తిలితి వాలాయమ్ము నే; నిప్పుడో
తెవులున్ వార్ధక మేకమయ్యె నెటులో దీవించి నాకున్న గౌ
రవము న్నిల్పు"మటంచు సారెకునినున్ బ్రార్థింతుఁగామేశ్వరీ. 543
మ॥ అనుకూలమ్ముగ గాలమేగినది నాకావంతయున్ లోటులే
దెను వైకిం బది లోపు ప్రాయమున నే నిప్పంటి నాయంత నిం

* టిప్పణి—ప్రాప్తకాలజ్ఞునికథ. భారతమునశాంత్యానుశాసనిక పర్వములలోఁ గలదు.

దనుక న్నేఁ జరియించుచుంటి నిటులే తక్కున్ శరత్తుల్ దొలం
గ నొసర్ప న్నిను వేడికొందు జననీ? కైమోడ్చి కామేశ్వరీ. 544

*మ॥ తనయార్జించినయార్జనన్ దినుసరుస్ ధన్యుండుగాఁ బెద్ద లెం
చిన దేఁ "గా దనఁగాని పుత్రికృత సుశ్రీభోగియౌ తండ్రి నా
తనికన్నన్" ఘనుఁ డందు, నేమనిన? వార్ధక్యమ్మునం దత్త్వచిం
తనుదక్కం గొనఁ జూతఁ జేయితరచింతన్ సూచి కామేశ్వరీ. 545

శా॥ ఈద్రైశ్వర్యము నందె మజ్జనకుఁ, డాయీ భాగ్యమున్ గాంచలేఁ
డాయె న్నాదు పితామహుం; డతనిప్పేరై నట్టి నేమాత్ర మా
యీయైశ్వర్యము గాంతునే? సుతుల నే "నింగ్లీషు"లో దింప లే
దా "యింగ్లీషు" కుమాత్ర మిప్డు గలదే? అర్థార్తి కామేశ్వరీ.546

మ॥ పనికై వారిని వీరిఁ గాళ్లఁ బడుచుం బ్రార్థించు నైచ్యంబు న
న్నును వేధింపద హూణభాష సుతులందున్ లేమి, సంతోషమే
యను కొన్నన్ బ్రకృతప్రపంచగతియో? యావత్తు"నింగ్లీషు"తోఁ
జనుచుండెన్ జనుఁగాక నాకు సిదియే సంతృప్తి కామేశ్వరీ. 547

మ॥ సుతులన్విద్యకునొప్పఁజెప్పఁడఁట; సంస్తుత్యుండుమాతాత, త
న్ని తదుల్ ప్రచ్ఛయొనర్ప "మత్సుతుల కాయీవిద్యలేమిచ్చు"మ
చ్ఛతురత్వమ్మునునేర్వఁ రాదె! అది నిచ్చల్ పేరుచేకూర్చు నం
చతఁడన్నట్టులు వింటిఁ దండ్రియిటు వ్యాఖ్యానించెఁ గామేశ్వరీ 548

♦మ. పరివారందఱుఁ బుత్రులందు బహుళైశ్వర్యంబు గల్పించుభూ
వరవిద్యల్ చదివింప నేను నిను మత్స్వాంతమ్మున న్నమ్మి దే

*టిప్పణి శ్లో. ఉత్తమం స్వార్జితం విత్తంమధ్యమం పితురార్జితం,

♦ టిప్పణి "శ్లో॥ అయు రన్నం ప్రయచ్ఛతి" శ్లో॥ యో మే గర్భగతస్యాఽ
పివృత్తిం కల్పితవాన్ ప్రభుః, శేషవృత్తివిధానాయ సుప్తః కింను మృతోఽథవా

వరహాస్యమ్ము లెఱుంగఁ జేయు మనగీర్వాణంబె శిక్షించితిన్
ధర నన్నం బిడునట్టి వాయువులె విద్యల్ గావు కామేశ్వరీ. 549

శా॥ మాతా తెంతయొ యుక్తిసంగతముగా మాధుర్యసుస్యమ్ముగాఁ
జేతోమోదకరమ్ముగాఁ బలుకు వాక్పుష్టుండు; నాకేమొ "ఆ
చాతుర్య మ్మొకకొంత వచ్చె" నని విజ్ఞశ్రేణి వాకొన్నచ్చ సే
నోతల్లీ! యెదియేని సీదయయె యం చూహింతుఁ గామేశ్వరీ. 550

మ॥ పొగరుంబోతును గాను గాని పొగరుంబోతున్ జలెన్ సంస్కార
మ్ముగ వర్తించితి "ముష్టియే"యను మదే మో "ముష్టి గా"దన్నరీ
తిగ నే నెత్తితి, సర్వ మీవెఱుఁగు దోదేవి! నిను న్నమ్మి పై
నగుఁ బాటున్ గనకుండ న న్మనిచె నానందింతుఁ గామేశ్వరీ. 551

శా॥ నూటుల్ దెచ్చిన వేలు దెచ్చినను నేనుంగుల్ గుర్రాల్ పల్లకీ
లారోహించిన నేదివో? యగుటచే నాసర్వమున్ ముష్టిలోఁ
జేరన్ "జిన్నయుఁ బెద్ద" యంచు నలవుష్టిన్ 'రెండు క్లాసులు' నవి
స్వారాట్టుల్ తుది 'క్లాసు' వా రనుచు నే భావింతుఁ గామేశ్వరీ 552

మ॥ ఒకప ల్లున్నది నాకు, విష్ణుపతినో? ఒక్కండె కన్నుండె నా
కకవీంద్రుండనొ? తెల్పు మమ్మరో? భవత్కారుణ్య మీనాకుఁ ద
క్కక దేవత్వము నిప్పుడే యిడివటుల్ గాఁదోఁచుఁ బ్రోగంబు వా
ర్థకదోషాలకుఁగూడ నబ్బె నిటు సార్థక్యంబు కామేశ్వరీ. 553

మ॥ ఎపుడున్ వ్యాధికి నర్ఘ్యపాద్యములుగా నెన్నెన్నొ మందుల్ సదీం
పపుగూటం బదిలమ్ముఁ జేసికొని నిన్ ధ్యానించుచున్ సభ ప
ద్దపు డెల్లన్ భగవచ్చరిత్రములు వ్యాఖ్యానించుచున్ [illegible]
గృహణత్వ మ్మొనగాఁ జరింతు నిది నీదే చల్వ కామేశ్వరీ. 554

మ॥ ధరణిం బూర్తిగ నేలుఁగాక ఘనవిద్యాసుంపె [illegible]
ర్తిరమన్ దిక్కుల నించుఁగాక నిను భక్తిన్ గొల్చుభాగ్యంబు చే

కుఱకున్నట్టి భవమ్ము వ్యర్థ మది చేకూరన్ భవద్దాస్యమే
పరమోపాయము దానికోసమె నినుం బ్రార్థింతుఁ గామేశ్వరీ. 555

మ॥ అది జన్మాంతరపుణ్యలేశము సహాయంబైననే గాని పు
ట్టదు కాని మ్మిపుడే "యొసంగు" మని వేడంబోను నీచిత్త, మె
ప్డు దయో దేకము గల్గు నప్పుడె వెసంబూరింపుమీకోర్కి, మె
య్యదియున్ దీనికి సాటి రా దెఱిఁగియే ప్రార్థింతుఁ గామేశ్వరీ. 556

మ॥ దయ నీ కున్ జనియించు లోపున నినున్ ధ్యానింపఁగాఁ దగ్గ వి
ద్యయు సత్త్వమ్మునుమాత్రమి మ్మవియె యాధారమ్ముగా నీదయో
దయసంపాదనకై యతించెదఁ గృతార్థత్వమ్ము చే కూరదే!
అయసంధాత్రిని నిన్ను నమ్మి చెడునాఁ డంచున్నె? కామేశ్వరీ. 557

మ॥ కొమకుల్ గూఁతులుమన్మరాండ్రిమనుమల్ గొండంతబల్గమ్ము చే
సెడి శుశ్రూషకు నెన్నిరెట్టులో భవచ్చిత్తంపు మెత్తందన
మ్మిడఁగా నేర్చు సుఖంబు; దీని కొక హద్దేలేద యేలోకమం
దడుగుం బెట్టిన వెంబడించి చనుభాగ్యం బిద్ది కామేశ్వరీ. 558

మ॥ చదువున్ సందియ సుంత సాఁగ నెటులో సామర్థ్యమున్నంతలో
గదిలో శయ్యఁబరుండి నిన్ను మదిలో గానంబు గావించుచు
న్నది నాబొంది, భవత్ప్రసాద మిటులున్నం జాలు సాధింతు నీ
పదసాన్నిధ్య, మనుగ్రహింపుము ననున్ భక్తుండఁ గామేశ్వరీ. 559

శా॥ దేవీ! నీనవరాత్రపూజలని యెం తేఁ బేర్మి నన్నున్ దెనా
ల్యావాసుల్ వణిజుల్ సభార్థ మట కాహ్వానించినా శ్నేఁడు, నా
చేవన్ బాయుట వారెఱుంగరు, భవత్సేవార్థ మవ్వారల
న్నివే ప్రేరణ సేసితేమొ! యిదియేనిక్కమ్ము కామేశ్వరీ. 560

మ॥ పరిశీలించితి నేఁటిప్రొద్దుటను మద్వ్యాధిస్వరూపంబు పెం
పఱినట్టుల్ పొడకట్టె వచ్చినది యాహ్వానంబు మధ్యాహ్నమీ

సరసత్వమ్మున్ గణించి యేగుటకు నుత్సాహంబు జన్మించె నీ
చరణారాధనమందుఁ బొల్గొనినదే జన్మంబు కామేశ్వరీ. 561

మ॥ ధనలోభం బొకఁడంకురించినది వార్ధక్యమ్ము వం దంచు నే
మును పేచెప్పితి దానికై యెటకు నేఁబోనేస్తు రుగ్నుండ నా
జనిసాఫల్యము నీయధీన మనుచున్ జర్చింతు నెల్లప్పు డీ
ఘనకార్యమ్మున స్వార్థతీర్థముల కైక్యం బబ్బెఁ గామేశ్వరీ. 562

*శా॥ రూపం బెక్కుడు గల్గు భార్య నొకశత్రుంగా బుధుల్ సెప్పి రే
నాపద్యమ్మునఁ జేస్తు రమ్యకవనం బాలాటిదే యంచు నా
కీపట్లన్ బరమానుభూతి గల దాయీ నన్వృథా ద్వేషియై
రేపున్మాపును దిట్టు మేటి యిది నేర్పె న్నాకుఁ గామేశ్వరీ. 563

మ॥ చనిమెన్ గీర్తి యొ; లేకకీర్తియొ! జగత్సంచారమున్ జేయు; దా
ని నిటుల్ రమ్మని మాఱుపుంత నడుప న్నేర్పుండునే? లోక మొ
ప్పినవానిన్ బరమేశ్వరుండయిన దేబెంగాఁ బ్రసంగించి నె
గ్గునె! తల్లీ! కడు సిగ్గుచేటుగద! యీకోపంబు కామేశ్వరీ. 564

శా॥ వెంకం డిప్పుడె పుట్టఁగా వలెనె? మద్విఖ్యాతి కష్టంకి ఆ
పొంకం బీయనకైతలే, దనుచు సభ్యుల్ పల్కువా, రంచు లో
నింకన్ జాలని యాసు పెట్టుకొని యేయేపుంతలో ద్రొక్కునీ
హంకారమ్మును నీవు మెత్తు వని నే నన్కొను గామేశ్వరీ. 565

మ॥ అవిమర్శమ్ముగ వచ్చి మీఁదఁబడిన న్నాలమ్మున న్నెట్టలే
క వృథా దూఱులు దూఱుపూన్కి గనినే దుఃఖింతునా కారర? యే
కవి యిద్దానికి సమ్మతించు నని, లోకం బుండె నీ వుంటి వి
ట్టి విరోధ మ్ముచితం బటం చెవఁడు పాటింపండు కామేశ్వరీ. 566

శా॥ నీకున్ బిల్లలు జెల్లలుం గలరు వర్ణింపంగ బల్ మేటి సు
శ్లోకుం డాపతి పుట్టినిల్ సకలమున్ లోకంబుతో పాటుగా

* టిప్పణి శ్లో॥ భార్యారూపవతీ శత్రుః పుత్రశ్శత్రు రపండితః॥

నే కన్నట్టెడి, నత్తమామ లెటనేరిగ గల్గుచో ( జెప్పనే
మో? కాంతుం డెపుడేని నీవడుగుచో యోజింపు కామేశ్వరీ. 567

శా॥ నీపెండ్లిన్ జరిగించు మాతృకలతో నీకెట్టి బాంధవ్యమో?
ఆపుణ్యాంగనలందు నొక్కరితి నీ కా నత్త గా కన్న చో
నాపక్షమ్మున మామగారెవరు? నీవాత్మేశుఁ బ్రశ్నించుతు వే
నీ పేరొక్కఁ గలండేమొ? కన్గొనుము నీవిద్దానిఁ గామేశ్వరీ. 568

మ॥ జననీ! నీదుప్రసాదమే సకలమున్ సాధించి నన్ మన్చి నం
దను లారోగ్యము గొంటకేమి, మఱియు న్నాజీవితం బెప్పుడున్
ధనధాన్యాదులలోటులేక యెలమిన్ ధన్యంబుగా నుంటకే
మి నినుం గొల్చుటె హేతు, వన్యఁ మిఁక లేనే లేదుకామేశ్వరీ. 569

మ॥ తమకున్ దగ్గని దానిఁ గోరుదురు సంతాన మ్మటం చొక్కప
ద్యము మున్ చెప్పితి దానికిన్ ఫలము సంప్రాప్తించె శ్లేషించున
ర్థము నీనెమ్మది కెక్కునంచుఁ దలఁతున్ దల్లి! మఱింకెప్పుఁ డో
కముదగ్గున్ వినకుండ జీవితము నెగ్గన్ జూడు కామేశ్వరీ. 570

మ॥ పెదకుఱ్ఱన్ గడుఁ బీడితుం బొనరించెం బిన్నప్పుడీదగ్గు, ని
న్నెదలో నిల్పి భజింప నేఁటి కది తా హెచ్చుంతయున్ దగ్గి యు
న్నది, యిప్డయ్యది మధ్యమున్ గలఁచెడి న్నాతల్లి? యేమందు నీ
పదభక్తుండను వేంకటేశ్వరుఁడ నన్ బాధించె కామేశ్వరీ. 571

మ॥ కవి వాఁ డయ్యె నిను న్నుతించి యడుగంగా నేరఁ డీరోగమున్
దవు దవ్వా గతిఁ జేసి పోవు మని; నీదాస్యానకేగాని లోఁ
గవు దూరోగము లే నెఱుంగుదును నిక్కంబింత నాకుస్తుతి కై
స్తవమున్ జేసెద వాని కామయము నిష్కాసింపు కామేశ్వరీ. 572

మ॥ పితృవిత్తం బగుకై తె యాశొమరునే ప్రేమించె దీక్షాయుష
న్నతికిం బాత్రము చేసియామము మెుగిన్ జాపవ్వగాఁ ద్రోసి సన్

గృతకృత్యం బొనరింపు మన్నిటికి నిన్నే దిక్కు గా నమ్మి జీ
వితము న్నెట్టుచునుంటి నీ కివె నతుల్ వేవేలు కామేశ్వరీ. 573

శా॥ అంబా నిన్నిపు డొండు గోరెదను నే నాజన్మమున్ బ్రహ్మచ
ర్యం బూనం బ్రయతించియున్ దుదకు గార్హస్థ్యమ్మునన్ బ్రుంగి సం
దర్భింబం చీఁతకుఁ బడ్డపోల్కి మిగులన్ దటాకు లోనైతి న
న్నుం బాలింపు మరుగ్ణతాగరిమ సంతుంగూర్చి కామేశ్వరీ. 574

మ॥ కొడుకుల్ గూఁతులుమన్మరాండ్రుమనుమల్ గోడండ్రునింకేరొ నన్
జడిపింపన్ దొరకొండ్రు రుగ్ణులయి నీసాహాయ్యమున్ జేసి యీ
బెడఁద న్నేఁ దరియించుచుంటి, మఱి నా పెంపెల్ల నీచల్వయే
"అడియన్ దాసుఁడ" నంటి సంతునకు సౌఖ్యంబిమ్ము కామేశ్వరీ.

శా॥ చీకున్ జింతయు లేని జీవితము నాశింతున్, దదర్థమ్ము మ
త్తోకమ్మున్ సుఖసంతమున్ సలిపి యప్తోకాయురారోగ్యసు
శ్రీకమ్మం బొనరించి ప్రోవు మని ప్రార్థింతు న్నినున్, వెళమే
యీకష్టన్ బ్రదికించి సాఁకుము మహేశీ! తల్లి కామేశ్వరీ. 576

శా॥ నాకున్ సంసృతిభీతి హెచ్చుఁదొడఁగె న్నానావిధాలన్, బహు
శ్రీకుల్ గూడఁ దరింప నేరనిది యీచి, కే్కను సామాన్యుఁడ
న్నీకారుణ్యముకల్మి వార్ధక మెటో నే నెట్టుచున్నాఁడ నీ
పాకంబున్ జెడకుండఁ బ్రోవుమనుచుం బార్థింతుఁ గామేశ్వరీ577

శా॥ నాకున్ గల్గిన శ్రేయ మేది యయినన్ నాశక్తిచేఁ గాదు నీ
దాకారుణ్యముచేతనే; యిదియు నేఁ బ్రాణాలతోనుండునం
దాఁక న్నిల్పి యనుగ్రహించి యెటులో "ధన్యుఁడు పేఁడన్ యశ
శ్రీకి న్ననన్ గుఱి సేయు మంచును నినున్ సేవింతుఁ గామేశ్వరీ. 578

మ॥ బెదరుం జెందుకొలంది వేగిఁగయు మెదో పెన్భాత మన్నట్లుగా
బెదరింపంగఁ దొడంగె సంసృతి ననున్, వృద్ధుండ రుగ్ణుండఁ ద్వ

త్పదభక్తుండఁ గదమ్మ; నాయెడల నిర్దాక్షిణ్యమును జూప కా
పద దాఁటించి యనుగ్రహింపు మనుచుం బ్రార్థింతుఁగామేశ్వరీ579

శా॥ బాడల్ దప్ప మృదుస్వభావు లెవ రీపాపిష్ఠసంసారమం
దుండ న్నేర రటంచుఁ దోఁచెడిని నాకోయమ్మ "ఆ"లన్న యా
దండాగొండెడియె దీని సంతతిని సంధానించు, సంసారి కీ
గండంబుల్ భవదీయమైన దయచే గట్టెక్కుఁ గామేశ్వరీ. 580

మ॥ తలఁచే, "గొంతెమకోరికల్" నిను నెడందన్నమ్మటన్ గోరుమన్
విరస మ్మాపని యం చెఱింగి, యిటులో విశ్వేశి? నేఁ గోరుటల్
తరణోపాయము వేఱు లేకయసుమీ తల్లీ; కటాక్షించి దు
స్తరసంసారము దాఁటఁజేయుము భవద్భక్తుండఁగామేశ్వరీ. 581

శా॥ ఏ రాజన్యుని నేను యాచకుఁడనై యీరీతి దీనమ్ముగాఁ
గోరన్ లేదు తమంతఁ దా మిడు టె నాకున్ జేకుఱె న్నేఁడు సం
సారం బీవృశమైన యాచకత నాసాదించె నా కెట్టులో
పారంబున్ గనఁజేయు మింతియ నినున్ బ్రార్థింతుఁగామేశ్వరీ. 582

మ॥ భరియింప న్వశమైనపట్టున నినుం బ్రార్థింప నోయమ్మ? దు
ర్భరమై యున్నది వ్యాధి, యిప్పు డెటులో బాధాపనోదమ్ము నీ
కరుణన్ గల్గవలెం గ్రిమక్రిమముగాఁ గష్టమ్ము హెచ్చె న్ననున్
దఱితో నాదుకొనన్వలెం గరిక్రియన్ రక్షింపఁ గామేశ్వరీ. 583

శా॥ నిండన్ దాపగుచుండె డెబ్బదియు నీ చేర్పెట్టిదో? యెట్టులో
గండంబుల్ తొలఁగించి ప్రోచితివి నీకారుణ్య సంపత్తి నన
బండం జేసి రుజావిపాకము భరింపన్ జేసె నాశ్చర్య మా
చుండు న్నేఁటికిమదీయజీవిత, మిదే యోగంబొ? కామేశ్వరీ. 584

మ॥ ఎనుబై దాఁటు మదీయ మాయు వనుమాటే సత్యమై యున్న చోఁ
గను మేదో సదుపాయ మూహయుము నిష్కాసించుమన్గాని; ని

న్నవిశంబు న్నుతియించుకొంచు సుఖినై యద్దాని బోసేతు నీదు క్రి.
ర్వానియోగం బొనరింప నమ్మ శరణార్థి న్ననున్ గామేశ్వరీ. 585

మ॥ చిర మాయుష్యము నిల్పి నంద్రుదు తనుపుష్టిం బట్టి; అట్లైని ము
ష్కరు లుండన్వలె దీర్ఘకాల మదియున్ గన్పట్టె, ద స్మాదృశుల్
వఱదుల్ వోలెం జిరంబు వర్ధిలుట నీవాత్సల్యమో? యేమొ? యీ
శ్వరి! నీమాయ నెఱుంగ మాదృశులకున్ శక్యంబె? కామేశ్వరీ. 586

మ॥ కలలోఁ జూచితి విష్ణుదేవళ, మటన్ గళ్యాణ మద్దాన భ
క్తులు బ్రశాన్యమ్ముగఁ బాడుకీర్తనలు, తద్గోష్ఠ్యర్థమై ధర్మక
ర్తలు నన్ బిల్చి బహూకరించి, రిది సర్వంబున్ శుభోదర్కమా
కలమై నీదయకల్మి వ్యాధి సుకరంగాఁ జొచ్చెఁ గామేశ్వరీ. 587

మ॥ సుతుని న్మన్నిచితి నన్ను మన్నిచితివి నీస్తోత్రమ్ము న న్నేచుదు
ర్గతి దూరస్థముగాఁగ నెట్టె, నిటులే గండమ్ము లెన్నేని దాఁ
టితి నీయాశ్రియణమ్ము కల్మి, రుజ పీడింపంగ నేమయ్యె న
ద్గతికి న్మార్గముఁ జూపె దీనికి నమస్కారమ్ము కామేశ్వరీ. 588

శా॥ అప్పాజోస్యుల కృష్ణశాస్త్రి కృతికై యర్థించె నీమీఁద నేఁ
జెప్పంగా దొరఁకొన్న యీకవనమే శేషించి యున్నట్లు నేఁ
జెప్పన్ సంతసమంది యిమ్మని వెసన్ జే సాచె నారోగ్యమున్
దప్పం జేయవయేనిఁ గల్గెడిఁ గృతార్థత్వమ్ము కామేశ్వరీ. 589

మ॥ పగనైనన్ వగనైనన్ నీనుతిని సల్పం బూనువాఁడేకదా?
జగదీశాని; కృతార్థుఁ, డిఁకొకరుఁడో? సర్వంసహాచక్రముం
దెగి పాలించునుగాక తుట్టతుదకున్ దీనుండె, కాఁబట్టి నిన్
బొగడంగాఁ బురికొల్పెనేని రుజయున్ బూజ్యంబ కామేశ్వరీ. 590

మ॥ దసరాపండుగునాఁటిపూజ లవిగో! దాదాపుగా వచ్చె నా
దుసమర్థత్వము గాఁచునాఁటి కది గ్రోగ్రో మాదిగా నుండ నే

పర్రిసవంబో? దళమో? భవత్పదయుగిన్ వైవన్ గటాక్షించి మా
ననత్పృప్తిన్ ఘటియింపు మింతవఱకే నాకోర్కి కామేశ్వరీ. 591

మ॥ జననీ? చిక్కులమీఁదఁ జిక్కులుగ నన్ సాధింప నుంకించుచో
మను సేలాగు? భవత్కృపారసమున న్మంత్రించి ప్రేమించి నం
దను లారోగ్యమునందున ట్ట్రానరుపన్ బ్రార్థింతు నీకన్న నెం
దును నాకున్ గనరాదుదిక్కు, శరణందు న్నిన్నె కామేశ్వరీ. 592

మ॥ ఇదియే సంసృతినైజ మేమొకో? యొకస్థేనిన్ మదిన్ భీతి తా
నుదయం బందక యుంట చొప్పడదు నీయూఁతమ్మునం జేసి యా
పదలెల్లన్ దరియించుచుంటిని, భవద్భక్తుండ నా కెంచు నుం
డదు లో" టంచు నెఱింగియున్ బడుదు నజ్ఞానానఁ గామేశ్వరీ. 593

మ॥ అవసానమ్ము సమీపమైనటులు నా కష్టపు దోఁచించి త
ద్వ్యవసాయమ్ము ముగింపు చేసెదవు నాయం దున్న వాత్సల్యమే
యవుఁగా కియ్యది వార్ధకం బగుట నీయవ్యాజకారుణ్యవై
భవ మేరీతి భుజింతు? నా వెరవెదో పాల్పోదు కామేశ్వరీ. 594

మ॥ బ్రిదుకంగావలె సంచరించుచుఁ గవిత్వం బల్లుచున్ జక్కఁగా
నది కాదేని వృథా ధరాభరముగా నాసాయ మాపాత్రితర
భ్యుదయమ్మున్ బడకింటనే గడపుటే యోగంబు నీతోడ నే
నిది మున్నే మొఱఁ బెట్టికొంటి వినినట్లే లేదు కామేశ్వరీ. 595

మ॥ కనుఁగొంటిన్ గలలోనఁ గాశిపురి గంగాతీరమున్; దానిదా
పున నే యుండిన మేడమీఁద నెదియో పాత్రమ్ము నాచే వినన్
ఘనులెల్లన్ గుమిగూడి చేసినసభన్ గన్గొంటి గంగాజలం
బున నొకం బయునంబొనర్చితి నిదే పున్నెంబొ? కామేశ్వరీ. 596

మ॥ కరుణాఘత్వముగూడ బాధకముగాఁ గన్పట్టెడి న్నాకు నె
న్నఁటు క్లేశంభళ్లు గున్న నెమ్మదిని గంపం బుద్భవిల్లున్ గాగ

స్వరసంబంధము గల్గుపట్ల నీకుఁ జెప్పన్ శక్యమే? మెల్లగన్
జిరసౌఖ్యమ్ముగ నుండునట్టులుగ నాశీస్సిమ్ము కామేశ్వరీ. 597

శా॥ యావజ్జీవము సంసరించు టొక టే వ్యాపారమై యున్నచో
నేవెంటన్ సుఖ మంద నేర్చు నరుఁ డంచీక్షించి యోచించి కా
దే? విజ్ఞానులు సన్న్యసింపఁ దగు నంచేర్పాటు గావించి రే
నా వెంటన్ జన కల్లవారిసుఖమున్ యాచింతుఁ గామేశ్వరీ. 598

మ॥ ఎలమిన్ వడ్డన సేయువాఁడు తనవాఁడే యైనచోఁ దాను ప
వ్వలఁ గూర్చుండియు భక్ష్యభోజ్యములు సంపూర్ణమ్ముగా మెక్కిన
గ్గిలి నీకున్నపు డేనెవం డయిన నేమీ? నాకు సన్న్యాసికిన్
బలె నుచ్చైర్గతి కల్గఁ జేతువనుచున్ భావింతుఁ గామేశ్వరీ. 599

శా॥ "స్త్రీ" యన్పించి వచించె ధూర్జటి కవిశ్రేష్ఠుండు "సంసార మేఁ
జేయుం జాల విరక్తుఁ జేయు" మనుచున్ "జక్కంగ నంచా వియుం
దాయార్యుం డెటుఁ గండొ? తుట్టతుద కిట్లన్కొన్నచో లాభ మే
మీ? యంబా? యిది "సిగ్గుసి"గ్గనుచు లో నే నెంతుఁ గామేశ్వరీ 600

మ॥ కడుఁ జిక్కుల్ వడుచుంటి నా యెడల నీకారుణ్యము న్నించి నా
పడుకట్టిన్ దొలఁగించి ప్రోవుమనుచున్ బ్రార్థింతు నావంత యీ
యెడ నావంత యెడంద నిల్పికొని నన్నీడేర్పు మోయమ్మ? నా
బుడుతన్ మన్పఁగదమ్మ! దగ్గు త్వరలోఁ బోనెట్టి కామేశ్వరీ. 601

మ॥ కొడుకుల్ కూఁతులు మన్మరాండ్రు మనుమల్ కోడండ్రు నల్లుండ్రు ప్రియ న
ల్గడలన్ బంధులు గల్గువాఁడు సుఖియై కాలమ్ము వోనెట్ట ని
యెడుగుల్ దక్క శరణ్య మెయ్యది గలదే! అంబా? కటాక్షించి నా
బుడుతన్ దగ్గెడఁ జేసి, ప్రోవుము నినుం బూజింతుఁ గామేశ్వరీ 602

మ॥ ఎవరే దగ్గినఁ దుమ్మినన్ వెఱతు నే, నేనంవిధంబైన భీ
అవివేకం బగ్గుఁగాక నా కిది యెటో అభ్యస్తమయ్యెన్ జనా

భవుఁ డాద్యుం డుపదేష్ట దీనికి, నినుం బ్రార్థింతు నీధ్యానమున్
జెవికిన్ సోఁకఁగ నీకు మమ్ము? యెపుడున్ జేమోస్తుఁగామేశ్వరీ 603

మ॥ గురుఁడున్ మందుఁడుఁ గూడి యష్టమమునన్, గోచారరీతిన్ భోరిన్
బోరిఁ బీడించుచునుండి, రిట్టిదురితమ్ము న్నీకటాక్షమ్ముచే
నరికట్టన్వలెఁ బెద్దకుఱ్ఱ కిటులే ప్రార్థించితిన్ బ్రోచి తి
త్తతి నట్లే దయఁ జూపు మంబరో? భవద్దాసుండఁ గామేశ్వరీ 604

శా॥ యుక్తాహారవిహారముల్ సురిఁగె నాయుష్యంబు లో దేవతా
భక్తిజ్ఞానము లేడకో జరిగె నే ప్రాచీనులో దేవతా
భక్తిన్ రోగములన్ గలంచిరని చెప్ప న్నమ్మరెవ్వారు నీ
భక్తిస్ఫూర్తిని సర్వరోగములు పాప న్వచ్చుఁ గామేశ్వరీ. 605

మ॥ తనయుండే యననేల? యెవ్వఁ డయినన్ దగ్గన్ మొదల్ వెట్ట ఏ
తనయుండో నరియేని నాకు మదిలోఁ దాపంబు రెట్టించు నీ
గొన మెట్లో పెదకుఱ్ఱ బాల్యమున నంకూరించె న న్నీరుజా
ధ్వనికిన్ దూరగుఁ జేసి ప్రోవుమని నిన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ 606

మ॥ బెజవాడన్ గిరి నున్న నిన్ గొలుచుచుప్పై వీఁడుద్భవంబందె నీ
నిజనామమ్మగు దుర్గయన్ననుడి వీనిం బిల్చెదన్ వీనిపై
స్వజనుం డం చభిమానముంచి కృపతో సాఁకన్వలెన్ వేగ నీ
రుజుఁ గావింపు మనుగ్రహింపుము రుగార్తుం బుత్రుఁ గామేశ్వరీ 607

మ॥ తెలిసెన్ జాతకమందు నిట్టిరుజ కేదేఁ యోగమున్నట్లు నీ
బలిమిన్ బట్టి జయింపవచ్చునని సంభావించుకొన్నాఁడ నే
కలుషంబేనియు నీజపమ్ముకతనన్ గంగారుగాఁ బాఱు ని
క్కలిలో నింతకు మించి సాధనము నేఁ గన్గొను గామేశ్వరీ. 608

శా॥ సంతుం గోరనివాండ్రు సైతమును సంసారప్రధానంబు త
త్కాంతాసఖ్యము సేవగించు టెచటన్ గస్పట్ట దేలాటి వి

భ్రాంతిన్ గల్పన చేసితో? యెఱుఁగగా రాదంబ? నాకుత్త ధీ
మంతున్ బ్రోచితి దగ్గుఁ బోనడఁచి నేయుంబయ్యెఁ గామేశ్వరీ. 609

శా॥ సంతానమ్మును గాంచు తండ్రు లెటులో సంతాపమున్ బొంద శ్రీ
మంతుల్ గొందఱు సంతు గల్గమి నొయుం బ్రార్థించి కైకొండ్రు త
త్సంతానమ్మును దత్తుగా, నెవసికో తక్కన్ విచారింపఁ ద
త్సంతానమ్ము సుఖప్రదంబగుటఁ గాంచంబోము కామేశ్వరీ. 610

మ॥ తనసంతానమునందు నాత్మగుణసందర్భంబు చూపట్టు టొ
ప్పునుగా కెవ్వని కట్టినో గొనినఁ దత్పుత్రుండు తా నత్తకుం
డినఁ జింతించుటకిన్న వెట్టి యొకఁడున్నే? వీరలంగూర్చి యే
మనవచ్చున్ సుఖులెవ్వరో? తెలుప శక్యంబౌనె? కామేశ్వరీ. 611

శా॥ సంతానమ్మనకే వివాహ మనుచున్ శాస్త్రంబు వాకుచ్చు నే
పాంతంబందును సట్టి విప్పుడు గనన్ రావంబ? పెండ్లింప్లు, దు
ర్దాంతాభీలవయోంధకారమునకే దాంపత్య మాపై నెటో
సంతున్ గల్గు నినున్ భజింపఁ గలుగుఁ సౌఖ్యంబు గామేశ్వరీ 612

(సశేషము)

ఇది శ్రీ తిరుపతి వెంకటీయము సౌభాగ్యకామేశ్వరీస్తవము—

సమస్తసన్మంగళానిభవంతు.



శ్రీమత్పరదేవతాయైనమః
శు భ మ స్తు — అ వి ఘ్న మ స్తు

# కృతిసందర్భము

ఉ॥ ఈగతి నింటివేల్పు పరమేశ్వరి శ్రీజగదంబఁ గూర్చి సౌ
ఖ్యాగతి యీయిహాసఁ బరమందు గడించుతలంపుతోడ "నీ
వే గతియంబ? బ్రోవు"మని యేవియొ? వెట్టిగఁ బద్యముల్ కవి
త్యాగమవేది వెంకనమహాకవి తా రచియించుచుండఁగన్. 1

క॥ అప్పాజోస్యుల వంశ్యుఁడు, విప్రాగ్రణి సాహితీవిశేషకవనపుం
గొప్ప నెఱింగిన యోగ్యుండప్పాడు ననుఁజూడవచ్చె నత్యాదృతితో.

క॥ తనతోఁ బ్రితాపకృష్ణుం,డనునామకశిష్యుఁగూడ ననుఁగనఖునిగాఁ
గను వెంటంగొనివచ్చెన్ ఘనుఁడగునాకృష్ణశాస్త్రి కడియమ్మనకున్. 3

వ॥ గుంటూరుడిస్ట్రిక్టు చీరాలగ్రామమునుండి సప్రయత్నమ్ముగా వచ్చిన యావృద్ధపండితుంగాంచి గారవించి యాతండునభక్తికమ్ముగా నిడిన ఫలపుష్పాదికమ్ములను సాదరమ్ముగఁ గైకొని యుచితాసనమ్మునఁ గూర్చుండ నియమించి యథావైభవమ్ముగ నతిథిసత్కారం బొనరించి స్నానసంధ్యాద్యనుష్ఠానంబులొనర్చి భుజించి విశ్రమించి గతప్రయాణపరిశ్రముఁ డయిన యయ్యతిథికే నిట్లంటి. 4

తే॥గీ॥ చాల దూరమ్మునుండి యిచ్చటికి మీరు
వచ్చితిరి పెద్దపనియుండవలయు మిమ్ము,
నలప్రజోత్పత్తివత్సరమందుఁ గంటి
జ్ఞప్తిలో నుండె మీచేయు గౌరవంబు. 5

వ॥ నేను నూజివీటిసంస్థానమ్మున సప్రశ్రిచ్ఛాత్రమ్ముగా నున్న సమయమ్మున మీరు మాయూరు నానిమిత్తము వచ్చుటయుఁ బిమ్మట

నేనున్నచోటు వెదకి కొనుచు నూజివీటికే తాము వచ్చుటయుఁ బిదప నక్కాలమ్మున మీగ్రామమ్మున జరుగుచున్న శ్రీకూర్మదాసు గారి సప్తాహమహోత్సవమునకు మీచే నాహూతుండనై నేను సపుత్రచ్ఛాత్రముగా నూజివీటినుండియే వచ్చుటయు నన్ను మీరు రైలుస్టేషనునుండి మేళతాళములతో గజారోహణాది సమ్మానములతో భవద్గృహమ్మునకుఁ దీసికొని యేఁగుటయు నయ్యెడ జరిగిన నాయుపన్యాససభలును అది యిది యననేల? అప్పటి సర్వంబును నాకు జ్ఞప్తియందున్న యది—అది యటులుండె. 6

తే॥గీ॥ మొన్న వేసవిలో మీరు నన్ను సబహు
మానముగఁ బిల్వనంపినమాట శిష్యు
డీతఁ డెఱింగించి చెప్పె నే నెండకాల
మగుటచే రామిఁ దెల్పితి నది యటుండె. 7

క॥ మీదత్తపుత్రికుం డా, మోదమ్మున నున్నవాఁడె? ముఖ్యమ్ముగ వి
ద్యాధృతి వానికి గలదే?, యేదియిచటికిరువచ్చు హేతువు చెపుఁడీ. 8

క॥ "ఊరక రారు మహాత్ములు" కారణమే దేని యున్నఁగాని యనుచునే
నారంగ నడుగుటయునల, ధీరాగ్రణినాదుశిష్యుఁ దెలుపుమనవుడున్.

వ॥ ప్రతాపకృష్ణమూర్తిశాస్త్రియు సవినయమ్ముగ నిట్లని చెప్పం దొడంగె, మహాశయా! యీయలఘుండు చీరాలపురమ్మున నుండు బ్రాహ్మణ సంపన్నగృహస్థులలో నొక్కండు విద్యావినయధురీణుండు, ఆపట్టణమ్మునందలి సంపన్నులగు వైశ్యాగ్రిణులకెల్ల నీయన యం దపరిమితగౌరవము, పేరికవ్వారల కీతఁడు పురోహితుండయ్యె నయ్యాది పూర్వకాలమర్యాదలు గలవిగాని "చక్రే ధాతా పురోహితమ్" అను శ్లోకార్థమునకు గుఱి కాఁదగినది కాదు. ఇమ్మహితుని యెడ మాప్రాంతవాసులెల్లరకును బేరిమి మెండు. మఱియు నియ్యలఘునకు సుబ్రహ్మణ్యాభిధానుండు కడుంగడుఁ బ్రాజ్ఞుం [illegible]

దుదకు దైవదుర్విలసితమ్మునకతన లేనివాఁడై యయ్యె నేమి సెప్పుదు నప్పటినుండియు సప్తసంతానములలో "ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియె" యను మనుచరిత్రపద్యము స్మృతికిఁ దగిలెం గాని మనబోట్ల కంతటిభాగ్య మెట్లు చేకూరునని యెంచి తత్ప్రయత్నమునకుఁ గడంగఁడయ్యె, అదియునుంగాక యీయనకు శేషమ్మయను నొకపుణ్యస్త్రీ కొమార్తె గలదు. ఆమెకుఁ బుత్త్రుఁడు కలిగినచో—

"విద్యతే యది సుతాపుత్రి స్స పౌత్రంభవే న్మతేః పుత్రిణపవ॥"

అను న్యాయానుసారముగఁ దరింపవచ్చు ననియు నెంచెంగాని ఆమె కింతవఱ కొక్కపుత్రికతక్కఁ బుత్త్రభాగ్యము లభింపదయ్యె. ఆమె భర్త మాకుఁ బరమాప్తులు శ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారి స్యాలకులు పాతూరి రోశయ్యగారిని దామెతిగియే యందురనుకొందును. అక్కతన నీయార్యునకుఁ బున్నామనరకోత్తరణమ్మునకై దత్తపుత్త్ర స్వీకారం బనివార్యంబయ్యె, నాసమయమ్మునఁ దమ్ము రప్పించి తమ వలన నేదేని కృతిఁగైకొని సమ్మానించి భవదాశీర్వచనము నందవలె నని నన్నుఁ దమసన్నిధి కంపుట తమ కెఱిఁగినదియే కాన విస్తరింపను. ఈయనకు దత్తపుత్రస్వీకారమాత్రమున మనము శాంతాకాంక్షమ్ము గాదయ్యె.

చ॥ పితరుల సద్గతిన్ గుఱిచి పెంచికొనందగు నెవ్వరేని నేఁ
టితులువబాలకుల్ వలువుఁకీవుల కేమతరమ్ము లిట్టటుల్
గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కమ్ము సం
తతికి ఫలమ్ము వోవుతఱి దాపరమయ్యె నికేటిదత్తతల్.

ఈపద్యము తమదియే కాన నిందలికష్టసుఖమ్ములు వివరించుట పునరుక్తప్రాయంబ యగు, నాద్వారమ్మునఁ దమకుఁ దనమనోరథమ్ము న్నివేదింపఁ దలఁచి నాతో నిఖిలమ్ము వాకుచ్చి వెంటఁబెట్టుకొని

యరుగుదెంచె. పిమ్మట సర్వమునకును దేవరయే ప్రమాణము అని మఱియును 10

క॥ కని పెంచి పెద్దఁ జేసిన
తనయులె యిక్కాలమందుఁ దమకు
విహితమగు పనియెడ విముఖత చూపుట
యనుభూతము తడవనేల యావిషయమిఁకన్. 11

చ॥ బెడఁదకె గాని పిండ్రఁగని పెంచుటయున్ గొని పెంచుకొంటయున్
గొడుకులవల్ల సద్గతులు గొన్నగృహస్థులు చాలఁ దక్కు, వి
య్యెడఁ దమ లేదొ పౌత్త్రమున నించుక చర్చ యొనర్చి "ప్రాజ్ఞులీ
గొడవకు సమ్మతింప"రని కూడ లిఖించుట నే నెఱుంగుదున్. 12

వ॥ నేనకాదిమ్మహితుండును దమపౌత్త్రమ్మునందలియావిషయంబు సమగ్రమ్ముగఁ బఠియించినవాఁడే యని వెండియు. 13

క॥ ఈవిబుధు భార్య మిగుల ద
యావతి సుగుణాలవాల యభ్యాగతపూజా
వేళిని పున్నమ శ్రీ
దేవికి సాటి యగుఁ గదుఁ బతివ్రతయనఘా? 14

క॥ పతికిన్ బలె నాయమకున్
గతియెడఁ గౌతుకము కలదు కృతకృత్యత మీ
కతనం గలుగవలయు నని
మతిమంతుం డతఁడు వల్కె మఱి యిట్లనియెన్. 15

వ॥ ఈ కృష్ణశాస్త్రిగారికిఁ దామొనర్చినగ్రంథమ్ములన్నియుఁ గంఠపాఠము, ఈయనపాండిత్యము శ్రుతమాత్ర పాండిత్యము గాదు. గురుశుశ్రూషాపూర్వకమ్ముగ నాయాయీ విద్యల సభ్యసించె, జ్యోతిషము స్కంధత్రియమును శ్రీ కుప్పా నాగేశ్వరశాస్త్రులవారియొద్దను, స్మార్తము లోనైనవి శ్రీమల్లాది హనుమదవధానులవారి యొద్దను

బండ్లమూడి రామశాస్త్రిల వారియొద్దను, బండ్లమూడి గురుమూర్తి శాస్త్రిలవారియొద్దను సుగృహీతనామధేయులు శ్రీమల్లాది రామకృష్ణ చయనులవారియొద్దను నభ్యసించె, మొదటిగురువు తండ్రి గుండయ్యా గారే చాలవఱకు విద్య నుపదేశించిరి. పిమ్మట నేలపట్ల శేషయ్యా జ్యోస్యులు కొంతకాల మొజ్జతిక మొనర్చిరి. 16

*క॥ పలుమంది గురూత్తములం గొలిచి
యనుగ్రహము వడసి కోవిదుఁడై యీ
యలఘుఁడు ధనధాన్యాదులఁ
దులఁదూఁగెడి నితనిఁ బోలుదురె సామాన్యుల్. 17

క॥ ఈతని వంశం బెంతయుఁ బూతము శ్రోత్రియతచేఁ బ్రభూతము వి
ద్యాన్వితుండుగానిపూరుషుఁడీతజ్ఞునివంగడమున నేలేఁడెందున్. 18

---

*ఏతత్కృతిభర్తృకృతకాళయుక్తి సంవత్సరపంచాంగపీఠికనుండి

అథగురునమస్కారః.

శ్లో॥ శ్రీమచ్ఛ్రీరామచంపూమణిముఖ కృతికృద్బండ్లమూడ్యన్వయ శ్రీరామ స్వామిశాస్త్రీ ప్రథమగురురభూన్మామకేకావ్యబోధే। వ్యాఖ్యాతాతత్కృతీనాం తదనుజ తనుజస్తర్కవేదాంతదక్షః। పశ్చాదాసీద్గుర్మేగురుపదసహితోమూర్తిశాస్త్రీకృతీంద్రః॥ శ్లో॥ మల్లాద్యన్వయరామకృష్ణవిబుధో మంజూక్తిపుంజాకరః శ్శాస్త్రార్థవ్యాహతకౌశలః ఖలమతప్రధ్వంసమధ్వప్రియః। యజ్వావిద్వదుదారభూపతి సభోపన్యాసధన్యాత్మక। స్తార్తీయీకగురుర్బభూవమమసత్సాహిత్యశేషోదయే॥ శ్లో॥ స్మార్తకర్మప్రబోధేభూత్।గురుర్మేసుగిరాంనిధిః।మల్లాది వంశ్యహనుమద్వధానీబుధపుంగవః॥ శ్లో॥ జ్యోతిషశాస్త్రేభాగత్రియమాస్తే తత్రమత్ప్రథమైవాదౌ। గురురభవచ్ఛేషాంశే గురురభవన్నేలపట్ల శేషజ్ఞః॥ శ్లో॥ ప్రఖ్యాతశాస్త్రప్రతిభాస్వతంత్ర కుప్పాన్వయో మేగురురంతిమోఽభూత్।నాగేశశాస్త్రీనిఖిలేఽవశిష్టే। సిద్ధాంతభాగేశివతాతిమూర్తిః॥ శ్లో॥ దివ్యాశీస్సుప్రదానవాప్పిలసత శ్శిష్యప్రశిష్యైస్సదా। దీవ్యద్దేవమునీట్సమానవిమలబ్రాహ్మీప్రసన్నాత్మనః। శస్త్రౌవాపిషుభపరిశంసనపరాన్ క్షేమంకరశ్రీధరా। నేతాన్నిత్యమహం గ్రసేద్దృఢతరం। క్షేమప్రద్విద్వాన్ గురూన్॥

*సీ॥ తండ్రి గుండయ స్మార్తధర్మమ్మున నేర్పరి
తల్లి నరసమ అన్న దాసరక్త
తాత సీతయ ధర్మశాస్త్రజ్ఞుఁ డాయన
భార్య వెంకమ యొజ్జబంతి సతుల
కెల్ల బుస్సంభట్టుఁ డెల్లవిద్యలకు ని
కులఘువిముత్తాత యతనిపత్ని
అయ్యరుంధతిసమ మణమ్మ యాయమ పేరు
బుస్సమభొట్టుకుఁ బూర్వుఁడైన 18

తే॥గీ॥ అల్లకృష్ణమభట్టు బ్రిహస్మనతార
మయ్యనఘుతండ్రి నరసభట్టాహ్వయుండు
పేరుభట్టితనికిఁ దండ్రి వేదవేత్త
అన్వయంబెల్ల భట్టమయంబ కనుఁడు. 19

తే॥గీ॥ కృష్ణభట్టుని భార్య యుత్కృష్టచరిత
శేషమను సాధ్వి నరసమునీషి భార్య
పేరు కామేశ్వరీదేవి మీరలాపె
పేరి కనువగు కృతి సింధుదారహృపయా. 20

---

దైవజ్ఞవంశావళి.

శ్లో॥ బ్రహ్మశ్రీలలితాంకురే శృతిగృహే శ్రీవత్సగోత్రేమహా, త్యాపస్తంబోశ్యమహాన్వయే సమజని శ్రీబుస్సభట్టస్సుధీః । మణ్యంబాపతిరస్యసీతయబుధ స్తస్యప్రియో వెంకమాంబా ప్రియో । జాతస్తస్యసుతః పితామమబభౌ గుండయ్యహార్తాంతికః। శ్లో॥ సధర్మత్తంత్రమర్మజ్ఞః కర్మఠః కులదీపకః। దేశికేంద్రపదాంభోజమకరందరసబంభరః। శ్లో॥ యన్మాతానరసాంబికా, పతిపదన్యాసక్తచిత్తాంబుజా। యత్పత్నీ గిరిజాపదాబ్జనిరతా పూర్ణాంబికాఖ్యాయుతా। విద్యాసంగ్రహణోత్సుక స్సహనుమాన్యత్పోదరస్సాస్యధీ । సోహం కృష్ణయనామకో గురువరాశీర్వాదకాంక్షామతిః।

క॥ మాఁతామహుఁడో? సుగుణ
ఖ్యాతుఁడు వెంకన్నభట్టు
కడు సౌభాగ్యోఁడీఁకన్ మాతామహియు మహాల
క్ష్మీశతస్వినామధేయ చెయ్యోలు సవిధే. 21

క॥ కృతికర్తన వీరినెల్లరఁ
బ్రతిష్ఠితులఁ జేయనెంచి భవదీయగృహం
బితఁ డరుదెంచెం దమ రీ
కుతూహలము దీర్పవలయు గురునాథమణీ. 22

తే॥గీ॥ ఎవరినో! గోరఁ గృతినిత్తు రీకపోరు
విజ్ఞఁ డీయన యొకపాటి వేత్త నచ్చఁ
జెట్టులో మిమ్ము యాచించి కృతిని గొనుట
కే కుతూహల మీయన కెంతో కలదు. 23

క॥ తనకున్ దానయివచ్చినఁ
గొనసాఁగునో? లేదో? తనదుకోర్కె యనుచు న
న్నునుగూడ వమ్మనియె నో
యనఘా? యీయన కృతార్థుఁ డగుఁగా కనుడున్. 24

వ॥ ఏమియున్ దోఁపక శిష్యునితో నే నిట్లంటి. 25

ఆ॥వె॥ కృష్ణశాస్త్రిగారు కీర్తికాములు వారి
వాంఛ యెంతయేని వర్ణనీయ
మిపుడు నేఁ బ్రబంధ మేమి చెప్పఁగనేర్తు?
నిపుడుకాద వయసునేడనె యనుము. 26

క॥ ఒకజన్మమునకు నొకకవి
యొకఁడె ప్రబంధమ్ము చెప్ప టొప్పెడి మఱి వే
ఱొకటి రచించిన నయ్యది
సుకవిహితం బగుట యెపుడుఁ జొప్పడ దనఘా? 27

వ. భట్టుమూర్తిజన్మమునకెల్ల నొక్కవసుచరిత్రమునకే పేరు వచ్చినది. ఆంధ్రకవితాపితామహునికి మనుచరిత్రమే చేమకూరకు విజయవిలాసమే ఆ యీ కవులు మఱియుం గొన్ని ప్రబంధములు రచించియున్నను, అయ్యవికూడ రసవంతమ్ములై యయ్యు వానికి నంతగా లోకమ్మున గణ్యత కనుపట్టదు, నాటకములు రచించుట కన్నఁ బ్రబంధరచనలోఁ గొంత చిక్కు కలదు. అది యనుభవైక వేద్యము:— "నాటకాంతం కవిత్వమ్" అని యున్నను, అయ్యది కవితా చమత్కృతితో సంబంధించిన యభియుక్తోక్తిగాని ప్రస్తుతమునకు సంబంధించునట్టిది కాదు. ప్రబంధమనునది మన పూర్వులశాసనములం బట్టి చూచిన నష్టాదశవర్ణనలతో నుండవలసి యుండునుగదా? ఒకపరి నగరాదివర్ణనలొనర్చినకవి మరల వానినే వర్ణింపవలసి వచ్చిన యెడల నెటులుండునో? విజ్ఞులగు సువక్కృష్ణశాస్త్రి గారికి నేను వివరింప వలసి యుండదు. వసుమనుచరిత్రలయనంతరమున నెందఱో మహాకవులెన్నియో మహాప్రబంధముల రచించియున్నను అందే యొకటి రెండో తప్పఁ దక్కినవి లోకాదరణపాత్రములు కాకపోవుటకుఁ గారణము వానియందు నూతన విషయము లేకుండుటయే యని పలువురు విమర్శకు లభిప్రాయపడుటలో సత్యము లేకపోలేదు; బాగుగనున్నను నుండకున్నను నాటకమైనచో నెట్లో రచన సాగింప వచ్చును. ప్రబంధమునకో మొదట రచనకే అడ్డు తగిలినట్లగును. శ్రవణానందరచన నాఁటికి మా కిట్టి చిక్కు లేకపోయినది. ఇతరకవుల ప్రబంధములు బోలెఁ డున్నను మేము వాని ననుసరింపకయే దాని రచన కొనసాఁగింప వలయునని యెంచికొని సాధ్యమైనంతవఱకు వారు విస్తరించిన వర్ణనలను మేము క్రోడీకరించియుఁ గొన్నిటి నసలే వదలుకొనియు నెట్లెట్లో క్రొత్తపోకడగాఁ దుదముట్టింపవలయునని ప్రయత్నించితిమి. కొంతవఱకుఁ గృతార్థత్వము కలిగినట్లు దానివ్యాప్తివలన మాకుఁ

గూడ గోచరించెడిని, తదనంతరము మఱికొన్ని ప్రబంధములు లక్షణా పరిణయాదులు మేము రచించక పోలేదు. అయ్యవి వారివారికోరికం బట్టి రచించినవి. ఆగ్రంథములకు దీనివంటి పేరుప్రతిష్ఠలు లేవు. కలుగునని మే మనుకొనను లేదు. ఆ యీవిషయముంగూర్చి తెలుపవలసి వచ్చుచో నెంతేని యుపన్యసింపవలయును. ప్రకృత మనుసరింపుదము. మీ రేదియేని కథచూచుకొని రచింపుమన్న నెట్లో రచించి యీఁగలనేమో! కాని అంబుగణయశ్రీప్రసాదములదక్క మీవంటి రసజ్ఞుల కానందమ్ము గలిగించు నంశముండుటసంశయాస్పదము. అది యును గాక వేఱొక్కటి నాయనుభవమునకు సంబంధించినది వచింతు.

క॥ తనకుం దోఁచినయంశ
మ్మునఁ గవనము నడచెనేని ముద మది యిమ్మఁగా
ధనమున కని యెవరో కో
రినదానింగూర్చి చెప్ప కృతి హిత మగునే. 28

వ॥ "మాఘే మేఘే గతం వయః" అను వాక్యము మీరు విననిది కాదు గదా! యని యేమేమో! నాకుంగలసందియములు వెలిబుచ్చునెడ నాయన యిట్లనియె. 29

క॥ నాకున్న వాంఛితం బది మీకతనం దీరు ననియె మిక్కిలి పేర్మిన్
మీకడ కే నే తెంచితి నాకోరిక దీర్పవలయు నాపుకు సేయన్. 30

వ. అయ్యా! అశక్యంబగు మీకోరికం దీర్చుటకు నేనును బరిపరివిధముల నాలోచించుచుంటిఁ గాని నా కింతవఱకు నుపాయంబు పొడకట్టదయ్యె. నేనప్పుడప్పుడు కామేశ్వరిపై నాయారోగ్యమునకయి యేవో స్తుతిప్రయుక్తంబులగు పద్యమ్ములు వ్రాయుచుందును. నేఁటికి రెండేండ్లనాఁడు మొదలిడిన ఆపద్యంబు లిప్పటికి నుమారు వేయికి దాదాపుగా నున్నయవి. ఇవి యావజ్జీవమును నప్పుడప్పు డిట్లు నడచుచునే యుండును గావున జీవితకాలమ్మున నీనవన నశేషావస్థలో నే

యుండెడిది. ఇది తమకు నచ్చినయెడల నెట్లో పీఠికవ్రాసి యిత్తునని యందలి పద్యమ్ములు గొన్ని వినిచితిని. అరసజ్జుం డవి విని పరమానంద భరితుండయ్యె. నవల నీయాశీఃపద్యములు చేరిచి కృతి యిచ్చు నాచారము నిర్వర్తించితిని అవి యుదాహరించెద. 31

శా॥ అప్పాజోస్యుల వంశదీపకు ననర్ఘాచారునిన్ సాహితిన్
మెప్పందం దగువానిఁ బుత్రిసహితున్ మేలైన సంపత్తి నే
కప్పున్ లేక సుఖించువాని ననఘున్ జ్ఞానిన్ సదారున్ యశం
బొప్పారన్ భగవంతుఁ డేలుతఁ జిరాయుస్సద్యశోదాయియై. 32

తే॥గీ॥ వృద్ధుఁ డగునప్పజోస్యుల కృష్ణశాస్త్రి
కేవిషయమున లోటించుకేని లేని
షక్కి జగదీశ్వరుండు కృపాళుఁడగుచు
మనుచుఁగాక యితోఽధిక ఘనత నొసఁగి. 33

మ॥ తనకైకొన్నసుతుం డుదారగుణుఁడై ధర్మిష్ఠుడై గోత్రవ
ర్ధనుఁడై దీర్ఘతరాయుషై యనఘుఁడై తల్లిన్ గడున్ దండ్రినిన్
వినయానన్ గనువాఁడునై నెగడ నావిశ్వేశ్వరుం డెప్పుడున్
మనుచుంగావుత విద్యదీర్ఘ్యమగు సంపన్నత్వ మింపొందఁగన్. 34

మ॥ పలుకుందొయ్యలి తోడు నీడ యయి యప్పాజోసి గేహమ్మునన్
నిలుచుంగావుత మప్పజోసి కిమత నీ్న రేజగర్భుండు పు
ష్కల మాయుష్యము, సంపదృద్ధినిరమాకాంతుండుమాయప్ప జో
స్యుల కిచ్చున్, యశమిచ్చు జోసికి మహేశుండర్పితారోగ్యుఁడై.35

క॥ తాతా! యని పిలిచెడి పౌ
త్రాతులు మనుమలును మనుమరాండ్రును జేతః
ప్రీతి నెగడింప నప్పా
జ్యోతిర్విత్కులుఁడు సిగుల నొందుంగాతన్ 36

ఉ॥ వైదికధర్మవర్తనకు వన్నియ వెట్టినభాగ్యశాలి సం
పాదితవిస్తృతోరుమర్యాదనపాయ యశోऽవ్జసబర్హ బుద్ధి నిః
ఖేదుఁ డనూనకవర్తనుఁడు గేయగుణాకరుఁ డప్పజోసిదా
మోదుఁడు వర్ధిలుం జిరతరాయువుతో సిరితో యశస్సుతో. 37

క॥ వృశ్చికలగ్నోద్భవుఁడు విపశ్చిత్కులపాదభూళి పావితగేహుం
డాశ్చర్యకృద్వివేకుఁడునిశ్చింతుఁడు కృష్ణశాస్త్రి నెగడుం గాతన్. 38

మ॥ "ఇలువే" ల్పంచును నే సదా గొలుచు కామేశీమహామాత ని
ర్మలు శ్రీవత్సనగోత్రు సంచితగుణున్ మాన్యోత్తమాచారు శ్రీ
వెలనాట్యన్వయశోభి నిశ్చలయశోవిజ్ఞాననానక్తు న
ర్మిలి రక్షించుత మప్పజోస్యులకులున్ గృష్ణాభిధానున్ ఘనున్. 39

క॥ సామాన్యగృహస్థులలో
నేమాత్రమొ? మేటి యితఁడు కృతి గొనుటకు? సు
శ్రీమంతులపని దానికి
నీమహితుం డిచ్చ నేసె నిదుటఁ గొప్పఁగదా. 40

చ॥ కృతి యిడె నంట కర్థమును యిప్పు డెఱుంగరు చాలమంది; పం
డితులయవస్థ యిట్టు లగునేనియుఁ బామరులైనవారిఁ గూ
ర్చి తడవనేల? అంకితము చేసెడివారికి సోమయాజి ప
ద్ధతి యొకటే శరణ్యముగనై నడిపించినయట్లు తోఁచెడిన్. 41

వ॥ అయ్యది యాదికవి నన్నయ మార్గమున కొక్కింత భిన్నమే యైనను నాదరణీయంబు గాదని ప్రాజ్ఞు లెవ్వరుగాని పలుక సాహసింపరు. ఇటీవలి కవులలో నాయెఱిఁగినంతలోఁ బిల్లలమఱ్ఱి వీరభద్రుఁడుతప్పఁ దక్కినయావదాంధ్రమహాకవులును నదే మార్గమ్మునఁ దమతమ కృత్యారంభములను జరిపించు నట్లగుపట్టెడి, ఈయను కర్తల్లో నేకొందఱో తప్పఁ బలువురు సోమయాజులమార్గమున కర్థము

చేసికొనినట్లు గూడఁ గనుపడదు. ఆయన "షష్ఠ్యంతములు రచించెఁ గాన మనమును షష్ఠ్యంతములు రచింపవలయును మఱియు నాయన కృత్యాదిని స్వప్నమును వర్ణించెను గావున మనముగూడఁ గృత్యాదిని స్వప్నమును వర్ణించియే తీరవలయునని స్వప్నవర్ణనము చేసిన కవులును గొందఱు లేకపోలేదు. వెండియు షష్ఠ్యంతములకును "అభ్యుదయపరంపరాభివృద్ధికిని దఱచు సమన్వయ మగుట కలదు. కాని సమన్వయింపనిపట్టునఁ గూడ "గతాను గతికము"గాఁ జతిృంచినకవులును లేకపోలేరు—తా నెవరికిఁ గృతి నిచ్చునో? ఆయనకు నభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లు" అనెడి తాత్పర్యముతో షష్ఠీవిభక్తితో నొక మాట వ్రాయుచు నాషష్ఠ్యంతమునకు విశేషణములుగా నుండుపదములు గొన్నిటిని జేర్చుచు గ్రంధకర్తలు తమకుఁ గల సంస్కృతపాండిత్యమును విశేషించి ప్రదర్శించుకొనుటకూడఁ దుదకుఁ గవుల కొక కృత్యాద్యవస్థగనే పరిణమించినది. అచ్చ తెలుఁగుకబ్బముల వారికి కుతూహలము నెఱవేఱక పోవలసివచ్చివారుకూడ మానక అయచ్చ తెలుఁగుమాటలలోనే కొన్ని కఠినములగు మాటల నేరి కృతకృత్యులగుచు వచ్చిరి. ఆయీ సందర్భములతత్త్వ మెఱుంగని జ్ఞానలవదుర్విదగ్ధులు కొందఱు కృతియిడుటకు నాయీచిహ్నము లుండితీరవలయు నని వాదించుట కలదు. కృతిపతిని స్తుతించుటయే ప్రతిగ్రంథాదియందును గనుపట్టును. అందుచే నిందించు తాత్పర్యముతో రచించిన చంద్రరేఖావిలాపాదులు నరాంకితములు గాకపోవలసివచ్చును. జగ్గకవిగారు నీపద్యము నొకదాని నెత్తుకొని దానిగీతిలో—

తే॥గీ॥ "బోయగొల్లాము"లోఁ గాను పోకయుండ
వేంకటమనీషిచేత నిరంకుశముగఁ
గ్రతువు చేయించితివి నీకుఁ గృతి యొసంగ
నర్హ్మమగు నట్లు చేతు నీలాద్రిరాజ.

అని నొడివియున్నారు. దీనివలన భూషణాత్మకమే కానక్కఱ లేదనియును దూషణాత్మకముగూడఁ గృతియే యగుననియును స్పష్టపడుచున్నది. పనిలోఁ బనిగా నింకొకటి తెలుపవలసియున్నది. పలువురు కవులు స్వకృతకావ్యములను బుత్త్రికగా రూపించియున్నారు. అట్టి రూపణము కవిబ్రహ్మసోమయాజికి నభిమతము కావుననే—

క॥ ఏ నిన్ను "మామ యనియెద దానికిఁగాఁ గావ్యకన్య"

అని మనుమసిద్ధి తన్నుఁ గోరినట్లాయన చిత్రించెను. ఈ రూపణము పురుషునకుఁ గృతి యిచ్చినపుడే సమన్వయించును. గాని స్త్రీలకుఁగాని స్త్రీదేవతలకుఁగాని గృతి యిచ్చినపుడు సమన్వయించదు. మూకపంచశతి లక్ష్మీసహస్రము లోనగు సుప్రసిద్ధసంస్కృతగ్రంథములు స్త్రీదేవతల నుద్దేశించి రచింపఁబడినవి. ఆ స్త్రీదేవతలుగూడ గ్రంథకర్తల కల్లుండ్రే యగుదురా! యని ప్రశ్నించునంతటి ప్రబుద్ధలిక్కాలమునఁ గలరు కావునఁ బ్రకృత మీకృతిప్రదానవిషయమునఁ గూడ నేవో చొప్పదంటుశంకలు బయలుదేఱకపోవని యీవిషయమిటఁ గొండొక ప్రస్తావింపవలసివచ్చినది. ఏదో తెలుఁగునఁ దన గ్రంథమునఁ జోటిచ్చుటయే తుట్టదకుఁ గృతి యిచ్చుట యని యనేక గ్రంథకర్తల ప్రవృత్తివలనఁ దేలుచున్నయది. ఆశీర్వచనాదికము గ్రంథాదియందే యుండవలయు నను నియమమును నక్కఱ లేదు. ఆశీర్వచనమనఁగా మంగళమేకదా?

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని"

అను మహాభాష్యోక్తి నెఱిఁగినవారీమూఁడుచోటులం గాని యిందొక్కచోఁ గాని వీలు ననుసరించి యామంగళము ననుసంధింతురు. ప్రస్తుతము దేవతానమస్కారరూప మంగళముతో నారంభింపఁబడిన యీకావ్యము కృతిపతి నాశీర్వదించుమంగళముతో ముగింపఁబడిన దని విజ్ఞులు గుర్తింతురు గాక.

తీర్థయాత్రికులకొఱకును దదన్యులకొఱకును నన్నమిహా పొంటి నాయా యామార్గంబుల ధర్మసత్రమ్ములు నెలకొల్పిరి. ఆయా సత్రమ్ములెల్ల నిపుడు పూర్తిగా నశించినవిగదా? అవి నశించుటకుఁగారణమ్ములు పెక్కులున్నను, అందు ముఖ్యకారణము బ్రాహ్మణేతరుల యాజమాన్య మనక తప్పదు. ఆయా సత్రాది శాశ్వతధర్మదాతలలోఁ గొందఱుమాత్రము కాదు నూటఁదొంబదులు బ్రాహ్మణేతరులు లేదా? కొందఱు ద్విజేతరులు నుందు రనుట సత్యదూరము కాదు గాని ఆయాదాత లుద్దేశించినది ముఖ్యముగా బ్రాహ్మణులనే కాని తదితరులను గాదు. తదితరవర్ణస్థులు సత్రాన్నము నభిలషించుటకూడఁ బూర్వకాలమ్మున నేవికలాంగులో తప్ప నున్నట్లును లేదు. ప్రస్తుత మట్టిసత్రములు చాలవఱకుఁ బూర్తిగా లోపించినవి. కొన్ని నామమాత్రావశిష్టములుగా నుండి యెట్లో జరుగుచున్నను దాతలయుద్దేశానుసారము జరుగుట లేదు. పూర్వ మొకదేవాలయపు ధర్మకర్త ఆదేవాదాయద్రవ్యమునుండి కొంతభాగమును వేదశాస్త్రపాఠశాలకని యేర్పఱచె. దాత ద్విజేతరుఁడు, పిదపఁ బాఠశాలానిర్మాతయును ద్విజేతరుఁడే, అట్లయ్యునాకాలమ్మునకుఁ జతుర్థులకు వేదాధ్యయనాదరమున్నట్లు లేమిం జేసి బ్రాహ్మణుల నుద్దేశించియే అది నెలకొల్పఁబడినది. ప్రస్తుత మాపాఠశాల చతుర్థజాతివారి యాజమాన్యముక్రిందికి వచ్చినది. చతుర్థులకుఁగూడ వేదము చెప్పవలయునని శాసించిరి. ఛాందసు లందులకు సుఖసుఖాలనొడంబడుదురా? తుద కాపాఠశాలగతి—

"మూలచ్ఛేదీ తవపాండిత్యప్రకర్షః"

అను నభియుక్తోక్తికిఁ బ్రథమోదాహరణముగా మాఱినది. ఇట్లధోగతికి వచ్చినధర్మసంస్థ లెన్నో ప్రత్యక్షమ్ముగా నేఁటికాలప్సేవరీత్యమునకు గుఱి యగుచున్నవి. అది యటు లుండె.

క॥ సంతానసహీనుఁడును శ్రీ
మంతుఁడు బ్రాహ్మణుఁ డొకండు మాగ్రామమునం
గొంతతనధనము శుద్ధ
స్వాంతుఁడు సత్రమున కిచ్చె జగమెఱుఁగంగన్. 51

ఆ॥ వె॥ మరణశాసనమున మాన్యులా
"ట్రస్టీల" పేళ్లు చేర్చి చేసెఁ బెద్దయత్న
మదియుఁ దుదకు నేఁడు పదటనే కలిసె నే
మనఁగవచ్చుఁ గాలమహిమ మకట? 52

తే॥ గీ॥ అన్న మిడరు "సదావర్తి" అసలె సున్న
అందుకు విచారపడను నే నెందు కిఁక వి
చార మన్నను నో రెండి జలముటన్నఁ
గూడ నిడుపాటి వీ లొనఁగూడ దచట. 53

ఉ. ఎన్నియొ యున్న విట్టి వొకఁ డెన్మిదిలక్షలధర్మదాత లో
కోన్నతుఁ డుండె శూద్రుఁడుమహోత్తముఁ, డాయనఘాత్ముద్రవ్యమే
చిన్నమొ? తప్ప సర్వమును జేరిన దేడకొ? నేఁడొ? రేపొ? ఆ
పున్నెపుఁగార్యముల్ సమసి పోయెడి దుర్దశ వచ్చె నక్కటా? 54

క॥ తనకుంబున్నెమ్మున కని,ధనవంతుఁడు దాతచేయుధర్మములొందకున్
ఘనులగువారలనరక,ములనకని చెడినకట? యెట్టిమోసమొ?యిదియున్.

క॥ శ్రీమంతుడు లోసగు న,ద్దామయశులు కాశియందు ధర్మార్థముగా
నేమించిన సత్రమ్ముల, కేమియు దిక్కుపును లేమియే వినఁబడెడిన్.

సీ. అల్ల యాసంతశయనమహారాజు, పెట్టించిన సత్ర మిద్దేమియయ్యె?
తంజాపురీధరాతల నేతపేర్మిఁ, బెట్టించినసత్ర మిద్దేమి యయ్యె?
ఆయీ మహారాజు సర్ఫోంగి యచటఁ,బెట్టించినసత్ర మిద్దేమియయ్యె
సింధ్యామహారాజు శ్రీనైష్ణపుఁ డు, పెట్టించినసత్ర మిద్దేమియయ్యె.

తే॥ గీ॥ నక్కటా? కాశిఁ జదువువిద్యార్థి కిప్పు
డన్నమే లేదఁటని వినసయ్యె నెట్టి
కాలవైపరీత్యంబబ్బెఁ గాశివంటి
క్షేత్రమున కన్యములమాట చెప్పనేల. 57

తే॥ గీ॥ పగటనే కాక రాతిరిభాగమందు
నన్న సదుపాయముండె విద్యార్థి కప్పు
డది సమస్తము చెడె నని యాలకింప
నయ్యె నీకాలమహిమ నేమనఁగ వచ్చు. 58

వ॥ ఈవిషయము నుద్దేశించి వ్రాయనెంచిన నో [illegible]
పుణ్యాత్ములను మఱెందఱో పరమపాపాత్ములనుగూడ నొప్పించి [illegible]
వ్రాయవలసివచ్చును దానంజేసి కబ్బ మ్మిబ్బడిగాఁ బెరుఁగు నని యిం
తతో దీనిని వదలి ప్రస్తుత ముపక్రమింతు. 59

ఉ॥ ఈవిషయంబు సర్వ మెఱు లెవ్వరు చెప్పకయున్న [illegible]
ద్ధీవరుఁ డప్పజోసి తన తెల్వికతాన నెఱింగి "యంకితం
బీవిపదంబు రాశిఁ దరియించి మనుష్యు నవశ్యమునే యు[illegible]
భావుకుఁగా నొనర్చు ననుభావముతో [illegible] 60

ఆ॥వె॥ అప్పజోసికోర్కె అభ్యర్థితంబని తోఁచెనాకు [illegible]
నిట్లొనర్చియతనిఁగృతకృత్యుఁజేయుమం,చాత్మకామ [illegible]లయ్యె.

క॥ నాయారోగ్యమ్మునకని, ఆయంబన్ గుఱిచి యే[illegible]? అ[illegible]బద్యాన్
వేయికి దాదా పగునం,చా యీవిషయం బె[illegible]గ నాది [illegible]నుసె.

క॥ అది యట్టులుండ నెవరో? [illegible]
"గుదురుదు"రనియనుకొంటినే?,సదనమ్ము[illegible]

తే॥గీ॥ ఇంటివేల్పు కామేశ్వరియే ఘటించె
నంతియే కాకయున్న నే నపుడ యేగ

వలసి యున్నను నేగక నిలుచు నెట్లు
నిలుచుటయుఁ గూడ నంబయే నిర్వహించె. 64

మ॥ భగవద్భక్తుఁడు కృష్ణశాస్త్రి కెవరో బాలున్ సమర్పించి సొం
పుగ నింటి న్నిలఁబెట్టి, రేను గవి తాపుష్పోపహారమ్ము చేఁ
దగ నప్పండితు నన్వయంబు ననవద్యశ్రీకమున్ జేయఁగాఁ
దగదే? పున్నెముఁ బూరుషార్థమును నేతత్కృత్యమం దొప్పుటన్.

ఉ॥ ఊఁతము గాఁగ నేచరితమో? గొని యేడ్తెఱఁ గొన్ని పద్యముల్
చాతురి మై రచించిన రసం బట నుండిన నుండుఁగాక పు
ణ్యాతిశయమ్ము నెల్లెడల నందముఁ జందము గల్గుపక్కి మైఁ
జేతమునన్ వెలార్చు కృతి చేకుఱు నే? సుకృతంబు లేనిచో. 66

ఆ॥ వె॥ అతని కిచ్చునూహ యాత్మలో నుదయించి
నేను జేయలేదు దీని, నింటి
వేల్పు తుదకు నిట్లు విధియించె నాతని
యందుఁ గల్గు పేర్మి కంతు గలదె. 67

తే॥ గీ॥ కృతికి "సౌభాగ్యకామేశ్వరి" యను పేరు
మున్నె నేఁ బెట్టితిని దీని మొదలు వెట్టు
పిదప నాకబ్బె నెంతయో ముదము సౌఖ్య
మిది కృతీశ్వరునకును దానిచ్చు శుభము. 68

క॥ ఎందుకుఁ గొఱగాని నను న్నందర్శింపంగఁ జేసె సభ లెన్నెన్నో
వందలు వేలు బహూకృతు లందంగాఁ జేసె దీనియాస్వాశ అనదే.

క॥ ఇందేమి గలదొ? తన్మహి
మం దెలియఁగఁ జాల నేను మాటికి నిది న
న్నుం జేర్చె మోదవార్ధి
యం గని సానందమున నెంతు సద్గురునిన్, 70

ఉ॥ ఇట్టికృతిన్ గ్రహించుటకు "నీతఁడు చేసినపున్నె మెట్టిదో?
నెట్టనఁ జెప్పు" మన్న నది నే వచియింపఁగఁ జాల, శాస్త్రి చే
పట్టినబాలకుండు గుణవత్తముఁడై కులముద్ధరించున
ప్పట్టున దీని కున్నగుణవత్త ఒయల్పుడు నంచుఁ దోఁచెడిన్. 71

చ॥ ధనికులయం దొకానొకఁడు తత్త్వవిదుండును నుండు నంకితం
బున కని వాఁడు యత్నమును బూని యొనర్పఁడు గాని ప్రోత్సహిం
చినయెడ నెట్టకేల కది స్వీకృతి సేయఁగ సమ్మతించు నీ
యనఘునిబోలెఁ గోరుసుకృతాత్ములు మృగ్యులు నాఁగఁ జెల్లదే.

తే॥ గీ॥ అడిగినం గృతి నిచ్చిన యట్టివారు
నడుగకున్నను గృతి నిచ్చినట్టివారు
కలరు మాకృతి నాయకగణమునందు
నిట్టివిద్వాంసుఁ డందొకఁడేని లేడు. 73

క॥ సుతను వరున కిడుపట్టునఁ
"బితా శ్రుత" మ్మనుచుఁ బల్కు పెద్దల యాస
మ్మతి కీకృతిప్రదానము
కుతుకం బిడులక్ష్య మగుచుఁ గొమరారుఁగదా? 74

చ॥ గురుఁ డలబ్రహ్మపండితుఁడు కోరఁడుగాక కృతజ్ఞతాపరి
స్ఫురణకునై యొసంగితిమి పూర్వము భాగవతంబు; కృష్ణనీ
వరుఁ డితఁ డంతవాఁ డనఁ బ్రపంచక మొప్పదు గాని పాండితీ
పరిణతధీవిశారదుఁడు భవ్యగుణాకరుఁ డంట కొప్పదే. 75

తే॥ గీ॥ అడుగుటయె కష్ట మడిగినయపుడు "లేదు
పొ"మ్మనుట అంతకన్నఁ గష్ట మ్మటంచు
నష్టకష్టమ్ము లెఱిఁగిన శిష్టు లందు
రట్టికష్టమ్ము తప్పించె నంబ నాకు. 76

మ॥ తనపైఁ బద్యములన్ రచింపఁగ నిమిత్తమ్మొండు గల్పించి యీ
ఘనుఁ బ్రేరేపి "కృతిన్ గ్రహింపు" మని; "సత్కార్యమ్మిటుల్ సేయు" మం
చును నన్నుం బురికొల్పి సర్వము నిటుల్ శోభాయమానంబుగా
ననుసంధించిన యింటివేల్పు కృప నా కాశ్చర్యమున్ గొల్పెడిన్.

ఉ॥ కూఁతులఁ గంటి నిర్వుర నొకొండును నల్లుఁడు పండితుండు నా
చేతము వచ్చినట్టిఁడు ప్రసిద్ధుఁడు రాఁగల నోము నోఁచఁగా
నైతి" నటంచు చింతిలెడి యస్మదదృష్టము పండి దేశికుం
డీతఁడు నిర్వు రల్లురయి యిచ్చు వరించిరి కావ్యకన్యలన్. 78

క॥ కృతి గావలె నని కోరెడి
స్థితిమంతులుగలరు వారు చెప్పి యెదో మా
కుతుకమ్ము దీర్పు మందురు
చతురుఁడితఁడు గాని యె సర్వ సంసిద్ధంబున్

ఉ॥ అంతియకాని "క్రొత్త దొక టల్లి యొసంగుఁ" డటన్న నీయఁగా
నెంతునో? వార్ధకం బగుట "నీయఁగ లే" ననియే వచింతునో?
సంతస మయ్యె నీయలఘుజాగ్రదుదారమనీష, కీతఁ డ
త్యంతము వృద్ధు నే నటులె మైత్రి నెనం డిది నమ్ముఁ జాలఁ శిన్ 80.

ఉ॥ జాతకచక్రవర్తి గ్రహచారము లెన్నది వత్సరమ్ము లం
చే తగ నాయువున్ దెలుపు నిర్వుర; కయ్యది నమ్మ యూరకే
యీఁతకుఁ బడ్డ నేమగునో? "యెప్పటి దప్పుడె యాటశ్రీ" యు మం
చాతఁడు నేనునుం దలఁచి మైత్రిమి ధన్యుల మంబికాకృపన్. 81

వ॥ ఇట్లుమందంబగు నానందమ్మునం బొదలుచు నీకృతి నిచ్చుట కృతీశ్వరుని గేహమ్మునందు జరుగుట సుకవినమయసిద్ధం బైనను నందులకు నాశక్తి యనుకూలింపమిఁ జేసియుఁ దిక్కనాదులు కావ్యంబును

గన్యకగా రూపించి యుంటచేఁ దత్పరిణయప్రియంబగు సీయుత్సవంబు కన్యకపుట్టినింటఁ జరుగుటయే శిష్టాచారప్రాప్తం బగుటంజేసియు నయ్యప్పజోసిని మద్గృహమ్మునకే రప్పించి ఆచారంబు నిర్వర్తించితి.

తే॥ గీ॥ ఆయురారోగ్య భాగ్యభోగ్యాదికంబు
లప్పజోసికులీనున కబ్బుఁగాక
ఇహపర శ్రేయములకెల్ల నెల్లయగుచు
నంబికాస్తవ మిమ్ముఁగి యలరుఁగాక. ౭౨

'సర్వే జనా స్సుఖినో భవంతు'



వెం॥ శా॥ శతావధాని.



# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 8 | కాతాఘు | కాత్మాఘు |
| ,, | 11 | దను | దము |
| 10 | 1 | ర్జరితంపొబుల్ | ర్జరితంబుల్ పొన |
| 19 | 12 | నుండెందల్లి | కుంబాలయ్యో |
| 29 | 19 | రైర్వర్య | రైశ్వర్య |
| 40 | 5 | నలఁత | నలఁక |
| 66 | 20 | దత్త్వజ్జతన్ | దత్త్వజ్ఞతల్ |
| 69 | 9 | చెదిరింపన్ | బెదరింపన్ |
| 74 | 8 | స్థాపించుఁగా | స్థాపింపుగా |
| 89 | 7 | యంచ్నా | యాచ్ఞా |
| 96 | 12 | మ్మా | మ్నా |
| 113 | 18 | గతి | గృతి |

(షరా) 111 వ పుటలో, తుట్టతుదిపంక్తిలో, 'ప్రాజ్ఞుండుండియు' అనునది 'ప్రాజ్ఞుండు సుతుండుండియు,' అని చదివికోదగు, మరియు నింకను ద్విత్వవ్యత్యాసములు, న, స, ప, వ, లోనగు వ్యత్యాసములు, పెక్కులుగలవు. వానిని సవరించుకొనుటకు సహృదయుల నభ్యర్థింతును.

వెం॥ శా॥ శతావధాని.